నవ్య వీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కొంటికి) | : | రూ. 5,000 |

## కథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో *10* పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది *6* పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లి - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy.com)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

కథలు చేరవలసిన ఆఖరు తేది

**31 జనవరి 2017**






## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: తమన్నా
ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*

*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### అతి సర్వత్ర వర్జయేత్

ఆమెకు ఏభై నాలుగేళ్లు. హార్ట్‌టాక్‌తో ఆసుపత్రిలో జాయినైంది. చావుబతుకుల్లో ఉంది. దేవుడు ప్రత్యక్షమయ్యాడు.

"నా పని అయిపోయినట్టేనా?" దేవుణ్ణి అడిగిందామె.

"లేదు! నువ్వింకా ముప్పైనాలుగేళ్ల బతుకుతావు." చెప్పాడు దేవుడు.

త్వరగానే కోలుకుందామె. అయినా ఆసుపత్రిలో ఉండి తీరిగ్గా ఫేస్-లిఫ్ట్ సర్జరీ, లిపోసెక్షన్, టమ్మీ టక్ తదితర చికిత్సలన్నీ చేయించుకుంది. ఆఖరికి జుత్తు రంగు కూడా మార్చుకుని మరీ డిశ్చా

ర్జ్ అయింది. టాక్సీలో ఇంటికి వచ్చింది. ఇల్లు ఆ పక్కగా ఉంది. ఈ పక్కగా టాక్సీ ఆపాడు డ్రైవర్. రోడ్డు క్రాస్ చేసి ఇంటికి చేరుకోబోతుంటే ఊహాతీతంగా ట్రక్కు వచ్చి ఆమెను ఢీకొంది. దాంతో ఆమె అక్కడికక్కడే మరణించింది. అప్పుడు కూడా దేవుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"ఇంకా ముప్పైనాలుగేళ్ళు బతుకుతానన్నావు, అప్పుడే చంపేశావేంటి?" అడిగిందామె.

"నువ్వా?" ఆశ్చర్యపోయాడు దేవుడు. తప్పు చేసినట్టుగా తలగోక్కున్నాడు. అన్నాడిలా.

"సారీ! పోల్చుకోలేకపోయాను."

• **అందుకే సర్జరీలూ, మేకప్పులూ అతి కాకూడదు.**

### క్రెడిట్‌కార్డ్

బ్యాంకు నుంచి ఫోన్.

"హలో మిసెస్ ప్రదీప్! బెస్ట్‌డీల్స్‌లో మీకో మంచి క్రెడిట్‌కార్డ్ ఆఫర్ చేస్తున్నాం.

యాన్యువల్ ఛార్జెస్ లేవు.

మీ బాలెన్స్ మీద మూడు నెలల వరకూ ఇంట్రస్ట్ పే చెయ్యనక్కర్లేదు.

బిగ్ క్రెడిట్ లిమిట్.

నో పెనాల్టీస్ ఆన్ ఓవర్ స్పెండింగ్."

"నో థాంక్స్" అంది మిసెస్ ప్రదీప్. అయినా ఇంకా ఏదో చెప్పబోతుంటే అవతలి గొంతుని వారించి, మిసెస్ ప్రదీప్ అన్నదిలా.

"మా వారు ఉన్నారు కదా!

జీవితాంతం జీరో ఫీ.

నో స్పెండింగ్ లిమిట్.

పెనాల్టీ ప్రసక్తే లేదు.

రీపేమెంట్ కూడా చెయ్యక్కర్లేదు. అర్థమైందా?"

అర్థమైంది అన్నట్టుగా అటు గొంతు మూగబోయింది.

**-వైనతేయ**

w m w

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 45

11-1-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

మొదటి పేజి

# బొమ్మలకొలువు

పేరుకు అది అలకాపురి. చూసేందుకు శుద్ధ పల్లెటూరు. పల్లెటూరని పచ్చగా లేదు. పడిపోయిన పెంకుటిల్లూ, ఎండిపోయిన చెరువూ, కూలిపోయిన గుడి గోపురమూ... బాధగా భయంగా ఉంది వాతావరణం. చూసి అవాక్కయ్యాడు రంగబాబు. నిల్చున్నచోటు నుంచి నాలుగు అడుగులు ముందుకు వేశాడు. రచ్చబండకు చేరుకున్నాడు. బండమీద ఒక్కరు లేరు. బండకు ఇటుగా బాషా టీకొట్టు కూడా లేదు. కొంచెం ముందుకు నడిచాడు. పుణుకులసీతాలు పాక కనిపించింది. ఉందా? పిలిచి చూశాడు. సమాధానం లేదు. లోపలికి తొంగి చూశాడు. పాకలో రెండు కుక్కలు పడుకుని కనిపించాయి. దేవిడి దగ్గరకు వచ్చాడు. దేవిడిలో అంతెత్తు కుర్చీలో కూర్చుని చుట్ట తాగుతూ వచ్చే పోయే వారందరినీ పలకరించే రాజుగారు కనిపించలేదు. ఆ కుర్చీ కూడా లేదు. మలుపు తిరిగితే అరుగుమీద ఆచారిగారు కనిపించేవారు. వైద్యం చేసేవారు. ఆయనా లేడు. అరుగు కూడా అణగిపోయి కనిపించింది. ఏమైపోయారంతా? ఎక్కడికి వెళ్లారు? రంగబాబుకేదీ ఊహకి అందలేదు.

చిన్నప్పటినుంచి బొమ్మలంటే ఇష్టం. బొమ్మలు వెయ్యడం కాదు, చెయ్యడం ఇష్టం రంగబాబుకి. చెరువుగట్టు మీది బంకమట్టిని తీసుకుని, కావాల్సిన రూపాన్ని తీర్చిదిద్దేవాడు. వినాయకచవితికి వినాయకుణ్ణీ, దసరాకు అమ్మవారినీ రంగబాబు తీర్చిదిద్దితే ఆ దేవతలు కట్టెదుట నిల్చున్నట్టుండేది. మట్టిబొమ్మలైనా మైనపుబొమ్మల్లా ఉండేవి. గొప్పగా చెప్పుకునేవారు. రంగబాబు పేరు అలా అలకాపురి దాటి అమెరికా చేరింది. రమ్మని అక్కణ్ణుంచి ఆహ్వానం అందింది. చేతినిండాపని, కావాల్సినంత డబ్బు. ఉంటాడా? పరిగెత్తాడక్కడికి. బాగా సంపాదించాడు. అయితే ఆ సంపాదన శాపం అయింది. అతని కుటుంబం చెల్లాచెదురైంది. రంగబాబు ఒంటరివాడయ్యాడు. ఒంటరి రంగబాబు అమెరికాలో ఉండలేక వెనుతిరిగి అలకాపురికి చేరుకున్నాడు. అయినవారికోసం, ఆత్మీయులకోసం వీధివీధి తిరగసాగాడు. తిరుగుతున్న రంగబాబుని పలకరించాడో వ్యక్తి. ఎవరు కావాలని అడిగాడు. అడిగిన వ్యక్తిని గుర్తుపట్టాడు రంగబాబు. చిన్ననాటిస్నేహితుడు ముత్యాలు అని మురిసిపోయాడు. కౌగిలించుకున్నాడతన్ని. కన్నీరుపెట్టుకున్నాడు. తన కథంతా వెళ్లబోసుకుని, ఊపిరి పీల్చుకున్నాడు రంగబాబు. అప్పుడడిగాడు. ఊరెందుకిలా ఉంది? ఏమైపోయారంతా? పెద్దతనంతో పోయినవాళ్ళు పోగా, పిల్లలు రెక్కల గుర్రాలెక్కి ఎక్కడెక్కడికో ఎగిరిపోయారన్నాడు ముత్యాలు. ఊరంటే చెట్టూ, పుట్టా కాదు. గుప్పెడు గుండెలు అంటూ భోరుమన్నాడు. పాతతరం లేదు, కొత్తతరం లేదు. పక్షులు లేని గూళ్లు, పిల్లలులేని ఇళ్లు పల్లెటూళ్లంటూ వాపోయాడు. పల్లెటూరు చూడదగ్గది కాదట! ఇక్కడ అందం లేదంటున్నారు, ఆనందం లేదంటున్నారు, ఎందుకు రావాలంటున్నారు? రానంటున్నారు పిల్లలంటూ బిక్కుబిక్కుమన్నాడు. తట్టుకోలేకపోయాడది రంగబాబు.



పిల్లలు రావాలి! పల్లెటూళ్లు చూడాలి! అందాలూ, ఆనందాలూ ఇక్కడే ఉన్నాయి. ఉన్నాయని నిరూపించాలి అనుకున్నాడు రంగబాబు. నడుము బిగించాడు. పడిపోయిన పెంకుటిళ్ళను లేపి నిలబెట్టాడు. ఎండిపోయిన చెరువులో జల పుట్టించాడు. కూలిపోయిన గుడిగోపురాన్ని లేవనెత్తి, భోరవిరుచుకునేట్టు చేశాడు. రచ్చబండ మీద జనాన్ని సృష్టించాడు. ఇటుగా బాషానీ, టీకొట్టునీ కల్పించాడు. పుణుకులసీతాలునీ, ఆమె అందాల్నీ ఆరబోశాడు. దేవిడీలో కుర్చీ, కుర్చీలో చుట్టతాగుతున్న రాజుగారినీ కూర్చోబెట్టాడు. మలుపులో అరుగునీ, అరుగు మీద ఆచారిగారినీ ప్రత్యక్షం చేశాడు. అలాగే ఆవుల్నీ, గేదెల్నీ, గోపాలకుల్నీ, తోపులో లేళ్లనీ, కుందేళ్లనీ, కొండల్లో పులుల్నీ, సింహాలనీ, ఏనుగుల్నీ, ఎలుగుల్నీ... బొమ్మలు చేసి, కొలువు తీర్చాడు. అలకాపురిని చూడముచ్చట చేశాడు రంగబాబు. ఎక్కడెక్కడివారో అలకాపురి బొమ్మలకొలువుని చూడవస్తోంటే అక్కడి వారు ఎక్కడ ఉన్నా ఎందుకు రారు? రాసాగారు. ఊరు కళకళలాడింది. చెరువు నీరు తళతళలాడింది. పెద్దలు పిన్నలయ్యారు. పిన్నలు పెద్దలయ్యారు. నవ్వులు విరిశాయి. వెన్నెల కురిసింది. కావాల్సింది అదే! ఆనందించాడు రంగబాబు. బంకమట్టి చేతుల్ని నిండుగా చూసుకుని, ముద్దుపెట్టుకున్నాడు వాటిని.




## క్యాష్ ఆన్ డెలివరీ

బ్యాంకుల దగ్గరా, ఏటీఎంల దగ్గరా క్యూల్లో నిలబడి విసిగిపోయారా? అంతసేపు పడిగాపులు పడినా డబ్బులు అయిపోయాయనో, ఇంతే మొత్తం ఇస్తామనో చెప్తున్నారు కదా. చేతుల్లో డబ్బులు ఆడటమే కష్టమైపోయిందా? అలాంటివారి కోసమే ఈ తీపి కబురు అంటున్నారు స్నాప్‌డీల్‌వారు. మీకు ఎంత క్యాష్ కావాలో చెప్పండి, డోర్ డెలివరీ చేస్తాం అంటోంది.

ఇటీవలే గ్రోఫర్స్, ఓలా క్యాబ్స్ ఈ తరహా క్యాష్ ఆన్ డెలివరీని ప్రారంభించాయి. వాటి తర్వాత స్నాప్‌డీల్ క్యాష్ డెలివరీ చేయడానికి ముందు కొచ్చింది. క్యాష్ ఎట్ హోమ్ సర్వీసుని ప్రారంభించింది. రెండువేలు బుక్ చేసుకుంటే, తెల్లారేసరికి మీ పర్సులో నోట్లు చేరిపోతాయి. ఈ సర్వీసు ప్రస్తుతం బెంగళూరు, గుర్గావ్‌లో మాత్రమే ఉంది. క్యాష్ ఇచ్చినందుకు నామినల్ ఫీజుకింద ఒక రూపాయి మాత్రమే తీసుకుంటున్నారు. కస్టమర్ దగ్గరకి డబ్బు తీసుకెళ్లి పీఓఎస్ మిషన్ ద్వారా వాళ్ల ఆర్డర్ చేసిన అమౌంట్ స్వైప్ చేసుకుంటారు. ట్రాన్సాక్షన్ క్లెయిమ్ అవగానే డబ్బు అందజేస్తారు. ఏ బ్యాంక్ ఏటీఎం కార్డయినా పర్లే



దంటున్నారు. ఎటువంటి కండీషన్లు లేవంటున్నారు. ఫలానా వస్తువు కొంటేనే క్యాష్ ఇస్తామనే మెలికలు కూడా ఏమీలేవు.

భవిష్యత్తులో ఈ సేవలను మరికొన్ని పెద్ద నగరాలకు విస్తరించాలని చూస్తున్నారు. డీమానిటైజేషన్ ప్రభావంతో, ప్రజల రోజువారీ అవసరాలు తీర్చాలనే ఉద్దేశంతో క్యాష్ ఆన్ డిమాండ్ సర్వీసు తీసుకొచ్చామని స్నాప్‌డీల్ కో ఫౌండర్ రోహిత్ బన్సల్ అంటున్నారు.

డెలివరీ స్టార్టప్ గ్రోఫర్స్ ఇటీవలే ఎస్ బ్యాంకుతో టై అప్ అయి క్యాష్ డెలివరీ సదుపాయాన్ని కస్టమర్ల దగ్గరకి తీసుకెళ్లింది. ముంబై, బెంగళూరు, గుర్గావ్‌లో మాత్రమే ఈ సేవలు ఉన్నాయి. ఏ అకౌంట్ హోల్డరైనా రెండువేల వరకు నగదు అందిస్తారు. కాకపోతే స్నాప్‌డీల్ మాదిరి కాకుండా.. రెండువేలు విలువైన వస్తువులు కొంటేనే క్యాష్ ఇస్తామనే కండిషన్ పెట్టింది.

ఓలా క్యాబ్స్ కూడా ఎస్ బ్యాంకుతో టై అప్ అయి మైక్రో ఏటీఎంల ద్వారా క్యాష్ డెలివరీ చేస్తోంది. ఈ రెండూ కలిసి ఇటీవలే మొబైల్ ఏటీఎంని లాంచ్ చేశాయి. ఏ బ్యాంకు ఖాతాదారుడైనా రెండువేల వరకు డ్రా చేసుకునే సదుపాయం కల్పించారు. దాదాపు పది సిటీల్లో 30 లోకేషన్లలో ఎస్ బ్యాంకు బ్రాంచీలు, ఏటీఎంలు ఉన్నచోట మొబైల్ ఏటీఎం సర్వీసులున్నాయి.

# మెయిల్ బాక్స్

### అద్భుతమైన 'మొదటిపేజీ'

నవ్య వీక్లీలో అద్భుతమైనది 'మొదటిపేజీ'. ఇందులో ఆసక్తి కలిగించే విషయమే కాకుండా, సమాజానికి ఒక మంచి సందేశం కూడా ఇస్తున్నారు. నేను ప్రతివారం మొట్టమొదట చదివేది 'మొదటిపేజీ'. తర్వాత మిగతావన్నీ చదువుతాను. ఇంత మంచి విషయాలు అందిస్తున్నందుకు కృతజ్ఞతలు.

-పెద్దవెంగారి, ఈ మెయిల్

### సాఫ్ట్‌వేర్ కంపెనీ పాత్రల్ని కళ్లకు కడుతున్న సీరియల్

నేను నవ్య వీక్లీ ఫ్యాన్‌ని. స్టోరీస్ అన్నిటినీ చదువుతున్నాను. కొత్త సీరియల్ సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు చాలా బాగుంది. నేను కూడా ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నాను. రచయిత్రి రాసిన పాత్రలు ప్రతి ఆఫీస్‌లో అచ్చం అలాగే ఉంటాయి. చెప్పాలంటే అవి కళ్లముందు కనిపిస్తున్నాయి. పాత్రలు కూడా చాలా సహజంగా నిజానికి దగ్గరగా ఉన్నాయి.

-టి.సిద్దార్థ, ఈ మెయిల్

### నవ్యకు సరికొత్త అందం

హెబ్బాపటేల్ ముఖచిత్రం ఈ వారం నవ్యకు సరికొత్త అందాన్ని తెచ్చింది. సినీనటి జీవిత ఇంటర్వ్యూ ద్వారా ఆమె అంతరంగం తెలుసుకున్నాం. జీవితారాజశేఖర్ జంట చూడముచ్చటైనది. మా అభిమాన నటి జీవితగారి గురించి ఎన్నెన్నో విషయాలు తెలుసుకున్నాం. దడపుట్టించే ప్రదేశాలు భయం కలిగించినా సరికొత్త సంగతులు వివరించాయి. సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సరికొత్త రాగాలు పలికిస్తోంది. సీరియల్ ఆసక్తిదాయకంగా ఉంది. రచయితకు ధన్యవాదాలు. మార్నింగ్ కాఫీ 'భలే రుచికరం'గా ఉంటోంది.

-నీలిమసబ్బిశెట్టి, రాజానగరం
తూర్పుగోదావరిజిల్లా

### ఇన్ని వింతలున్నాయా?

నవ్య వీక్లీ డిసెంబరు 28వ తేదీ సంచికలో అన్ని శీర్షికలూ బాగున్నాయి. ఆరోగ్యమే మహాభాగ్యం, దడపుట్టించే ప్రదేశాలు చదివి చాలా విషయాలు తెలుసుకున్నాం. మనం నివసించే భూగోళంపై ఇన్ని వింతలున్నాయా? అనిపిస్తోంది. రిటైర్మెంట్‌పై దిగులొద్దు శీర్షిక చాలా బాగుంది. ప్రస్తుతం దేశంలో 60 దాటిన వృద్ధులే ఎక్కువ. ఈ శీర్షిక అందరికీ చాలా ఉపయుక్తం.

-రాపర్ల లోకబాంధవ, మచిలీపట్నం

### ఔరా అనిపిస్తున్న స్కిట్లు

మార్నింగ్ కాఫీ స్కిట్లు మెరుపు ముగింపులతో ఔరా అనిపిస్తున్నాయి. యాభై రూపాయల నోటు ఉదంతంలో కారుణ్యం ఏరులై ప్రవహించింది. లోకంలో జాలి, దయ, మంచితనం అంతరించిపోయాయనుకునేవారికి మంచిమనసు ద్వారా కళ్ల తెరిపించారు శర్మగారు. పిల్లలతో కొద్దిసేపు గడిపితే కలిగే ప్రయోజనాలు తెలిశాయి. సురభి వింతలు ఆశ్చర్యపరిచాయి. దడపుట్టించే ప్రదేశాలు భయాసక్తులు కలిగించాయి.

-కృష్ణ మాధవరపు, కాకినాడ

### హెల్త్ ఎవేర్‌నెస్‌నిచ్చే ఆరోగ్యమే మహాభాగ్యం

నేను నవ్య వీక్లీ ఫ్యాన్‌ని. ప్రతివారం అన్ని కథలూ, సీరియల్స్, ఫీచర్స్ వదిలిపెట్టకుండా చదువుతాను. వారం వారం మీరు అందిస్తున్న 'ఆరోగ్యమే మహాభాగ్యం' శీర్షికలోని అనేక అంశాలు ఎంతో ఉపయుక్తంగా ఉంటున్నాయి. వాటిని ఫాలో అవుతున్నాం. ఏ వారం వదిలిపెట్టడానికి అవకాశంలేని రీతిలో ఎప్పటికప్పుడు సరికొత్త సంగతులు అందిస్తూ మమ్మల్ని ఆకట్టుకుంటున్నారు.

సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్ బాగుంటోంది. సురభి వింతలు సూపర్. సినిమా వార్తలు, జోకులు అన్నీ మాకు వారం వారం విందు చేస్తున్నాయి. హాట్సాఫ్ టు నవ్య.

-విశ్వేశ్వరశర్మ, నిండ్రకొలను

### పిల్లలతో గడపాలి నిజమే!

ఆరోగ్యమే మహాభాగ్యం శీర్షికలోని అంశాలు బాగుంటున్నాయి. ఏం తినాలో, ఎలా తినాలో, వంటింటిని ఎలా ఉపయోగించుకోవాలో వంటి విషయాలు చక్కగా చెబుతున్నారు.

తల్లులు తమ పిల్లలతో రోజుకు అరగంట గడిపితే పిల్లల తెలివితేటలు పెరుగుతాయని తెలిసి ఆశ్చర్యపోయాం. కేరట్‌కాదు, మనకు మేలుచేసేదేదైనా అమితంగా తింటే చేటే. భూగర్భ పట్టణం, కబుర్లు చెప్పేకారు, అద్భుతమైన హైవే, అంశాలు అమితంగా ఆకట్టుకున్నాయి. కథలు, సీరియల్స్‌కు వేస్తున్న చిత్రాలు జీవం ఉట్టిపడుతూ ఎంతో బాగుంటున్నాయి. దడపుట్టించే ప్రదేశాలు చదువుతుంటే నిజంగా దడపుట్టింది.

-టి.ప్రకాష్, విశాఖపట్నం
-స్నేహమాధురి, పెద్దాపురం

### దడపుట్టింది

దడపుట్టించే పర్యాటక ప్రదేశాల కథనాలు జలదరింపజేశాయి. ఫిరోజ్‌షా కోట్ల భవంతి సందర్శకులకు అనుమతి లేకపోవడం ఆశ్చర్యపరిచింది. యువతకు మంచిమార్గం చూపించే చిత్రాలు రావాలన్న జీవిత తపన బాగుంది.

-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి,
విశాఖపట్నం

## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం:** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.





## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.



# నవ్వు నవ్వించు

**ఆనందానికి చిహ్నం నవ్వు.... సంతోషాన్నీ, సంతృప్తినీ నింపేది నవ్వు. మనసుకు మానసికోల్లాసం, విశ్రాంతిని ఇచ్చేది నవ్వు. 'లాఫ్ అండ్ లాఫ్ అంటిల్ యు గెట్ కాఫ్' అనేది ఒక సూక్తి. దగ్గొచ్చేదాకా పగలబడి నవ్వండి అని దీని అర్థం. నవ్వే అదృష్టం కేవలం మనిషికే ఉంది. కానీ ఇప్పుడు నవ్వే భాగ్యం అందరికీ కరువైపోయింది. అందుకే నవ్వడం మళ్లీ ప్రాక్టీస్ చెయ్యమంటున్నారు వైద్యులు. నవ్వును రీడిస్కవర్ చెయ్యమంటున్నారు.**

**జనవరి 10 ప్రపంచ నవ్వుల దినోత్సవం సందర్భంగా ఆ నవ్వుల ముచ్చట్లు మీకోసం...**

సృష్టిలో అందమైనవన్నీ పోటీపడితే అందులో గెలిచేది మనిషి నవ్వే. ఎంతో అందమైన ప్రకృతిని ప్రసాదించిన దేవుడు మన జీవితానికి నవ్వును ఓ బోనస్‌గా ఇచ్చాడు. మోములోని నలభై నాలుగు కండరాలతో ఐదువేల రకాల హావ భావాలు ప్రదర్శించవచ్చు. వీటిల్లో నవ్వుకు ప్రత్యేక స్థానముంది. ఇది మన జీవితాన్ని మారుస్తుంది. నవ్వండి..నవ్వించండి...కానీ నవ్వులపాలు కాకుండా చూసుకోండి!! మరి అలాంటి నవ్వుల గురించిన ముచ్చట్లేంటో మీరూ తెలుసుకోండి.

## నవ్వుల ఆసుపత్రి

అసలు మన దేశంలో హాస్యానికి మొదటి నుంచి ప్రముఖ స్థానం ఉంది. రాజుల ఆస్థానాలలో విదూషకులు ఉండేది నవ్వుల పువ్వులు పూయించేందుకే! బీర్బల్, తెనాలి రామకృష్ణ వంటివారి కథలు గిలిగింతలు పెడతాయి. జానపద గీతాల్లోనూ హాస్యరసం పుష్కలమే. నవ్వడం ఆరోగ్యానికి చాలా మంచిదని డాక్టర్లు చెబుతున్నారు. హాయిగా ఉన్నామనే భావన కలిగిస్తుంది హాస్యం. ప్రపంచమంతటా హాస్యాన్ని ఓ చికిత్సా సాధనంగా గుర్తిస్తున్నారు. అమెరికా, బ్రిటన్ తదితర పాశ్చాత్య దేశాలలో ఆస్పత్రులకు అనుబంధంగా నవ్వుల ఆసుపత్రులు కూడా ఏర్పడ్డాయి. వీటిలో హాస్యచిత్రాలు, వీడియోలు చూపిస్తారు. పెద్ద కారణం లేకుండా నవ్వినవాళ్లని పిచ్చివాళ్లు అనుకుంటే పొరబడినట్టే. కడుపుబ్బ నవ్వేవారు ఒత్తిడి తగ్గించుకోగలుగుతారు. ప్రపంచంలో అందరితో హాయిగా సర్దుకుని బతికేయగలరన్నమాట. తమ సమస్యలను సంకోచాలను పక్కనబెట్టి హాయిగా నవ్వడం ద్వారా మెరుగైన జీవనంతో ముందుకు సాగిపోతారన్నమాట.

## నవ్వుల దినోత్సవం ఆవిర్భవించిందిలా!

వివిధ దేశాలకు చెందిన పన్నెండువేల మందికి పైగా ముంబైవాసులు ఒకరోజు రేస్‌కోర్స్ గ్రౌండ్‌కు చేరుకున్నారు. వారంతా వివిధ రకాల కార్యక్రమాలతో నవ్వుల పంట పండించుకున్నారు. ఈ సమావేశంలో ఆరోగ్యం, అనుబంధాలు వంటి అంశాలపై నవ్వు చూపించే ప్రభావం గురించి నవ్వుల పరిశోధకులు, వైద్య నిపుణులు వారందరికీ వివరించారన్నమాట. ఈ ఉత్సవ విశేషాలన్నీ గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్‌రికార్డ్‌లో కూడా నమోదు అయ్యాయి. వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్ ఈ గిన్నిస్ రికార్డును పరిగణనలోకి తీసుకుని మరింత ముందుకు వెళ్లి ఆలోచించి ముంబైలో ఉత్సవం జరిపిన రోజు జనవరి 10వ తేదీని నవ్వుల దినోత్సవంగా ప్రకటించింది.

## పెదవులపై నవ్వు ప్రవర్తనకు ప్రతీక

అందరినీ నవ్వుతూ పలకరించడం నేర్చుకోవాలి. రోజూ నవ్వుతూ ఆనందంగా గడపాలి.



అలా గడిపితే ఏ రోగం దరికిరాదని డాక్టర్లు అంటున్నారు. మనిషి ఆనందంగా ఉంటే ఆ మనిషి నవ్వులో కూడా ఆనందం ప్రస్ఫుటమవుతుంది. తల ఎత్తి ఎవరివైపైనా చూసినప్పుడు చిరునవ్వులు చిందించాలి. మన చుట్టూ ఉన్న వారిపై చిరునవ్వులు రువ్వుతూ ఆనందించాలి. మన పెదవులపై నాట్యమాడే నవ్వే మన ప్రవర్తనకు ప్రతీకగా నిలుస్తుంది. ఇంటా బైటా మన పనుల్ని చురుగ్గా చక్కబెట్టగల ఏకైక సాధనం నవ్వు. నవ్వడం వల్ల మనం మాత్రమే కాదు ఎదుటివారు కూడా సంతోషంగా ఉండగలుగుతారు. అందుకే 96 శాతం మంది అమెరికన్లు నవ్వే ఆభరణంగా భావిస్తారట.

### నవ్వుతూ నాలుగు మాటలు

నేర్చుకోవాల్సిన అవసరం లేని భాష నవ్వు. అసలు నవ్వడం రాదనే వాళ్లు ఎవరూ ఉండరు. అందరి ముందూ నవ్వడానికి మొహమాటపడే మహామహులు కూడా చాటుకు వెళ్లి నవ్వులు రువ్వాల్సిందే. నవ్వలేని వారిలో సులభంగా మార్పు తీసుకురావచ్చు. అలాంటి వారికి అనుకూలమైన వాతావరణం కల్పించాలి అంతే! ఆహార అలవాట్లు మార్చుకోవడం, వ్యాయామం, ధ్యానం, యోగాలాంటివి చేయడం వంటి కొన్ని టెక్నిక్స్ అలవర్చుకుంటే సరి! నవ్వు వచ్చినప్పుడు బలవంతంగా మనం ఆపగలమేమో కానీ బలవంతంగా మాత్రం మనం నవ్వలేం. ఆడవారి నోట్లో నువ్వుగింజ నానుతుందో లేదో గానీ, వారి నోళ్లల్లో నవ్వులు మాత్రం నానలేవు అని ఓ సామెత కూడా ఉంది.

### నవ్వడం తగ్గుతోందా?!

నవరసాల్లోకెల్లా హాయిగొలిపే రసం హాస్యరసం. ఇది కూడా మానవ జీవితాల్లో తగ్గిపోతోందని ఇప్పుడు సర్వేలు తేల్చిచెప్పేస్తున్నాయి. దీని స్థానంలో కోపం, ముభావం, ఆవేశం, అసంతృప్తి చోటుచేసుకుంటున్నాయి. సంవత్సరాలు, దశాబ్దాలు గడుస్తున్నా వీటి నుంచి మనిషి బైటపడలేకపోతున్నాడు. దానికి ఒకటి కాదు రెండు కాదు, ఎన్నో రకాల కారణాలు ఉన్నాయి. జీవితంలో పెరిగే ఒత్తిడి, పోటీ, వివిధ రకాల సమస్యలు వంటివి ఎన్నెన్నో మనిషికి నవ్వును దూరం చేస్తున్నాయి. ఎన్నో రకాల నవ్వులు మనిషిలోని మనస్సును ప్రతిబింబిస్తాయి. అయినా సరే నవ్వడం మరిచిపోతున్నాం. నేటికాలంలో ఆరోగ్యకరమైన హాస్యం లోపిస్తోంది.

ఈ బిజీ లైఫ్‌లో ఎవరూ ఎవరితోనూ మనస్ఫూర్తిగా నవ్వులు పండిస్తూ మాట్లాడుకునే అవకాశంలేదు. కాసేపు హాయిగా గడిపే తీరిక ఎవరికీ ఉండడం లేదు. ఇలా గడిపితేనేకదా, మనుషుల మధ్య మాటా ముచ్చటా ఉండేది, సంభాషణ కొనసాగేది, అప్పుడే హాస్యం పుడుతుంది. సంభాషణలో చతురోక్తులకి, ఛలోక్తులకి చోటు ఉంటుంది. కానీ అలాంటి అవకాశం, తీరిక ఇప్పుడు లేదు మరి. ఇంతేకాక ఎప్పుడూ ఏవో చికాకులు, ఆలోచనలు, అర్థం లేని లక్ష్యాల సాధన, మరికొందరైతే డబ్బే పరమావధిగా భావిస్తూ ఆ ఉరుకుల పరుగుల బాటలో ఒత్తిడితో కాలం గడిపేస్తుంటారు. అందుకే మనుషులకు నవ్వేభాగ్యం కరువైపోయింది. అందుకే నవ్వడం కొత్తగా నేర్చుకోవాల్సిన అవసరం వచ్చింది. ఇప్పుడు లాఫింగ్ క్లబ్బులు ఏర్పడ్డాయి. నవ్వు మరిచిపోయిన వాళ్లకు నవ్వడం నేర్పిస్తున్నాయి. నవ్వడం ప్రాక్టీసు చేయిస్తున్నాయి. మనలోనే దాగి ఉన్న నవ్వును మనమే చంపేసుకుని, మళ్లీ మనమే డబ్బులిచ్చి మరీ నవ్వటం నేర్చుకుంటున్నాం. ఏదేమైనా మనలోని వికార భావనలన్నింటినీ తొలగించే విరుగుడు నవ్వే. అది అక్షర సత్యం.

**- సంతోషిలక్ష్మి**

## సర్వేలు చెబుతున్నదేమిటి?

ఒక మనిషి ఎంత సంతోషంగా ఉన్నాడో తెల్సుకోవాలంటే, అతను రోజుకు ఎన్నిసార్లు మనస్ఫూర్తిగా నవ్వుతున్నాడో లెక్కవేస్తే సరిపోతుంది. ఒంటరిగా ఉన్నప్పటి కంటే నలుగురి మధ్యలో ఉన్నప్పుడు మనం 30 రెట్లు ఎక్కువ నవ్వుతాం. మగవారికంటే ఆడవాళ్లే ఎక్కువసార్లు నవ్వుతారు. తమకు నచ్చిన వారి సన్నిధిలో అతివలు అధికంగా నవ్వులు కురిపిస్తారట. మనసుకు నచ్చినవాడితో కలిసి ఉన్న సమయంలో హాస్యరసంలో ముంచెత్తే మగవాళ్లను 62 శాతం అమ్మాయిలు ఇష్టపడితే, తమ హాస్యంలో కనీసం 65 శాతంమేరకు స్పందించగల అమ్మాయిలనే అబ్బాయిలు కోరుకుంటారని అధ్యయనాలు చెబుతున్నాయి. అడల్ట్ జోకులు పురుషులకు చక్కిలిగింతలు పెడితే, మహిళలు మాత్రం మంచి హాస్యరసం పలికే జోకులకే ఓటేస్తారట. తమ మీద తామే జోకులు వేసుకుని నవ్వుకోగలిగేవాళ్లకు ఆత్మ విశ్వాసం అత్యధిక స్థాయిలో ఉంటుంది. తమ మీద ఇతరులు పేల్చే జోకుల్ని తట్టుకోలేని వాళ్లు ఆత్మన్యూనతతో బాధపడుతున్నట్లే లెక్క. సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువగా ఉన్న ఉద్యోగులే ఎక్కువ సామర్థ్యంతో పనిచేయగలుగుతారని మరో అధ్యయనం తేల్చి చెప్తోంది. ఇలా నవ్వులపైన వివిధ రకాల అధ్యయనాలు ఇంకా జరుగుతూనే ఉన్నాయి.



## నవ్వుతో జబ్బులకు చెక్



మనిషికి వచ్చే జబ్బులలో 70 శాతం జబ్బులు మానసికపరమైన ఒత్తిడికి సంబంధించినవే. అధిక రక్తపోటు, గుండెజబ్బులు, డిప్రెషన్, మైగ్రేన్ వగైరాలు ఆ కోవకి చెందినవే. వాటన్నింటికీ ఒకేఒక్క ఔషధం నవ్వు. ఐతే దీర్ఘకాలిక వ్యాధులు కేవలం నవ్వుతోనే తగ్గుతాయని చెప్పలేం కానీ నవ్వువల్ల అవి తగ్గుముఖం పట్టడానికి అవకాశాలు చాలానే ఉన్నాయి. అధిక ఒత్తిడికి గురవడంవల్ల మన శరీరంలో ఎడ్రినలిన్ హార్మోన్ ఎక్కువగా విడుదల అవుతుంది. మనం నవ్వినప్పుడు ఆ ఎడ్రినలిన్ శాతం బాగా తగ్గుతుంది. తమలో తాము ముడుచుకుపోయే వారితో పోలిస్తే తరచూ నవ్వేవారికి గుండెజబ్బు వచ్చే ప్రమాదం తక్కువ. టెన్షన్ తగ్గించే చక్కటి కాఫీలాంటి నవ్వువల్ల ఒత్తిడికి కారణమైన హార్మోన్ల ఉత్పత్తి తగ్గి ఉపశమనం కలుగుతుంది. 10 నిమిషాలు నవ్వగలిగితే 10-20 మి.మీ రక్తపోటు తగ్గుతుంది. రోజువారీ నవ్వులు రోగనిరోధక వ్యవస్థను వృద్ధి చేస్తాయి. అందుకు అవసరమైన లింఫోసైట్స్ ఉత్పత్తిని పెంచుతుంది నవ్వు. అలాగే ముక్కు, శ్వాసకోశాలకు సంబంధించిన పొరలలో నవ్వుల వల్ల మెరుగుదల బాగుంటుందని పరిశోధకులు చెబుతున్నారు. శరీరంలో సహజరోగ నిరోధకాలైన హార్మోన్ల ఉత్పత్తి పెరిగి స్పాండిలైటిస్, ఆర్థరైటిస్, మైగ్రేన్ వంటి బాధలనుంచి ఉపశమనం లభిస్తుంది. ఊపిరితిత్తుల సామర్థ్యం, రక్తంలో ఆక్సిజన్ పరిమాణం పెరుగుతాయి. కనుక ఆస్తమా రోగులకు మేలు కలుగుతుంది. ఇలా వివిధ రకాల వ్యాధుల బారిన పడకుండా మానసికంగానూ, శారీరకంగానూ నవ్వు మనల్ని పదికాలాలపాటు పదిలంగా ఉంచుతుంది.



# ఇది కథ కాదు

ఎన్. తారక రామారావు

**'సేద్యం-వైద్యం-నైవేద్యం'**
**రవిప్రకాశ్‌కు అర్థం కాలేదు.**
**తిరుమలాచార్యులు నవ్వారు చిన్నగా.**
**'ఉంటావుగా చెప్తాలే' అన్నారు.**

●●●

రవిప్రకాశ్ ఆ గ్రామం వెళ్లేసరికి చీకటిపడింది. మోటార్ సైకిల్ ఆపి, అక్కడ అరుగుమీద చుట్ట కాలుస్తున్న ఓ ముసలాయన్ని అడిగాడు "తిరుమలాచార్యులవారి ఇల్లెక్కడా?" అని.

"వేణుగోపాలస్వామి గుడికెళ్లు. ఇదిగో ఈ దారి వెంట వెళితే ఊరిచివర గుడి ఉంటుంది. అక్కడుంటారు. అవునూ, నీకాయనతో ఏం పనబ్బా".

రవిప్రకాశ్ సమాధానం చెప్పలేదు.

మోటారు సైకిల్‌పై దూసుకెళ్లాడు. ఊరిచివర గుడి కనిపించింది. ఆగాడు. కాలికి బూట్లున్నాయి. విప్పాలావద్దా అని సందేహించాడు. గాలిగోపురమే కదా అని మనస్సును సమాధానపరుచుకుని లోపలకెళ్లాడు.

లోపల గుడి వరండాలో పదిమంది కూర్చుని ఓ ముసలాయన చెప్పేది వింటున్నారు. ఎదురుగా వేణుగోపాలస్వామి గర్భగుడి. దీపాల వెలుగులో చిద్విలాసంగా ఉన్నాడు వేణుగోపాలస్వామి.

రవిప్రకాశ్ వెళ్లి వరండాలో చివరగా కూర్చున్నాడు.

'ఎవరికోసం?'

'తిరుమలాచార్యులు కావాలి!'

'అదిగో పురాణం చెప్పే ఆయనే ఆచార్యులవారు. కొద్దిసేపు కూర్చోండి, పురాణం అయిపోవచ్చింది'

ఆ పురాణవిశేషాలు వింటూ ఆయన్నే చూస్తూ కూర్చున్నాడు రవిప్రకాశ్.

'హాలికులైననేమి, నిజదారసుతోదర పోషణార్థమై' అనుకున్న పోతనగారు రాజాశ్రయం వద్దనుకున్నారు. శ్రీనాథుడు, భోగభాగ్యాలకు దురాశపడి జీవిత సంధ్యాసమయంలో కష్టాల పాలైనాడు. మనిషికి ఆశ ఉండాల్సిందే, దురాశ పనికిరాదు'.

తిరుమలాచార్యులు చెప్పడం ఆపి, స్వస్తిపలికి, మూలవిరాట్టుకి, గంటకొడుతూ హారతిచ్చి, నమస్కరించి అక్కడున్నవారిని శఠగోపంతో ఆశీర్వదించి, రవిప్రకాశ్ దగ్గరకొచ్చి 'ఎవరు కావాలిబాబూ' అనడిగాడు.

'మీ కోసమే - ప్రొఫెసర్ సంజీవరావుగారు పంపారు'.

'సంతోషం, కూర్చోనాయనా! క్షణంలో వస్తా'.

తిరుమలాచార్యులు అక్కడున్న అందరికీ బాదం ఆకుల్లో, సాతాళించిన శనగలు ప్రసాదం అందించి, వేణుగోపాలస్వామికి, సాష్టాంగ దండ ప్రణామం ఆచరించి, లెంపలేసుకుని, గుడి తలుపులు మూసి, తాళం చెవులు బొడ్లో దోపుకుని, "గోవింద, గోవింద" అని స్వామి నామజపం చేస్తూ వడివడిగా అడుగులేసుకుంటూ గుడి ఆవరణ దాటి "పద ఇంటికి వెళదాం" అన్నారు.

"నేను మీతో మాట్లాడి వెళతా!"

"అలాగే. ఈ రాత్రికి మా ఇంట్లో ఆతిథ్యం

# తాప్సీని మోసం చేశారట!

**బా**లీవుడ్‌కి వెళ్లిన తరువాత తాప్సీ తీరే మారిపోయింది. సక్సెస్ ఫ్లాపులతో పని లేకుండా అవకాశాలిచ్చిన దక్షిణాదిని చీల్చి చెండాడేస్తోంది. తాజాగా టాలీవుడ్‌లో ఓ వ్యక్తి తనతో సినిమా చేయించుకుని డబ్బులు ఎగ్గొట్టాడంటూ విరుచుకుపడు తోంది. తనకు చెల్లని చెక్కు ఇచ్చి మోసం చేశారనీ, డబ్బింగ్ కూడా తనతో చెప్పించ కుండా వేరేవారితో చెప్పించారనీ చెబు తోంది. కాకపోతే ఈ కథ అంతా ఎప్పుడో జరిగిందని చల్లగా సెలవిచ్చింది తాప్సీ. నిర్మాత చేసిన మోసం గురించి చెప్పిన తాప్సీ ఆ నిర్మాత ఎవరన్నది మాత్రం రహ స్యంగానే ఉంచింది.

స్వీకరించు. తెల్లారాక వెళుదువుగాని అంటూ తిరుమలాచార్యులు పై శాలువా సవరించుకుని, వడివడిగా ముందుకు నడిచారు.

రవిప్రకాశ్ మోటారుసైకిల్ నెట్టుకుంటూ ఆయన్ను అనుసరించాడు.

ఊరు చిన్నదే. పెంకుటిళ్లు, అక్కడక్కడా డాబా లున్నాయి. ప్రతి ఇంట్లోంచి టీవీ కార్యక్రమాలు విన బడుతున్నాయి. వీధిలో అక్కడోటీ ఇక్కడోటీ దీపాలు వెలుగుతున్నాయి. పిల్లల అరుపులు దూరంగా కుక్కల పోట్లాట.

సందులు గొందులు తిరిగిన తిరుమలాచార్యులు ఒక ఇంటి దగ్గర ఆగి,

"ఇదే మా ఇల్లు. బండి అక్కడుంచు' అని లోపలి కెళ్లాడు.

పెంకుటిల్లు. విశాలమైన స్థలంలో ఇంటి ప్రహరీ, ముందు రెండు అరుగుల ఖాళీస్థలంలో మధ్య నాపరాళ్లు పరిచినదారి. ఇరుపక్కలా కొబ్బరి చెట్లు మధ్యలో బంతిపూలచెట్లు ఓ పక్కగా గిలకబావి. ఆ పక్కన గేదెల కోష్టం, బాదం చెట్టు.

తిరుమలాచార్యులు బావిదగ్గర కాళ్లు చేతులు కడుక్కుని "రా, ఇలా వచ్చికూర్చో" అని రవిప్రకాష్‌కు చెప్పి లోపల కెళ్లారు.

పాతకాలం పెంకుటిల్లు. చుట్టూ వసారా!

వరండాలో ఓ పక్కన ధాన్యం బస్తాలు, ఉట్టి అందులో కంకులు రవిప్రకాశ్ వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు. ఇక ఈ రాత్రికి ఇక్కడ ఉండక తప్ప దని నిశ్చయించుకున్నాడు. ఓ క్షణం తర్వాత తిరుమలాచార్యుల వెంట మంచినీళ్లగ్లాసు తీసు కుని వచ్చింది అలివేలు మంగతాయారు.

"బాబూ మంచినీళ్లు తాగు" అవునూ, రాత్రికి భోజనమేగా. పది నిమిషాల్లో వడ్డిస్తాను" అన్నది మంగతాయారు లోపలికెళుతూ.

ఆమె పండు ముదుసలి. ఆమె భర్త తిరుమలా చార్యులు, శలాకలాగ నిటారుగా ఉండేలుబద్దలా ఉంటాడు. నిలువు గీత పక్కన సున్నాలా ఆమె.

**రైతుల ఆత్మహత్యలపై రీసెర్చ్ చేస్తున్నాడు ఆ యువకుడు. గ్రామాలన్నీ తిరిగి ఒక అవగాహ నకు వచ్చాడు. తన గైడ్ ప్రొఫెసర్ మరీ మరీ చెప్పడంతో తిరుమలాచార్యులవారిని కూడా వెళ్లి కలిశాడు. ఆయన నిరాడంబర జీవితం అతడికి బాగానచ్చింది. ఆయన్ను కూడా ప్రశ్నించాడు. అందుకు బదులుగా తిరుమలాచార్యులు, మడుగులో మొసలి నోటికి చిక్కిన ఏనుగు కథ చెప్పాడు. ఇంతకూ ఆ కథకూ, యువకుడి రీసెర్చ్‌కీ ఏమిటి సంబంధం?**

'మీకు శ్రమ కలిగిస్తున్నా'.

'అదేం లేదు. సంజీవరావు నాకు పుత్రసమా నుడు. అతడు పంపాడంటే అతనొచ్చినట్లే. సరే నువ్వేం చేస్తున్నావు. ఇక్కడికి ఎందుకొచ్చావు?' అడిగాడు తిరుమలాచార్యులు.

చెప్పాలా వద్దా! ఒకవేళ చెప్పినా ఈ చాద స్తపు అయ్యవారికి అర్థమవుతుందా? ప్రశ్న సంశ యంతో రైతుల ఆత్మహత్యలు-సామాజిక అంశాలు' అనే అంశంపై పరిశోధన చేస్తున్నా, సంజీవరావు గారు నా గైడ్".

'అధ్యయనం పూర్తయిందా!'

'ఈ జిల్లాలో ఆత్మహత్య చేసుకున్న రైతుల ఊళ్లు తిరిగా. కుటుంబ సభ్యులతో మాట్లాడాను. అంతా అయ్యాక సంజీవరావుగారు చెప్పారు, మిమ్మల్ని కలవమని. అందుకే వచ్చా'.

అలివేలు మంగతాయారు వచ్చి 'విస్తళ్లు వేశా, భోజనానికి లేవొచ్చు' అంది.

'రా బాబూ. ఆ గుడ్డలువిప్పి లుంగీకట్టు కుంటావా? కావాలంటే ధోవతీ ఇస్తాను. బావి దగ్గర కాళ్లూ, చేతులూ కడుక్కో, నీ సామాను లోపల గదిలో పెట్టుకో.

రవిప్రకాశ్ సందేహించాడు. తిరుమలాచార్యులు తనకోసం వేచిచూస్తున్నాడని గ్రహించి 'నేను హరిజనుణ్ణి' అన్నాడు చిన్నగా.

'నేనడిగానా, లేదే! వేణుగోపాలస్వామి గుళ్లో అంతా సమానమే. ఆయన కొలువులో సేవచేసే మా ఇంట్లో కులాల పట్టింపులేదు. రా, కలసి భోంచేద్దాం' తిరుమలాచార్యులు లోపలకెళ్లాడు.

రవిప్రకాశ్‌కు కొంచెం ఇబ్బందిగా ఉంది. అయినా తప్పక లుంగీకట్టుకుని వెళ్లాడు లోపలకు.

'మాకు బల్లలమీద అన్నం తినే అలవాటు లేదు. నీకేం ఇబ్బంది లేదుగా!'

రెండుపీటలు, బాదం ఆకుల్లో అన్నం పక్కన చేయిగ్లాసులు, ఆ ఎదురుగా పిల్లి, దాని పిల్లలు.

'బాబూ నీకోసం ప్రత్యేకంగా ఏం చేయలేదు! వంకాయకూర, కందిపచ్చడి, నిమ్మకాయముక్క... నీకిష్టమైతే చారుంది' చెప్పింది అలివేలు మంగ తాయారు నెయ్యి వడ్డిస్తూ.

అన్నం ఎర్రడాలుగా మేకుల్లా ఉన్నాయి. "మా పొలంలో పండిన ఎర్రబియ్యం ఇవి. తొమ్మిది నెలల పంట. అన్నం రుచిగా ఉంటుంది. కంది పప్పు మా పొలం లోదే. వంకాయలు దొడ్లో కాస్తాయి. నెయ్యీ, పెరుగూ అన్నీ ఇంట్లోవే. మా కోష్టం చూశావుగా. ఎప్పుడూ పాడి ఉంటుంది మా ఇంట" తిరుమలాచార్యులు అన్నం తిన్నంత సేపూ ఏదో సంగతి చెబుతూనే ఉన్నాడు.

"అబ్బాయిని తిననివ్వండి ఆ చెప్పేదేదో రేపు ఉంటాడుగా, చెబుదురుగాని".

రవిప్రకాశ్‌కు అన్నం కొత్తగా ఉన్నా రుచిగా ఉంది. కూర, పచ్చడి, ఊరగాయ, నేతివాసన, పెరుగు రుచి అన్నీ మమతానురాగాల మేళవింపేగాక, మధురానుభూతుల కలయికగా తోచింది. చాలా జ్ఞాపకాలు గుర్తొచ్చాయి. ఆ జ్ఞాపకాలన్నీ ఒళ్లంతా పాకిన ఆనందానుభూతి కలిగింది. ఏదో తెలి యని హాయి.

"అదిగో మడత మంచం. పడుకో! సిగరెట్ కాల్చే అలవాటుంటే రా, బైట అరుగుమీద కూర్చుందాం. నే చుట్ట కాలుస్తాలే" తిరుమలాచార్యులు వెళ్లాడు బైటకు.

రవిప్రకాశ్‌కు అలసట, నిద్ర వేళ కావడంతో మడతమంచం మీద వాలిపోయాడు.

•••

రేడియోలో నాదస్వరం. ఊరు మేల్కొన్నట్లు గేదెల అరుపులు, మనుషుల మాటలు.

రవిప్రకాశ్ కళ్లుతెరిచాడు. ఎదురుగా పెద్ద

ముత్తైదువ అలివేలు మంగతాయారు నవ్వుతూ కనిపించింది.

'లే! లేచి మొహం కడుక్కో, స్నానం చెయ్యి'

రవిప్రకాశ్ టైం చూశాడు. తొమ్మిది దాటింది. ఇంత గాఢమైననిద్రా! రవిప్రకాశ్‌కు విభ్రమం కలిగించింది. అదీ పరాయిచోట.

బావిదగ్గర స్నానం చేస్తే ఒళ్లు జిల్లుమంది.

"పొంగలి చేశాను. ఇదే అల్పాహారం, తిను. కాఫీ ఇస్తాను".

వేడివేడి పొంగలిమీద నెయ్యి అక్కడక్కడా మిరియాలు, కొబ్బరి ముక్కలు, యాలకుల గింజలు... ఆ రుచిని ఆస్వాదిస్తూ ఇదో అనుభవం అనుకున్నాడు రవిప్రకాశ్.

అలివేలు మంగతాయారు బియ్యం కడుగుతూ కూరలు తరుగుతూ వంటచేస్తూ మాట్లాడుతోంది.

"ఆయన కోడికూతతో లేస్తారు. పొలంవెళ్లి నీళ్లుపెట్టి కూరలు తీసుకొస్తారు. స్నానం, జపం, దేవతార్చన అయ్యాక గుడికెళతారు. అక్కడ పూజా కార్యక్రమాలయ్యాక ఊళ్లో తిరుగుతారు. అవసరమైన వాళ్లకు మందులిస్తారు. యోగక్షేమాలు విచారిస్తారు. వచ్చి మళ్లీ సంధ్యావందనం చేసుకుని, దేవుడికి నివేదన చేస్తారు. అదిగో అప్పుడు భోజనానికి వస్తారు. ఆయన వచ్చేలోపు టీవీ చూడు.




అదిగో పుస్తకాల బీరువా, కావాలంటే చదువుకో.

ఇంట్లో పాదరసంలా తిరిగే అలివేలు మంగతాయారు మాటలు వింటూ పుస్తకాలు తిరగేసి చూశాడు రవిప్రకాశ్.

"మాధవని దానం, ద్వాదశ లవణచికిత్స, గీతామృతం, ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ, శబ్దార్థదీపిక, వరల్డ్ హిస్టరీ, జిడ్డు కృష్ణమూర్తి, పక్కన మరో అరలో శ్రీపాద రచనలు, వావిళ్లవారి ఆంధ్రమహాభారతం సంపుటాలు, నేషనల్ జియోగ్రఫీ ఇవన్నీ చూశాక రవిప్రకాష్‌కు అనుమానం వచ్చి అడిగాడు.

"అయ్యవారు ఏం చదివారమ్మా"

అలివేలుమంగతాయారు చేస్తున్నపని ఆపి క్షణం నిభాయించుకుని "బెనారస్‌లో ఎం.ఎస్.సి చేశారు. అక్కడే ఉద్యోగం కూడా వచ్చింది. కానీ మావగారు కాలంచేయడం, కుటుంబ బాధ్యతలు, గుడి అర్చకత్వం, భూములు....వీటన్నిటి దృష్ట్యా ఇక్కడే స్థిరపడ్డారు" అంది.

'మీరు కూడా చదువుకున్నారా?"

ఆమె నవ్వింది. "చదవకేం చదివా బి.ఎ. మా కాలంలో అదే గొప్ప. పెళ్లయింది. పిల్లలు, సంసారం, ఇదిగో ఇక్కడే ఇలా మునిగా, తేలా".

ఈ దంపతులు ఇలా ఇక్కడ పల్లెటూరు ప్రజలతో మమేకమై జీవనం గడపటం రవిప్రకాశ్‌కు ఆశ్చర్యం వేసింది.

'మీ పిల్లలు....'

'అమ్మాయీ, ఆమె భర్తా లండన్‌లో డాక్టర్లు. కొడుకు మద్రాసులో ఇంజనీరు. వాళ్ల సంసారాలు వాళ్లవి. మా బ్రతుకుమాది!

రవిప్రకాశ్‌కు తాను ఉన్నది ఓ సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో అన్న స్పృహ భయపెట్టింది. ఆ మనుషులపై గౌరవం పెరిగింది, ఆరాధన కలిగింది.

'అమ్మా మీకీ జీవితం ఆనందాన్నిస్తోందా!' అడిగాడు భక్తిపూర్వకంగా.

అలివేలు మంగతాయారు చిద్విలాసంగా నవ్వి 'ఆనందం, సుఖం, కష్టం.. వీటిని నిర్వచించడం కష్టం. పైగా అవి వైయుక్తం గదా!' అంది వేదాంత ధోరణిలో.

ఆ మాట అర్థం కాలేదు రవిప్రకాశ్‌కి. ఆలోచిస్తూ ఉండగానే అయ్యవారు వచ్చారు.

ఆ తర్వాత భోజనం.

ఉసిరికాయపచ్చడి, పొట్లకాయ పెరుగు పచ్చడి, పప్పుచారు రవిప్రకాశ్‌కు అన్నీ అద్భుతంగా తోచాయి. రుచి, శుచి, ఆప్యాయత అన్నీకలబోసిన భోజనం. తన హాస్టల్ జీవితం, భోజనం గుర్తొచ్చి కళ్లనీళ్లు వచ్చాయి.

ఈ దంపతులు ఇలా పల్లెటూళ్లో సుఖంగా శాంతంగా బ్రతకటం ఆశ్చర్యం కలిగించింది.

అదే ప్రశ్న అడిగాడు.

తిరుమలాచార్యులు నవ్వి 'సేద్యం-వైద్యం-నైవేద్యం' అన్నాడు.

రవిప్రకాశ్‌కు అర్థంగాలా.

"గుడికున్న మాన్యం ఐదెకరాలు. అదే మా జీవనాధారం. వాణిజ్య పంటలు వేయను. నాకు నా కుటుంబానికి నా పాడి పశువులకు కావాల్సిన ఆహారధాన్యాలు, పప్పుదినుసులు కూరగాయలు పండిస్తాను. ఇది నా సేద్యం.

అనూచానంగా మా ఇంట మూలికావైద్యం ఉంది. నేనూ కొంత అధ్యయనం చేశా నాకున్న అనుభవంతో. ఎవరికైనా అస్వస్థత కలిగితే ఉపశమనానికి మందులిస్తాను, అది వైద్యం.

శ్రీ వేణుగోపాలస్వామి మా కులదైవం. ఆయన్ను సేవించడం, నైవేద్యం పెట్టడం నా కర్తవ్యం. ఇవే నా జీవన వేదం.

రవిప్రకాశ్‌కు రైతుల ఆత్మహత్యలు సామాజిక అంశాలపై కొంత స్పష్టత, అవగాహన వచ్చాయి. అయినా సందేహాలున్నాయి.

"రైతుల ఆత్మహత్యలు ఆపడం ఎలా?"

తిరుమలాచార్యులు క్షణం ఆలోచించారు.

'చాలా పెద్దప్రశ్న. తమకు కావల్సిన ఉపయోగపడే పంటలు మానేసి, పత్తి, పొగాకు, మిరప లాంటి వాణిజ్యపంటలేస్తున్నారు. వ్యాపారులు ప్రోత్సహిస్తున్నారు. ఫలితంగా, లాభాలు-డబ్బులు బాగానే ఉన్నాది. ఈ పంటలు పండక ధర లేకపోతే అప్పులు, నష్టాలు, తినేతిండికి కరువు ఆత్మహత్యలు! అందుకే ఓ కథ చెబుతా విను.

'కరి అంటే ఏనుగు అడవిలో బలమైనదే. కానీ మడుగులో దిగి మకరానికి అంటే మొసలికి చిక్కింది, ఫలితం...! రైతుకూడా అంతే. వ్యాపారుల చేతుల్లో చిక్కి విలవిలలాడుతున్నాడు. ప్రభుత్వ సాయంకోసం ప్రార్థిస్తున్నాడు. ఋణమాఫీ, పంట రుణాలు, ప్రభుత్వ పథకాలనే ఎండమావుల వెంట పరుగిడి మకరానికి బలవుతున్నాడు.

"అంటే వ్యాపార పంటలు వద్దా?"

'చిన్నకారు, సన్నకారు రైతులకు అవి ఎందుకు?' ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎగబాకడం ఎందుకు?

రవిప్రకాశ్‌కు ఆ సమాధానం పూర్తిగా అర్థం కాలేదు. నచ్చనూలేదు.

ప్రయాణమైన రవిప్రకాశ్, 'మరో ప్రశ్న అడగనా?' అన్నాడు.

తిరుమలాచార్యులు నవ్వారు.

'ప్రొఫెసర్ సంజీవరావు మీకెలా తెలుసు?' ఆయన నా పరిశోధనలో భాగంగా మిమ్మల్ని కలవమని మరీ మరీ చెప్పారు'.

ప్రొఫెసర్ సంజీవరావుకు కృతజ్ఞతాభావం ఎక్కువ. ఎప్పుడో ఆయన చదువు ఆగిపోకుండా సహాయం చేశాననే కృతజ్ఞతాభావం. అంతే నేనం చేశానని వాళ్లదీ రైతు కుటుంబమే! వాళ్లనాన్న దురాశకుపోయి వాణిజ్యపంటలు వేసి నష్టపోయి ఆత్మహత్యకు పాల్పడితే నాయనా మనకు తిండి గింజలు, పప్పుధాన్యాలు, పశువులకుమేత ఇవేరక్ష అని చెప్పా. సంజీవరావు నాన్న ఆ తర్వాత రైతుగా నిలబడ్డాడు. సంజీవరావు చదువు కొనసాగింది. ఇంతే నే చేసింది. కానీ ఇన్నేళ్లుగా సంజీవరావు నాచిరు సహాయం గుర్తుంచుకోవడమే అతని గొప్పతనం.

తిరుమలాచార్యులు మానవరూపంలో ఉన్న దేవుడా? రవిప్రకాశ్, ఆయన రూపం, నిరాడంబరత చూశాక మనస్సులోనే ఆయనకు నమస్కరించాడు.

ప్రొఫెసర్ సంజీవరావు ఇంట్లో తిరుమలాచార్యుల దంపతుల ఫోటో ఎందుకు ఉందో అర్థంచేసుకున్న రవిప్రకాశ్ ముందుకుసాగాడు, 'సేద్యం, వైద్యం, నైవేద్యం' అని గుర్తుచేసుకుంటూ.

సెల్:040-23833878






## రాజభోగం

క్రిస్మస్ ట్రీని చక్కగా డెకరేట్ చేసి గిఫ్ట్‌లు ఇచ్చిపుచ్చుకుంటారు ఎవరైనా. కానీ ఓ అమ్మడు మాత్రం కుటుంబసభ్యులను, బాయ్‌ఫ్రెండ్‌ని కూడా పక్కన పెట్టేసి లోలా, హార్వేలకు క్రిస్మస్ గిఫ్ట్‌లు ఇచ్చేసింది. ఈ లోలా, హార్వేలు ఎవరు? అంటే ఆ అమ్మడి పెంపుడు శునకాలు!

ఇంగ్లండ్, న్యూకాజిల్‌కి చెందిన విక్కీజోన్స్ ప్రతీ నెలా వాటి తిండి, బట్ట, దుప్పట్లు, బొమ్మలన్నింటికీ రెండువందల యూరోల దాకా ఖర్చుపెడుతోంది. వేల యూరోలు ఖర్చుపెట్టి వాటికి గిఫ్ట్‌లు కొంటుంది. అంతేకాదండోయ్... వాటికి పుట్టినరోజులు, పండుగసందర్భాలనీ.. ఏదైనా సరే బహుమతులు ఇవ్వాల్సిందే! నాలుగేళ్లుగా ఇదే తంతు! వాటిని తమ కుటుంబ సభ్యుల్లాగే ట్రీట్ చేస్తోంది ఈ అమ్మడు. మొత్తానికి ఆ పెంపుడు శునకాల రాజభోగం చూడాల్సిందేనంటున్నారు తెలిసినవారు.



## అగ్గిపుల్లలతో భవంతులు

పుల్లా పుడకా సేకరించి పక్షి గూడు కట్టుకుంటుంది. మనిషి మాత్రం కలప సేకరించి ఇల్లు కట్టుకుంటాడు, ఇటుక, ఇసుక చేర్చి భవంతులు కడతాడు. కానీ ఓ మహానుభావుడు మాత్రం దీనికి భిన్నం. పక్షి తరహాలో పుడకలకు బదులు అగ్గిపుల్లలు సేకరించి భవంతులు కట్టేశాడు ఓ పోలండ్‌వాసి! అగ్గిపెట్టెలు కొనడం, ఆ పుల్లలతో భవంతులతో సహా ఎన్నో వస్తువులు తయారుచేయడమే అతడి హాబీ.

పోలండ్, రుడా స్లాస్కాకు చెందిన అర్బాన్స్కీ దగ్గర చెస్‌బోర్డు ఉంది, కానీ ఆడలేడు. గిటార్ ఉంది కానీ ప్లే చేయలేడు. పడవ ఉంది కానీ ఉపయోగించలేడు. ఎందుకని? అంటే అవన్నీ అగ్గిపుల్లలతో తయారు చేసినవే. 40 సంవత్సరాలుగా దాన్నే హాబీగా మార్చుకున్నాడు. ప్రముఖ పర్యాటక భవనాలు, కట్టడాలను కేవలం అగ్గిపుల్లలు, గ్లూ ఉపయోగించి తయారుచేస్తున్నాడు. మంచి హాబీ కదా!



## రోబో రికార్డ్

గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్స్, లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్. ఇలా చాలా రకాల రికార్డ్స్ ఉన్నాయి కదా! వాటిల్లో స్థానం సంపాదించడానికి ఎన్నో ప్రయోగాలు చేస్తుంటారు. మరి ఒక రోబో రికార్డుల్లోకి ఎక్కిన దాఖలాలు ఏమైనా ఉన్నాయా? అంటే ఉన్నాయి! ఈ మధ్యనే ఓ రోబో గిన్నిస్ రికార్డుల్లోకి ఎక్కింది.

ఆ రోబో పేరు బెంతిక్ రోవర్. అమెరికాలోని మాంటెరీ బే అక్వేరియం రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ దాన్ని తయారుచేసింది. ఇంతకీ అది సాధించిన రికార్డు ఏమిటంటే సముద్రం అడుగున 367 రోజులు గడిపింది. అంతేకాదు సముద్రలోతుల్లో ఎక్కువ దూరం ప్రయాణించిన రోబోగానూ రికార్డుపుటల్లోకి ఎక్కింది. సముద్రపు అడుగున వాతావరణ సమాచారం సేకరించేందుకు దీన్ని కాలిఫోర్నియా తీరానికి 220 కి.మీ. దూరంలో నాలుగు వేల అడుగుల లోతుకు పంపించారు.



## నీటిలో గ్రామం కథ

అనగనగా ఓ గ్రామం. కానీ అది కంటికి కనబడదు. నీటిలోపల ఉంటుంది. నీటిలోపల ఉండటమేమిటా? అనుకుంటున్నారా! అయితే విల్లా ఇపేక్యూయన్ అనే గ్రామం గురించి తెలుసుకోవాలి! చూడాలంటే అర్జెంటీనా వెళ్లాల్సిందే!

1920లో లగో ఇపేక్యూయన్ అనే సరస్సు తీరంలో ఈ గ్రామం నిర్మించారు. ఇదొక ఉప్పునీటి సరస్సు. ఈ సరస్సులో స్నానం చేస్తే ఎటువంటి రోగమైనా నయమైపోతుందని నమ్ముతారు.

అయితే ఈ సరస్సు తీరప్రాంతంలో ఉన్న విల్లా ఇపేక్యూయన్ 1983 వరకు పర్యాటక ప్రదేశంగా అలరారుతుండేది. హోటళ్లు, ఇళ్లు, షాపులు, పార్కులు, మ్యూజియం అన్నీ ఉండేవట. క్రమేపీ ఆ సరస్సులో నీటిమట్టం ఏ ఏటికాయేడు పెరుగుతూ ఉండటంతో అందరూ ఆ గ్రామం ఖాళీ చేసి వెళ్లిపోయారు. గ్రామం కాస్తా నీటిలో మునిగింది. 2009లో నీరు తగ్గడంతో గ్రామం తిరిగి బైటపడింది. పబ్లోనోవక్ అనే 81 సంవత్సరాల వయసున్న ఒకతను మాత్రం తిరిగి ఆ గ్రామానికి వచ్చాడు. ఇదీ నీటిలో మునిగిపోయిన గ్రామం కథ!



## గ్రనేడ్‌తో చెలగాటం

**‘24’** సినిమాలో టైమ్ మెషీన్ బాక్స్ తెలుసుకదా! అందులో హీరో దాన్నొక పనికిరాని వస్తువుగా భావించి రకరకాలుగా ఉపయోగిస్తాడు. చైనాలో కూడా ఒక వ్యక్తి అలాగే చేశాడు! కాకపోతే అదొక గ్రనేడ్!! పాతికేళ్ల తర్వాత అసలు విషయం తెలుసుకుని షాక్ తిన్నాడు. వివరాల్లోకి వెళితే...

చైనాలోని షాంగ్జీ ప్రావిన్స్‌కి చెందిన అంకాంగ్‌కి అతడి స్నేహితుడు ఒక బహుమతి ఇచ్చాట్ట! అదేమో అచ్చంగా చెక్కతో చేసిన గూటంలా ఉంది. ఇంకేం అంకాంగ్ దాన్ని వక్కలు దంచుకోవడానికి గూటంలా ఉపయోగించుకుంటున్నాడు.

ఆ గ్రనేడ్ గడచిన పాతికేళ్లగా అతనిదగ్గరే ఉంది. అతడికి అది గ్రనేడ్ అని ఎలా తెలిసిందంటే... ఈమధ్యనే పోలీసులు గ్రనేడ్‌ల గురించి వివరాలు తెలియజేస్తూ కరపత్రాలు పంచారు. ఆ కరపత్రంచూసి షాక్ తిన్నాడు అంకాంగ్. వెంటనే పోలీసుల వద్దకు పరిగెత్తుకెళ్లి దాన్ని వాళ్లకి అప్పగించాడు. అది గ్రనేడ్ అని పోలీసులు ధ్రువీకరించే సరికి అంకాంగ్ గుండె గుభేల్‌మంది. ఆ గ్రనేడ్ ఇంకా యాక్టివ్‌గానే ఉందట. వక్కలు దంచడానికి ఉపయోగించినపుడు ఇంకాస్త ఎక్కువ శక్తితో నేలకు కొట్టినా... విసిరేసినా గ్రనేడ్ పేలేదని పోలీసులు చెప్పడంతో అతడు షాకయ్యాడు.

-నర్మద వాసిరెడ్డి





# వైకుంఠం వాకిలి తెరుచుకున్న వేళ...

**ధనుర్మాసం అత్యంత పవిత్రమైనది. ఆ మాసంలో ఎన్నో పర్వదినాలు. అందులో ఒకటి ముక్కోటి ఏకాదశి. పరమపవిత్రమైన రోజు ఈ ఏకాదశి.**

**ముక్కోటి ఏకాదశిని వైకుంఠ ఏకాదశి, పుత్రదా ఏకాదశి అని కూడా అంటారు. ఆరోజు ముఖ్యంగా వైష్ణవాలయాలన్నీ భక్తులతో కిటకిటలాడుతుంటాయి. ఉత్తరద్వార మార్గంలో స్వామిని దర్శించుకోవాలని ఆ రోజు భక్తులు ఎంతో ఆరాటపడతారు. వైకుంఠ ఏకాదశి ప్రాముఖ్యంపై ఒక అవలోకనం...**

ఒక్క ఏడాదిలో ఇరవైనాలుగు ఏకాదశులు వస్తాయి. ప్రతి ఏకాదశీ పవిత్రమైనదే. అందులో మరీ విశేషంగా పరిగణించే ఏకాదశులు నాలుగు. ఆ విశేష ఏకాదశులలో ఒకటిగా పరిగణించేదే ఈ వైకుంఠ ఏకాదశి. సూర్యుడు ఉత్తరాయణానికి మారే ముందు వచ్చే ధనుర్మాస శుద్ధ ఏకాదశినే ముక్కోటి ఏకాదశి అంటారు. అసలు ఈ రోజుకు ఎందుకు అంత ప్రాధాన్యం అంటే....

### ఉత్తర ద్వార దర్శనం

ముక్కోటి ఏకాదశినాడు తెల్లవారుజాము నుంచే ఆలయాల్లో భక్తులు ఉత్తర ద్వార భగవత్ దర్శనార్థం వేచి ఉంటారు. ఈరోజున వైకుంఠం వాకిళ్లు తెరుచుకునే పర్వదినం.

ముక్కోటి ఏకాదశినాడు సాక్షాత్తూ ఆ శ్రీమహావిష్ణువు గరుడ వాహనారూఢుడై మూడు కోట్ల దేవతలతో భూలోకానికి దిగివచ్చి భక్తులకు దర్శనమిస్తాడు. అందువల్లనే ముక్కోటి ఏకాదశి అని దీనికి పేరు. మూడు కోట్ల ఏకాదశులతో సమానమైన ఈ ఏకాదశి పవిత్రత సంతరించుకున్నందువల్ల దీన్ని ముక్కోటి ఏకాదశి అంటారని కూడా చెబుతారు.

దేవతలు, రాక్షసులు జరిపిన క్షీరసాగర మథనంలో ముక్కోటి ఏకాదశి నాడే హాలాహలం, అమృతం రెండూ పుట్టాయి. కాలకూటవిషాన్ని పరమేశ్వరుడు తన గరళాన బంధించింది ఆ రోజే. మహాభారత యుద్ధ సమయంలో అర్జునుడికి శ్రీకృష్ణుడు భగవద్గీతను ఉపదేశించింది కూడా ముక్కోటి ఏకాదశినాడే అనేది ఒక విశ్వాసం. తిరుమల శ్రీవారి పుష్కరిణిలో ఏడాదికి నాలుగు మార్లు మాత్రమే చక్రస్నానం జరుగుతుంది.

ఏడాదిలో ఈ చక్రస్నానాలు జరిగే నాలుగుసార్లూ ముల్లోకాల్లో ఉన్న పుణ్యతీర్థాలు స్వామి పుష్కరిణిలో సూక్ష్మరూపంలో ప్రవేశిస్తాయని విశ్వాసం. అనంతపద్మనాభ వ్రతం రోజున, బ్రహ్మోత్సవాలలో చివరి రోజున, వైకుంఠ ఏకాదశి మరునాటికి ద్వాదశి తిథి ఉన్నరోజు, రథసప్తమి రోజు, స్వామివారికి చక్రస్నానాలు జరుగుతాయి. అందుకే ఈరోజున ప్రత్యేకించి వైష్ణవ ఆలయాల్లో విశేష పూజలు నిర్వహిస్తారు.

### విశేష ఆరాధన

*వైకుంఠ ఏకాదశి రోజు అన్నం ముట్టకూడదు. ముర అనే రాక్షసుడు అన్నం రూపంలో ఉంటాడని ఒక విశ్వాసం అయితే, ఇంకొక కథ ప్రకారం బ్రహ్మ తలనుంచి ఒక స్వేద బిందువు నేలమీదపడి వెంటనే రాక్షస రూపం దాల్చింది. "ఓ బ్రహ్మదేవ, నాకు నివాస స్థానం చూపించు" అని ఆ రాక్షస రూపం ప్రార్థించింది.*

*ఏకాదశినాడు మానవులు భుజించే అన్నంలో ప్రవేశించి తద్వారా వారి ఉదరాల్లో స్థావరం ఏర్పర్చుకోమని బ్రహ్మ ఆ రాక్షస రూపానికి వరం ఇచ్చాడు. అందుకే ఈ రోజు శ్రీ మహావిష్ణువును షోడ శోపచారాలతో ఆరాధించి, చాలామంది ఉపవాసం చేస్తారు.*

### ఏకాదశి ప్రాశస్త్యం

వైకుంఠ ఏకాదశి ప్రాశస్త్యం గురించిన వివరణ అనేక పురాణాలలో ఉంది.. పద్మ పురాణం ప్రకారం కృతయుగంలో 'ముర' అనే రాక్షసుడు దేవతలను, సాధువులను క్రూరంగా హింసించేవాడు. ఈ మురాసురుని అక్రమాలు, ఆగడాలు భరించలేక దేవతలు మహావిష్ణువును శరణు వేడుకున్నారు. దేవతల మొర ఆలకించిన శ్రీమహావిష్ణువు మురాసుర వధకు ప్రత్యేక అస్త్రం అవసరమని గ్రహించి బదరికాశ్రమంలోని హైమావతి గుహలోకి ప్రవేశించాడు. ఇదే అదనుగా భావించిన మురాసురుడు ఆ గుహలోకి ప్రవేశించి అక్కడ విశ్రమిస్తున్న విష్ణువుని సంహరించేందుకు ప్రయత్నించాడు. ఆ సమయంలో శ్రీమహావిష్ణువు నుంచి ఒక శక్తి ఉద్భవించి మురాసురుణ్ణి సంహరించింది. ఈ విధంగా దేవతలను సంరక్షించిన ఆ శక్తికే "ఏకాదశి" అని నామకరణం చేశారు. వైష్ణవ ఆళ్వారులలో ప్రసిద్ధిచెందిన శ్రీనమ్మాళ్వారు కూడా ముక్కోటి ఏకాదశినాడే పరమ పదించడం ఒక విశేషంగా చెప్పుకుంటారు.

**- ముస్త్యాల రామచంద్ర శర్మ, అవధాని**

## సరదాగా....

**చెడిపోదు!**

**స్కూల్లో** ప్రోగ్రెస్ రిపోర్టు ఇచ్చారు చింటూకి. అన్నీ అత్తెసరు మార్కులే! తండ్రి ఏమంటాడో అని భయపడుతూనే ఇంటికొచ్చాడు. తండ్రి ఆఫీసు నుంచి రాగానే రిపోర్టు తీసుకెళ్లి తండ్రిచేతిలో పెట్టాడు. అసలే చిరాకు మీద ఉన్నాడేమో కొడుకు మీద అంతెత్తున ఎగిరాడు. ఒరేయ్.. నువ్వు బాగుపడవురా! నువ్వు బాగుపడకపోయినా పర్వాలేదు. నా పేరు చెడగొడుతున్నావు కదరా! అంటూ వాయించేస్తున్నాడు.

ఇంతలో చింటూ సడన్‌గా తన నోటు పుస్తకం లోంచి ఓ పేపర్ చింపి దానిమీద ఏదో రాశాడు. గబగబా తీసుకెళ్లి ఆ పేపర్‌ని ఫ్రిజ్‌లో పెట్టాడు.

అదేంటిరా? అని అడిగిన తండ్రితో, మరి అమ్మేమో కూరగాయలు అవీ చెడిపోకుండా ఫ్రిజ్‌లో పెడుతుంది కదా నాన్నా! నువ్వేమో నీ పేరు చెడగొట్టద్దన్నావ్... అందుకే నీ పేరు చెడిపోకుండా ఫ్రిజ్‌లో పెట్టా!!

**ఒక ప్రశ్న?**

**ఆ**ఫీసు నుంచి వచ్చీ రావడంతోనే మంచానికి అడ్డం పడింది కావ్య. ఏమైందే అని కూతురిని అడిగిన అనసూయతో తలనొప్పి దంచేస్తోంది, మాంచి మసాలా టీ ఇవ్వమంది. సరేనని మసాలా టీ ఇచ్చి, ఇంత జండూబామ్ నుదుటిమీద పూసింది అనసూయ. అయినా తగ్గదే! పడుకోవే అదే సర్దుకుంటుంది అని చెప్పింది తల్లి. నిద్రపడితేనా? ఆ రాత్రంతా తలనొప్పితో అలా ఆపసోపాలు పడుతూనే ఉంది. తెల్లారింది. కానీ కావ్య పరిస్థితిలో మార్పులేదు. తగ్గలేదు సరికదా ఇంకా ఎక్కువైంది. హాస్పిటల్‌కి వెళ్దాం పదా అని కూతురిని పక్కసందులోనే ఉన్న వాళ్ల ఫ్యామిలీ డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లింది. డాక్టర్ ఆమెకి ఆ టెస్టులూ, ఈ టెస్టులూ చేసి, చివరికి ఏమీ లేదని తేల్చేశాడు. టాబ్లెట్లు రాసిస్తాను, వేసుకోండి అంటూ ప్రిస్క్రిప్షన్ మీద పెన్నుతో గీకాడు. ఆ రైటింగ్ అర్థం కాక, ఏం టాబ్లెట్లు రాశాడో తెలియక మెడికల్ షాపు కెళ్లి టాబ్లెట్లు తీసుకుంది కావ్య. మొత్తం ఐదు టాబ్లెట్లు. ఐదూ పదిహేను నిమిషాల వ్యవధితో వేసుకోమన్నాడు ఫార్మసీ అతను. డాక్టరు కూడా అలాగే రాశాడన్నాడు. సరేనని ఇంటికెళ్లి మొదటి టాబ్లెట్ వేసుకుంది. తరువాత పదిహేను నిమిషాలకి ఇంకో టాబ్లెట్ వేసుకుంది. అలా ఐదు టాబ్లెట్లూ పదిహేను నిమిషాల వ్యవధితో వేసుకునేసరికి తలనొప్పి కాస్తా హాంఫట్ అంది. ఇక్కడ ప్రశ్న ఏంటంటే, ఆ ఐదు టాబ్లెట్లూ వేసుకోవటానికి కావ్యకి ఎంత సమయం పట్టింది? ఈజీగా అనిపిస్తుంది కదా, అయితే ప్రయత్నించి చూడండి.

**సమాధానం**

కావ్యకి ఐదు టాబ్లెట్లూ వేసుకోవడానికి 60 నిమిషాల సమయం పట్టింది. ఎలాగా అంటారా... మొదటి టాబ్లెట్ వేసుకున్నప్పుడు జీరో మినిట్స్ అనుకుంటే, రెండో టాబ్లెట్‌కి 15 నిమిషాలు, మూడో టాబ్లెట్‌కి 30 నిమిషాలు, నాలుగో టాబ్లెట్‌కి 45 నిమిషాలు, ఐదో టాబ్లెట్‌కి 60 నిమిషాల సమయం పట్టింది. కాబట్టి మొత్తం ఐదు టాబ్లెట్లూ వేసుకోవడానికి 60 నిమిషాల సమయమన్నమాట.

## తీన్ మార్

ఒకప్పుడు ATMలను దోచుకునే వాళ్ళం.. ఇప్పుడు జనాలు ATM క్యూలలో వుండటం వలన ఇళ్ళే హాయిగా దోచుకుంటున్నాం కదరా.. గంగులు!!

అప్పుడు బావగారూ!! కొన్ని మనం సర్దుకుపోవాలి!! ముహూర్తం బాంకు వేళల్లో వచ్చింది.. అందరం ATM క్యూలోనే వుంటాం కాబట్టి పెళ్ళి ATM క్యూలోనే జరపడం ఉత్తమం...!!

ఇంట్లో ఎవరూ లేరంకుల్!!
అమ్మ ఆంధ్రాబాంకు ATMకి, నాన్న స్టేట్ బాంకు ATMకి, అన్నయ్య సెంట్రల్ బాంకు ATMకి, అక్కయ్య సిండికేట్ బాంకు ATMకి వెళ్ళారు!!

# వెట్టి
## (ది వారియర్)

-మధుబాబు




**పిడుగు పడినట్లయింది ప్రణవికి తన నెత్తిమీద. 'అమ్మమ్మ... ఏమంటున్నావు నువ్వు? అమ్మ వచ్చేస్తోందా? ఇక్కడికా?' తను తప్పుగా విని ఉండటం జరిగిందేమోనన్న ఆశా భావంతో రెట్టించింది.**

**'అదే గదరా చిన్నోడా నేను చెప్పింది. అక్కడికి కాకుండా ఇంకెక్కడికి వస్తుంది?' ఆశ్చర్యంగా అడిగింది పెద్దమ్మ.**

అవతల నుంచి వస్తున్న మాటలు వినబడక పోయినా, ప్రణవి మాటలు అర్థం అయ్యేసరికి, విషయం ఏమిటో తెలిసిపోయింది అందరికీ.

'వచ్చే పౌర్ణమిదాకా రానని నాతో చెప్పింది తల్లి. మళ్లీ ఇప్పుడు మాట మారిపోవటం ఏమిటి?' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు పంతులు గారు.

'ఇటివ్వు తల్లీ. ఫోను ఇవ్వు... నేను మాట్లాడతాను' అంటూ ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా ఫోను లాక్కున్నాడు శంకరయ్య.

'అమ్మా... ఆ తల్లిని కాస్తంత ఆగమని చెప్పండి. ఇప్పుడప్పుడే రాకూడదు. ఇక్కడి పరిస్థితులు బాగో లేదు' అన్నాడు గబగబా.

'నీ మాట, నా మాట చెవిన వేసుకునే మనిషి అయితే ఇన్ని బాధలు బరువులు ఎందుకుంటాయి శంకరయ్యా? బయలుదేరి పది నిమిషాలు అయింది. పొలిమేరలు దాటి ఉంటుంది. ఆగమని ఎవరికి చెప్పను? గోడలకి గేట్లకి చెప్పాలి, అంతే' బాధగా వినవచ్చింది పెద్దమ్మ కంఠం.

'బయలుదేరటం అయిపోయిందిట.. వచ్చేస్తున్నదిట' రమణయ్యపంతులుగారికి చెప్పాడు శంకరయ్య.

**జరిగిన కథ**

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో మళ్లీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. తనని చంపేందుకు ప్రయత్నించిన బాజిరెడ్డి మనుషులని ఆస్పత్రిపాలు చేస్తాడు. దాంతో వెట్టిపై ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూ ఉంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. పనిమనిషి సంపంగిపై అనుమానంతో ఆమెని అబ్జర్వ్ చేస్తూ ఉంటాడు వెట్టి. చౌడేశ్వరి ఆలయానికి వెళ్లిన వెట్టి, అక్కడ పఠాన్‌తో పాటు బసవప్పను చూస్తాడు. పఠాన్ అవతలికి వెళ్ళిన మరుక్షణం అక్కడున్నవాళ్లని చావమోదుతాడు. గుడి పరిసరాలను గమనిస్తూ తిరుగుతున్న వెట్టికి ఆ ఆలయ పాతపూజారి కనిపిస్తాడు. అతడినుంచి ఆ గుడి వివరాలు తెలుసుకోవాలనుకుంటాడు.

ఆ తర్వాత...

గుండెలనిండా గాలి పీల్చుకుని, భారంగా బయటికి వదిలాడు పంతులుగారు. 'జరిగిపోయిన దానికి బాధపడినందువల్ల ఉపయోగం ఏమీ ఉండదు. జరగబోయేదాన్ని గురించి ఆలోచిద్దాం. ఆ మాటల్ని వదిలేయండి' అంటూ ఫోన్ ప్రణవికి ఇచ్చేయమని సైగచేశాడు.

నీళ్ల కమ్మిన కళ్లను తుడుచుకుంటూ ఫోన్‌ని అందుకున్నది ఆమె. గద్గదస్వరంతో పెద్దమ్మను పలుకరించింది.

'ఏడవకురా.... ఏడ్చి సాధించేది ఏమీ ఉండదు. ఏది జరగాలని రాసిపెట్టి ఉంటే అది జరిగి తీరుతుంది' అంటూ ఒక్క క్షణం ఆగి, అవునూ ఆ తలకి మాసినవాడు ఒకడు ఉన్నాడు కదా.. వాడు చెపితే ఇది నోరు మూసుకుని తల ఊపుతుంది. పిలువ్ వాణ్ణి. నేను మాట్లాడతాను' అన్నది.

ఒక్కక్షణం పాటు అయోమయమైపోయి, అంతలోనే ఆమె ఎవరిని గురించి మాట్లాడుతున్నదో అర్థమై, అంత బాధలోనూ పకపకా నవ్వకుండా ఉండలేక పోయింది ప్రణవి.

'విఠల్‌రెడ్డిని గురించి అడుగుతున్నావా? తను ఇక్కడ లేడు' అంటూ శివారెడ్డి ఒత్తిడి చేయటాన్ని గురించి, అతను ముందుగానే గుడికి పోవటాన్ని గురించి వివరంగా చెప్పింది.

'మంచి అంటూ ఏదైనా జరిగితే అతని ద్వారానే జరగాలి అమ్మమ్మ. నా ఆశలన్నీ అతని మీదే పెట్టుకున్నాను' అంటూ ముగించింది.

'పిచ్చిమాలోకం కాబట్టి మీ అమ్మ వాణ్ణి వెంటబెట్టుకు తిరుగుతోంది. నువ్వు కూడా వాడినే పట్టుకున్నావేమిటి? నీకు కూడా ఎక్కిందా పిచ్చి? వాడు ఎవడో, ఎక్కడి నుంచి వచ్చాడో, అసలు ఎందుకు వచ్చాడో తెలుసుకోకుండా నమ్మటం... ఆ శివారెడ్డికి అసలు బుద్ధి ఉందా?' కోపంగా అడిగింది పెద్దమ్మ.

'ఒక్కక్షణం ఆగు అమ్మమ్మ. ఒక్కక్షణం' అంటూ తలతిప్పి ప్రత్యూష వైపు చూసింది ప్రణవి.

'నేను చూస్తూనే ఉన్నాను. నువ్వు బెడ్‌రూమ్‌లోకి పోయి మాట్లాడు' అంటూ గుమ్మం దగ్గరికి పోయి నిలబడింది ప్రత్యూష.

అయోమయంగా చూసిన శంకరయ్య భుజం తట్టాడు పంతులుగారు. 'ప్రణవి మన విఠల్ బాబును గురించి పెద్దమ్మకి పూర్తిగా చెపుతుంది. బయటివాళ్ళు ఎవరైనా వింటే బాగోదు కదా. ఆ పిల్ల కాపలా నిలబడింది' అంటూ వివరించి చెప్పాడు.

'నీకు కొన్ని విషయాలు చెప్పాలి అమ్మమ్మ. శ్రద్ధగా విని నీ అభిప్రాయం చెప్పు' అంటూ బెడ్ రూమ్‌లోకి పోయింది ప్రణవి.

•••

'రండి బాబూ రండి....' చెప్పా పెట్టకుండా



తనున్న ఇంటిముందు ప్రత్యక్షమైన వెట్టిని చూడగానే, గబుక్కున లేచి నిలబడి ఆహ్వానించాడు వృద్ధుడు.

'మీతో రెండు మూడు మాటలు మాట్లాడాలి. అందుకే వచ్చాను' నవ్వు ముఖంతో చెప్పాడు వెట్టి.

ఇంట్లోకి పోయి, విరిగిపోవటానికి సిద్ధంగా ఉన్న కుర్చీనొకదాన్ని తీసుకువచ్చాడు వృద్ధుడు. 'కూర్చోండి బాబూ...' అన్నాడు.



తన బరువును అది భరిస్తుందో లేదో ఆలోచించ లేదు వెట్టి. 'పెద్దవాళ్లు మీరు. పైపెచ్చు నమస్కారం చేయించుకోవలసిన ఉద్యోగం చేసిన వాళ్లు. ముందు మీరు కూర్చోండి' అంటూ చనువుగా అతని భుజాలు పట్టుకుని అతి బలవంతంగా ఆ కుర్చీలో కూర్చోబెట్టి, తను పక్కనే ఉన్న మట్టి అరుగుమీద చతికిలపడ్డాడు.

'ఆడవాళ్లు లేని కొంప. అతిథి మర్యాదలు జరిగే చోటు కాదు' తలవంచుకుంటూ చెప్పాడు వృద్ధుడు.

'శివారెడ్డి తండ్రిగారికి ఈ దేవత అంటే విపరీతమైన భక్తి ఉందని నాకు తెలిసింది' తను ఎక్కడి నుంచి ఎవరి పని తరపున వచ్చాడో స్పష్టంగా చెప్పిన తర్వాత నెమ్మదిగా అసలు విషయంలోకి వచ్చాడు వెట్టి.

తను ఎవరో చెప్పిన క్షణం నుంచీ ఆ వృద్ధుడి ముఖంలో రకరకాల భావాలు, కదలటం గమనించాడు అతను.

'సరేసరే... నువ్వు ఎవరివైతే నాకేమిటి గాని, నాతో నీకు పనేమిటో త్వరగా చెప్పు' అని అతను కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు మాట్లాడడంతో కొంచెం నివ్వెరపోయాడు వెట్టి. అనుమానంగానే శివారెడ్డి తండ్రిగారి పేరును ఉపయోగించాడు, అతను ఊహించినట్లుగానే నిరసనగా తల విదిలించాడు వృద్ధుడు.

'దేవుళ్లని, దేవతల్ని అడ్డం పెట్టుకుని చేయకూడని పనులన్నిటినీ నిరభ్యంతరంగా చేస్తూ ఉండడం కొందరికి అలవాటు' క్లుప్తంగా చెప్పి మౌనంగా ఉండిపోయాడు.

'మీ మాటలు నాకు అర్థం కాలేదు. దయచేసి కాస్తంత వివరంగా చెప్పండి' రిక్వెస్ట్ చేశాడు వెట్టి.

'వివరంగా చెప్పటానికి విషయం అంటూ ఏమీలేదు. రోజుకి పదిమంది ఈ తల్లి దగ్గరికి వస్తే వారిలో అరడజను మంది ఎవరో ఏదో చెపితే విని, నిజమో కాదో స్వయంగా చూసి తెలుసుకోవటానికి వస్తారు. అటువంటి వాళ్లని గురించి పొరపాటున కూడా పట్టించుకోదు ఈ తల్లి. ఇంకో ఇద్దరు ఈ దారిన పోతూ, ఇంతదూరం వచ్చినా దర్శనం చేసుకోకపోతే ఇంట్లోవాళ్లు ఏదైనా అనుకుంటారన్న అనుమానంతో లోపలికి వస్తారు. వాళ్లని కూడా వదిలేస్తుంది తల్లి. ఒక్కడే ఒక్కడు ఉంటాడు. కేవలం తల్లిని చూసి కన్నీళ్లతో కాళ్లు కడగటానికే

**పంతులుగారూ... మీరు వెంటనే ప్రయాణం కట్టండి. లేదంటే నేనే అంబులెన్స్‌లో ప్రయాణం కట్టాల్సి వస్తుంది. రానురానూ ఆమె మొండితనం ఎక్కువైపోతోంది అన్నాడు శివారెడ్డి. ఇంతలోనే నా మొండితనాన్ని మీరింకా చూడలేదు అంటూ మాటలు వినబడ్డాయి. గదిలో ఉన్నవాళ్లంతా ఒక్కసారిగా తలలు తిప్పి గుమ్మంకేసి చూశారు. ఉలికిపడ్డారందరూ, బాజిరెడ్డితో సహా. ఆ వచ్చింది ఎవరు? శివారెడ్డి పంతులుగారికి ఎక్కడకు ప్రయాణం కట్టమని చెబుతున్నాడు?**

వస్తాడు. వెన్ను తట్టి అభయం ఇస్తుంది. వెంట ఉండి కాపాడుతుంది తల్లి' దట్టంగా ఉన్న పొదల వెనుక స్పష్టంగా కనిపిస్తున్న గుడి గోపురం వైపు చూస్తూ చెప్పాడు వృద్ధుడు.

ఒక నిమిషం పాటు ఓపిక పట్టినా అతను ఆ పైన ఏమీ మాట్లాడకపోవటంతో, 'గుడికి వచ్చే పదిమందిలో మీరు తొమ్మిదిమందిని గురించే చెప్పారు. ఇంకోడు మిగిలే ఉన్నాడు' అంటూ గుర్తు చేశాడు వెట్టి.

'మొదటే చెప్పాను. దేవతని అడ్డం పెట్టుకుని చండాలమైన పనులు చేసేవాళ్లని గురించి' కర్కశంగా అన్నాడు వృద్ధుడు.

శివారెడ్డి తండ్రిగారు ఆ మొదటి కేటగిరీలోకి వస్తాడని డైరెక్టుగా చెప్పకపోయినా, అతని అభిప్రాయం అదేనని స్పష్టంగా తెలియటంతో నివ్వెరపోయాడు వెట్టి.

'పది గంటల సమయంలో భక్తులు గుడికి రావచ్చు. పొట్ట నింపుకునే దారిని చూపించినా, బద్ధకంతో పాడైపోతున్నానని నా తల్లి నన్ను నిందించవచ్చు. నేను పోయి గుళ్ళో కూర్చుంటాను' అంటూ కుర్చీలో నుంచి లేచాడు వృద్ధుడు.

తను మొదలుపెట్టిన సబ్జెక్టు మీద మాట్లాడటం అతనికి ఇష్టం లేదని తెలిసిపోయింది వెట్టికి. 'స్వామీ.. మీకు బాధ కలిగినా సరే, నాకు వివరంగా చెప్పి తీరాలి. మీరు చెప్పే మాటలు నాకున్న కొన్ని అనుమానాలని నివృత్తి చేస్తాయి. దయచేసి కూర్చోండి' తను కూడా లేచి అతని భుజంమీద చేయివేస్తూ సాదరంగా అడిగాడు.

'జరిగిపోయిన విషయాల్ని తిరిగి తవ్వుకోవడం వల్ల గుండెలు బరువెక్కటం తప్ప ఉపయోగం ఏముంటుంది?' అడిగాడు వృద్ధుడు.

'శివారెడ్డి తండ్రిగారితో పాటు ఆ ఎస్టేట్

మేనేజర్ బాజిరెడ్డి కూడా ఇక్కడికి వచ్చేవాడని నాకు తెలిసింది. అతని భక్తి ఎటువంటిది?' అడిగాడు వెట్టి.

'భక్తా, పాడా? వాడు వట్టి చవట. రాజగోపు రాన్ని దాటి ఒక్క అడుగు కూడా లోపలికి వేసేవాడు కాదు. కాపలా కాయటం కోసం మాత్రమే వచ్చే వాడు' అన్నాడు వృద్ధుడు.

'పవిత్రమైన ప్రదేశం ఇది. చుట్టూ భయంకర మైన పుట్టలు. అడుగు తడబడితే పడగలు తిప్పి పైపైకి వచ్చే పాములు... ఇక్కడ కాపలా అవసరమా?' అడి గాడు వెట్టి.

'కాపలా శివారెడ్డి తండ్రికి కాదు. నాకు' యథా లాపంగా చెప్పి, చటుక్కున నాలుక కరుచుకున్నాడు వృద్ధుడు. పరుగులాంటి నడకతో ఇంటి వెనుక భాగంలో ఉన్న పొదల మధ్యకు వెళ్లిపోయాడు.

పావుగంట పాటు ఓపికగా వెయిట్ చేశాడు వెట్టి. అప్పటికీ అతను వెనక్కి రాకపోవటంతో, తను కూడా అటుపోయి, బిగ్గరగా పిలిచాడు. ఒకసారి కాదు... పదిసార్లు పిలిచినా కూడా సమాధానం రాకపోవటంతో, మెల్లిగా వెనక్కి తిరిగి, రాజగోపురం ఎదుటికి వచ్చాడు.

అసహనంగా అటూఇటూ పచార్లు చేస్తు



న్నాడు మొదటగా దర్శనం చేసుకున్న భక్తుడు. తన వెహికల్ తీసుకుపోయిన వాళ్లని తీవ్రమైన పద జాలంతో నిందిస్తున్నాడు.

'ఎక్కడినించి వచ్చారయ్యా మీరు?' మర్యాదగా అడిగాడు వెట్టి.

'చింతలపల్లికి పది మైళ్ల అవతల రాయుడి పల్లి.... మళ్లీ సాయంత్రం నేను నంద్యాల వెళ్లాల్సిన పని ఉంది. టైమంతా ఇక్కడే వేస్ట్ అయిపోతోంది'.

ఈసారి అతని కంఠంలో ధ్వనించింది అదో రక మైన బాధ. పెళ్లివారిది నంద్యాల. మా అమ్మాయి వాళ్లకి నచ్చింది. ఇవాళ మంచిగా ఉందిట. మాట్లాడు కోవటానికి రమ్మన్నారు. వెళ్లకపోతే పొగరను కుంటారు. చేతికి అందే సంబంధం కాస్తా చేజారి పోతుంది' రేకులషెడ్ దగ్గర ఉన్న ఒక సిమెంట్ స్తంభాన్ని ఆనుకుంటూ వివరంగా చెప్పాడు.

గుడిలోకి పోయి పూజారితో కాసేపు ఆ మాట ఈ మాట మాట్లాడితే, తన అనుమానాల్ని బయట పెట్టే అవకాశం లభిస్తుందేమోనని అనుకుంటు న్నాడు వెట్టి. ఆ మనిషి మాటల్ని విన్న మరుక్షణం మటుమాయం అయిపోయిందా ఆలోచన.

'మిమ్మల్ని తీసుకుపోయి మీ ఊళ్లో దిగబెడితే సరిపోతుందా?' అని అడిగాడు.

'చాలు. భేషుగ్గా ఉంటుంది. నా బావమరిదిని ఇక్కడికి పంపిస్తాను. నా బండిని తీసుకుపోయిన వెధవలు ఇంకో పది గంటలు ఆలస్యంగా వచ్చినా పరవాలేదు' ముఖం ఒక్కసారిగా తేటపడుతుం డగా గబగబా అన్నాడు ఆ మనిషి.

'రెండు నిమిషాలు వెయిట్ చేసి రోడ్డుమీదకి రండి. నా మోటార్ బైక్‌ని కొంచెం దూరంగా నిలబెట్టి ఉంచాను' అంటూ పరుగులాంటి నడకతో మెయిన్ రోడ్డు మీదకి బయలుదేరాడు వెట్టి.

వంద అడుగుల దూరం పోయిన తర్వాత వద్దు వద్దని అనుకుంటూనే పక్కకి చూశాడు. ఎర్రటి మట్టితో తయారైన పెద్ద పుట్టమీద చుట్టలు చుట్టు కుని కనిపించింది పాము. మిలమిలలాడుతున్న కనులతో అతనివైపే చూస్తోంది.

•••

ఇంకో అరగంటలో చీకట్లు దట్టం అవుతా యనుకుంటూ ఉండగా - వేగంగా వచ్చి మెయిన్ బిల్డింగ్ ముందు ఆగింది కారు. గబుక్కున దిగి వెనక డోర్ తెరిచి పట్టుకున్నాడు డ్రైవర్.

విసురుగా దిగాడు బాజిరెడ్డి. పెద్దపెద్ద అడు గులు వేస్తూ లోపలికి బయలుదేరాడు. డైనింగ్ హాల్లో నిలబడి సంపంగి అందించిన కాఫీ గ్లాసు తీసు కుంటున్న శంకరయ్యకు వెంటనే వచ్చింది అనుమానం.

'అహోబిలం వెళ్తానంటివి? వెళ్లలేదా? వెళ్లి అప్పుడే వచ్చేయటం జరిగిందా?' రెండు మాటల్నీ తనే అడిగాడు.

'ఏడీ? నువ్వూ, ఆ ప్రణవమ్మా వెంటబెట్టుకు వచ్చిన ఆ లోఫర్‌గాడు ఎక్కడ?' పైకప్పు ప్రకంపించే శృతిలో అడిగాడు బాజిరెడ్డి.

నువ్వేకదా చౌడేశ్వరి గుడికి వెళ్ళిరమ్మని చెప్పావు? మర్చిపోయావా?' ఆశ్చర్యం నటిస్తూ అడి గాడు శంకరయ్య.

'నాకు మతిమరుపేమీ రాలేదు. ఎంతసేపు పడుతుంది వెళ్లి రావటానికి? ఎప్పుడో తెల్లవారు జామున మూడున్నరకి వెళ్లినవాడు ఇంకా తిరిగి రాకపోవటం ఏమిటి?' మరో అరుపు అరిచాడు బాజిరెడ్డి.

'మూడున్నరకి వెళ్లాడని మీకు ఎవరు చెప్పారు?' మరింత ఆశ్చర్యంగా అడిగాడు శంకరయ్య.

'నేనే చెప్పానయ్యా. వచ్చీరావడంతోటే నన్ను అడిగారు' మెయిన్‌డోర్ దగ్గర నుంచి లోపలికి వస్తూ వెంటనే సమాధానం ఇచ్చాడు డ్రైవర్. అతని కెవరు చెప్పారని అతన్ని కూడా అడగబోయి, అన వసరమైన సంభాషణ అవుతుందని ఆగిపోయాడు శంకరయ్య.

'అడవిదారి... ఇంతకుముందు ఆ అబ్బయ్య చూడని ప్రదేశం. దారితప్పి ఎటైనా పక్కకి పోయి ఉండ వచ్చు. నిన్న రాత్రి మితిమీరి మందు పుచ్చుకో వటం వల్ల గుడి మండపంలోనే పడుకుని గురకలు తీస్తూ ఉండి ఉండవచ్చు. తొందర దేనికి, వెళ్లిన వాడు వెనక్కిరాక తప్పదు. వస్తాడుగా.. తనే చెపు తాడు ఆలస్యానికి కారణం' శంకరయ్య వెనుక నిల బడి తాపీగా తీరికగా విషయాన్ని విశ్లేషించాడు పంతులు గారు.

'వెనకేసుకు రాకండి పంతులుగారూ... తల బిరుసు ముఖాల్ని వెనకేసుకు వస్తే ఎదురుదెబ్బలు చాలా తగులుతాయ్..' ఆ మాటల్ని భరించటానికి వీలు పడకపోవడంతో, విసురుగా హెచ్చరించి శివా రెడ్డి గదిలోకి పోయాడు బాజిరెడ్డి.

'మండిపోతోంది కాబోలు... తను పంపించిన వాళ్లల్లో ఎవరో ఒకరు బాల్చీ తన్నేసి ఉంటారని నా అనుమానం' డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని కాఫీని సిప్‌చేస్తూ చిన్నగా అన్నది ప్రణవి.

'వాడు ఇంత స్పీడుగా వస్తాడని అనుకోలేదమ్మా. శివారెడ్డి దగ్గర ఎటువంటి పంచాయితీ పెడతాడో ఏమిటో..' అంటూ తాను కూడా అటుకేసి బయలు దేరాడు పంతులుగారు.

తను మాట్లాడదల్చుకున్నది ఏమిటో అప్పటికే మాట్లాడేసినట్లున్నాడు బాజిరెడ్డి. పడకమీద కూర్చున్న శివారెడ్డి ముఖం ఎర్రగా కందిపోయి ఉన్నది.

'పంతులుగారూ... మీరు వెంటనే ప్రయాణానికి సిద్ధం అవండి. అమ్మని వెంటనే తీసుకురావాలి. తను రాకపోతే అంబులెన్స్‌లో నేనే బయలుదేరి వస్తానని చెప్పండి' పంతులుగారిని చూసిన వెంటనే జీరపడిన కంఠంతో చెప్పాడు.

'అవసరం లేదు. అమ్మ వస్తోంది' జరిగింది ఏమిటో ఊహించటానికి ప్రయత్నం చేస్తూ చెప్పాడు పంతులుగారు.

'ఇట్లాంటి రావటాలు ఇప్పటికి చాలాసార్లు అయిపోయినయ్. ఊరుకున్న కొద్దీ ఆమె మొండి తనం హద్దులు దాటిపోతోంది' గోడకు ఆనుకుని నిలబడి ఉన్న బాజిరెడ్డి వెక్కిరింపుగా అన్నాడు.

శివారెడ్డి కంటే ముందుగా ఆ ఇంటికి మహా రాణి అనదగ్గ మనిషిని గురించి అతను ఆ విధంగా కామెంట్ చేయడంతో నోరు వెళ్లబెట్టాడు పంతులు గారు.

'నిజమే పంతులుగారూ, బాజిరెడ్డి నిజమే చెప్పాడు. అమ్మ మొండితనం...' అంటున్న శివారెడ్డి మాటలు మధ్యలోనే ఆగిపోయాయి. తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయింది. బాజిరెడ్డి ముఖం అయితే తెల్లగా పాలిపోయింది రక్తం లేనట్టు.

నడుము మీద ఒక చెయ్యి వేసుకుని, రెండవ చేత్తో పొడవాటి తన కేశాలను వెనక్కి నెట్టుకుంటూ నిలబడింది పిచ్చమ్మి.

'నా మొండితనాన్ని మీరు పూర్తిగా చూడలేదు. ఎదురుగా లేని మనిషిని పట్టుకుని నోటికి వచ్చి నట్లు మాట్లాడటం ఒక్కటే మీకు తెలిసింది. ఏంటి నాతో పని? సంతకాలు పెట్టాలా ఎక్కడైనా?' కాటుక

పెట్టుకున్నట్టు నల్లగా ఉన్న నేత్రాలను గిర్రుగిర్రున తిప్పుతూ అడిగింది.

'అబ్బెబ్బే... అలాంటి పని ఏదీలేదు. చాలా కాల మైంది మిమ్మల్ని చూసి, ఒకసారి చూస్తానంటే పిలుద్దామనీ-' అంటూ మాటల్ని నాన్చాడు బాజి రెడ్డి.

నేను బయలుదేరినట్లు అమ్మ మీకు ఎప్పుడో ఫోను చేసి ఉంటుంది. ఆ మాట వాళ్ల చెవిన వేసి ఉన్నట్లయితే ఈ వీరభోజుడికి ఇంత ఆవేశం వచ్చి ఉండేదికాదు. ఎందుకు చెప్పలేదు పంతులుగారు?' పంతులుగారిని నిలదీసింది ఆమె.

ఆమె తనను సంబోధించిన పద్ధతిని గమ నించి మరింతగా ముఖం ముడుచుకున్నాడు బాజి రెడ్డి. అమ్మగారిలో ఇంకా మార్పురాలేదు. మాటలు మారనే లేదు' జీవంలేని నవ్వు ఒకటి నవ్వుతూ ఆమె పక్కనుంచి బయటికి వెళ్లిపోయాడు.

బొమ్మలా కూర్చుండిపోయిన శివారెడ్డి దగ్గరికి పోయిందామె. బెడ్ అంచుమీద కూర్చుని, కుడి చేత్తో అతని వెన్ను నిమిరింది.

ఎందుకో తెలియదు. బొటబొటా బుగ్గల మీదికి వచ్చేశాయి శివారెడ్డికి కన్నీళ్లు. పిచ్చమ్మి కంఠాన్ని విని పరిగెత్తుకుంటూ వచ్చింది అతని భార్య. ఆమె కూడా కారణం లేకుండానే కన్నీళ్లు పెట్టుకుంది.

'తగ్గిపోతుందిరా.. నీ జబ్బు త్వరలోనే తగ్గిపో తుంది. నీకు నిండు నూరేళ్ళు ఆయుష్షు ఉందని నాకు తెలుసు కాబట్టే ఆత్రపడలేదు నేను. పిలిచినప్పుడు రాలేదు. ఇప్పుడు వచ్చానుగా.. నీకు ఎటువంటి బాధ ఉండదు' వెన్ను నిమురుతూనే మృదువుగా అన్నది పిచ్చమ్మి.

కనుసైగతో అందరినీ కమాండ్ చేసే శివారెడ్డి ఒక్కసారిగా చిన్నపిల్లాడి మాదిరి ఆమె ఒడిలో తల పెట్టుకున్నాడు.

నిశ్చలంగా నిలబడి చూస్తున్న పంతులుగారి కళ్లు కూడా తడి అయిపోయాయి, అది గమనించిన వెంటనే.

'పొద్దున్న బయలుదేరేటప్పుడు చేసిన టిఫిను. దారిలో ఎక్కడా ఆగలేదు. ఆకలి వేస్తోంది' శివారెడ్డి తల నిమురుతూ, అతని భార్యకు చెప్పింది పిచ్చమ్మి.

'రెండంటే రెండు నిమిషాలు అత్తమ్మ, ముందు కాస్తంత కాఫీ తాగుదురు గాని..' అంటూ హడా విడిగా కిచెన్‌వైపు పరిగెత్తిందామె.

'హల్లో ఎవ్రీబడీ.. ఎలా ఉన్నాడు మా పేషెంటు?' అంటూ అప్పుడే గదిలోకి వచ్చాడు పెద్ద డాక్టరుగారు.

ఒక పక్కగా నిలబడి ఉన్న ఆయన అసి స్టెంటు, హాస్పిటల్ నర్సు ఇద్దరూ గబగబా నమ స్కారాలు చేసి, తమ పక్కనే ఉన్న ఏవో కాయి తాల్ని అందించబోయారు.

వాటివంక చూడను కూడా చూడలేదాయన. 'అమ్మా వచ్చారా? శివారెడ్డి సారు చాలా బెంగ పెట్టు కున్నాడు' పిచ్చమ్మికి నమస్కారం చేస్తూ అన్నాడు.

తన ఒడిలో తలపెట్టుకున్న శివారెడ్డిని సరిగ్గా కూర్చోబెట్టి బెడ్‌మీది నుంచి దిగింది ఆమె. 'చిటికె వేస్తే రెక్కలు కట్టుకుని వాలిపోయే మీరందరూ ఉండగా మా అబ్బాయికి వచ్చిన బాధ ఏదీ ఉండదు. ఎందుకైనా మంచిదని నా మనిషిని ఒక డిని ఇక్కడికి పంపించాను. ఉపయోగపడ్డాడు?' నవ్వుతూ అడిగింది.

'ఎవరు? ఆ యంగ్ మ్యానేనా? అతను మీ మనిషేనా? బ్రిలియంట్. వెరీ షార్ప్! అతని చెయ్యి చాలా మంచిది తల్లీ' హుషారుగా అన్నాడు డాక్టరు.

'ఏడీ తను?' రమణయ్యపంతులువైపు తిరు గుతూ అడిగింది ఆమె.

ఇంకా రాలేదు తల్లీ. చౌడేశ్వరి గుడి దగ్గరికి పంపించాడు మీ అబ్బాయి. మధ్యాహ్నానికల్లా తిరిగి వచ్చేయాలి. ఎందుకో రాలేదు. ఎదురు చూస్తున్నాం' వెంటనే సమాధానం ఇచ్చాడు పంతులుగారు.

'మీరు వచ్చిన పని చూసుకోండి డాక్టరుగారు. నేను పలుకరించవలసిన వాళ్లు ఇంకా చాలామంది ఉన్నారు' అంటూ ఆ గదిలో నుంచి ఇవతలికి వచ్చింది ఆమె.

'పంతులుగారూ... మీరు అమ్మ దగ్గరే ఉండండి. ఒంటరిగా వదలకండి' వెంటనే పంతులు గారిని హెచ్చరించాడు శివారెడ్డి.




## సహాయం చేస్తే సంబంధం ఉన్నట్టేనా?

*తనకూ, ధనుష్‌కూ మధ్య ఏదో ఉందన్న పుకార్లపై అమలాపాల్ మండి పడింది. ధనుష్ తన శ్రేయోభిలాషి అనీ, చాలా విషయాల్లో తనకు బోలెడంత సహాయం చేశాడనీ చెప్పుకొచ్చింది. తనకూ తన భర్తకూ మధ్య వచ్చిన విభేదాలు పరిష్కరించడానికి తమ ఇద్దరితో మాట్లాడ డానికి కూడా సిద్ధపడ్డాడని అంటోంది. తను జీవితంలో ఓడిపోకుండా, సినిమా అవకాశాలు రావ డానికి సహాయం చేశాడనీ అలాంటి మంచి వ్యక్తితో తనకు సంబంధం ఉంది అంటూ వార్తలు రావడం చాలా బాధ కలిగించిందనీ, తన వివాహ బంధం విచ్ఛిన్నమైపోయిన తరువాత తన మీద చాలా పుకార్లు వచ్చాయనీ, వేటికీ ఇంతగా బాధ పడలేదని చెబుతోంది. తమ మధ్య స్నేహబంధం తప్ప మరో బంధం లేదని స్పష్టం చేస్తోంది.*

•••

సూటిగా డైనింగ్ రూమ్‌లోకి వచ్చిన తల్లిని చూసేసరికి అవాక్కయిపోయింది ప్రణవి. ఆమె ఏ క్షణంలోనైనా వచ్చేస్తుందని తెలిసి కూడా, షాక్ తినకుండా ఉండలేకపోయింది.

'ఏమిటే.. ఆ వెర్రిచూపులు?' క్వశ్చన్ చేస్తూ ఒక కుర్చీలో చేరగిలపడింది పిచ్చమ్మి.

సిల్వర్ ట్రేలో కాఫీ కప్పు పెట్టుకుని స్వయంగా తీసుకువచ్చింది శివారెడ్డి భార్య. 'అత్తమ్మా.. టిఫిను రెడీగా ఉంది. అన్నమే తింటానంటే అరగంటలో సిద్ధం' అని చెప్పింది.

'అందరితో కలిసి అన్నమే తింటానులే. నా మనిషి కూడా రావాలి కదా. ఏమైపోయాడో, ఎక్కడ కూర్చుని కబుర్లు చెపుతున్నాడో..' కాఫీ కప్పును అందుకుంటూ మృదువుగా అన్నది పిచ్చమ్మి.

'అత్తమ్మ.. అతన్ని గనక మీరు పంపించి ఉండక పోయినట్లయితే, ఏం జరిగి ఉండేదో ఊహించ టానికి కూడా భయం వేస్తోంది' పక్కనే కూర్చుంటూ అన్నది శివారెడ్డి భార్య.

'నాకు తెలుసు పిల్లా! అన్నీ నాకు తెలుసు. తెలి యదని మీరెవరూ అనుకోవాల్సిన అవసరం లేదు' కాఫీని సిప్ చేస్తూ చెప్పింది పిచ్చమ్మి.

అప్పటికే తేరుకున్నది ప్రణవి, తన షాక్ నుంచి. 'పౌర్ణమి దాకా రానని చెప్పిన దానివి అప్పుడే ఎందుకు వచ్చావు?' తల్లి ముఖాన్ని ముని వేళ్లతో తనవైపు తిప్పుకుంటూ అడిగింది.

'తప్పు.. తప్పు ప్రణవీ.. తప్పు మాట్లాడుతున్నావు. కంట్రోల్ యువర్‌సెల్ఫ్' వెంటనే ఆమె భుజంమీద చేయి వేస్తూ హెచ్చరించింది ప్రత్యూష.

అక్కడికి వచ్చిన తర్వాత మొదటిసారి ఆమె వంక తేరిపార చూసి ముసిముసిగా నవ్వుతూ తల పంకించింది పిచ్చమ్మి.

'ఏమిటి తల్లీ. తల అలా ఊపుతున్నావు?' వెంటనే అడిగాడు శంకరయ్య.

'ఎందుకో చెప్పినా ఇప్పటికిప్పుడు నీకు అర్థం కాదులే. తాటాకు పందిళ్ల వాసన గుర్తుకు వచ్చింది. ఒకదానితో పని పూర్తి అవుతుందా లేక రెండో పందిరి కూడా అవసరం అవుతుందా అనేది ఇంకా స్పష్టం కావటం లేదు. అయిన తర్వాత చెప్తాను' అన్నది ఆమె.

'ఇక్కడ... ఇక్కడ ఏం జరుగుతున్నదో తెలుసా?' తను మొదలుపెట్టిన సంభాషణ ఎటెటో వెళ్లిపోతూ ఉండటాన్ని గమనించి కోపంగా అడి గింది ప్రణవి, ప్రత్యూష తన భుజాన్ని గట్టిగా అదుము తున్నా లెక్క చేయకుండా.

'ఆ పనిమనిషి పేరేమిటి? సంపంగేనా?' శివా రెడ్డి భార్యను అడిగింది పిచ్చమ్మి. తల ఊపింది

ఆమె. 'ఎందుకు అలా తలుపుల చాటున నిలబడి చెవులు రిక్కించడం? కావాలంటే ఎదుటికి వచ్చి మాటలన్నిటినీ వినవచ్చు కదా' అన్నది పిచ్చమ్మి.

కోపం కాస్తా ఆశ్చర్యంగా మారిపోతుండగా, కిచెన్‌వైపు చూసింది ప్రణవి - అందరితోపాటు తను కూడా.

తనవెనుక ఏదో భయంకరమైన అడవి జంతువు పడినట్లు అతివేగంగా ఇంకో గదిలోకి పారిపో యింది ఆ తలుపుల చాటున ఉన్న సంపంగి.

'నాకు తెలియనిది ఏదీ ఇక్కడ జరగడం లేదు. నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ జరగదు. కాని అయిన దానికి కానిదానికి నువ్వు ఆవేశపడటం మాత్రం మానుకోవాలి. పెద్దచేపలను పట్టుకోవటానికి చిన్న చేపలను ఎరవేయాలి. అది మాత్రం గుర్తుంచుకో' కూతురివైపు చూస్తూ మృదువుగా చెప్పింది పిచ్చమ్మి.

'నీకు ఏమైనా అర్థం అయిందా?' ప్రత్యూషను తీసుకుని పది అడుగులు అవతలికి పోయి రహ స్యంగా అడిగింది ప్రణవి.

'ఉట్టి పుణ్యానికి ఇక్కడికి రాలేదు అమ్మగారు. ఏదో నిశ్చయం చేసుకునే వచ్చారు' చెప్పింది ఆమె.

'ఏమిటా నిశ్చయం?' చిరాకుగా అడిగింది ప్రణవి.

చెల్లాయిని బాజిరెడ్డి కొడుక్కి ఇచ్చి పెళ్ళి చేద్దాం. మనకి బాగా కావాల్సినవాడు. మన బిడ్డ మనకు ఎదురుగానే ఉంటుంది.

ఎదుట ఉన్న వెండి ప్లేటును అవతలికి జరిపి, చివాలున కుర్చీలో నుంచి లేవబోయిన కూతురి చెయ్యి పట్టుకుని బలవంతంగా ఆపేసింది పిచ్చమ్మి.

'నువ్వు ఒప్పుకోవాలమ్మా. కాదని అనకూడదు' మరోమాట అన్నాడు శివారెడ్డి.

'పంతులుగారూ..' అని పిలిచింది పిచ్చమ్మి.

డైనింగ్ టేబుల్‌కి దూరంగా కూర్చుని ఉన్న పంతులుగారు వెంటనే లేచాడు.

దగ్గర్లో మంచి ముహూర్తం ఎప్పుడు ఉందో చూసి చెప్పండి. 'చేతిని వదిలించుకోవటానికి' ప్రయత్నం చేస్తున్న కూతుర్ని కనులతో వారిస్తూ అడిగింది పిచ్చమ్మి.

పరుగులాంటి నడకతో తన గదిలోకి పోయి పది క్షణాల్లో పంచాంగంతో తిరిగి వచ్చాడు పంతులు గారు. 'తల్లీ.. ఇరవైమూడు రోజుల వరకు అసలు ఒక్క ముహూర్తం కూడా లేదు. ఏదో ఒకటి సరిపో తుందని అనుకున్నా కూడా ఇరవైమూడు రోజుల తర్వాతనే' అన్నాడు.

'వీరభోజుడికి చెప్పు. ఏర్పాట్లు చేసుకోమను. ఎంతమందిని పిలుచుకోవాలో అంతమందినీ




పిలుచుకోమను' శివారెడ్డికి చెప్పింది పిచ్చమ్మి.

'రాజీ... ఫోన్ చేసి చెప్పు..' ఉత్సాహంగా భార్యకి చెప్పాడు శివారెడ్డి.

'నువ్వు చెప్పాల్సిన అవసరం లేదు. ఇంకో రెండు నిమిషాల్లో చేరిపోతుంది వార్త' తన ప్లేటు ముందు నుంచి లేవబోతున్న ఆమెకు చెప్పింది పిచ్చమ్మి.

'ఎలా చేరుతుంది? ఎవరు చెపుతారు?' అయో మయంగా అడిగింది ఆమె.

ప్రత్యూష వైపు చూసింది పిచ్చమ్మి.

కిచెన్‌వైపు వెళ్లిపోతున్న సంపంగిని అబ్జర్వ్ చేసింది ఆమె.

'విఠల్‌బాబు వచ్చిన తర్వాతగాని మనకి తెలి యదు. మీ అమ్మగారి మాటలు ఎవరికైనా అర్థం కావటమంటూ జరిగితే - అది అతనికి ఒక్కడికే. చెల్లాచెదురైన వరి పనల్ని జాగ్రత్తగా కోసే పనిని అతనికి అప్పగించింది. అదేమిటో తెలిస్తే ఈ చేపల వేట గురించి కూడా తెలుస్తుంది' చెప్పింది ఆమె.

'ఈసారి నేను నీతోపాటు కాలేజీకి రాలేననిపి స్తోంది' గట్టిగా నిట్టూరుస్తూ అన్నది ప్రణవి.

'అదేమిటి? అలా ఎందుకని?' ఆశ్చర్యంగా అడి గింది ప్రత్యూష.

'ఎందుకంటే ఈ ఎత్తులకు పైఎత్తుల దెబ్బకి నాకు పిచ్చెక్కిపోతున్నది కనుక' అంటూ తమ బెడ్ రూమ్ వైపు వేగంగా వెళ్లిపోయింది ప్రణవి.

●●●

అంతకుముందు అందరినీ తన గదిలోనే కూర్చుని అన్నాలు తినమని చెప్పినట్లు ఎనిమిది గంటల సమయంలో మళ్లీ కోరిక వెలిబుచ్చాడు శివారెడ్డి.

అందరూ కూర్చుని ఆరగించటం మొదలు పెట్టిన మూడో నిమిషంలో పిచ్చమ్మికి తన మనసు లోని మాటను ఎరుక పరిచాడు.

●●●

'ఊరు, పేరు తెలియకపోయినా, కష్టం తెలిసి సాయం చేసిన నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలి యటం లేదు. నీ బుల్లెట్ బండిమీద ఆయన్ను తీసుకురాకుండా ఉన్నట్లయితే, చాలా అవమానం జరిగిపోయి ఉండేది. ఆయన గుడికి వెళ్లిన దగ్గ ర్నుంచీ ఒకటే ఫోన్లు - వస్తున్నారా లేదా అని' వెట్టితో అన్నది - అతను గుడి దగర్నుంచి తీసుకు వచ్చిన పెద్దమనిషి భార్య.

'నేను చేసింది ఏమంత గొప్పపని కాదు తల్లీ. అవసరం ఎటువంటిదో తెలిస్తే దారినపోయే వాళ్లు ఎవరైనా సరే, వెంటనే చేస్తారు సాయం' అన్నాడు అతను.

'పదిమందీ తిరిగే దారిలో నిలబడి ఉంటే నువ్వు చెప్పినట్లే జరుగుతుంది. అదసలే అడవి దారి. ఆ దారిలో పగటి సమయంలో ప్రయాణమే మహా ఇబ్బంది. చీకటి పడిన తర్వాత ఇంక చెప్పా ల్సిన పనే లేదు' అన్నది ఆమె.

మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో ఆమె భర్తను ఇంటికి చేర్చాడు వెట్టి. అప్పటికే సిద్ధంగా ఉన్నారు ఆ మనిషితో పాటుగా నంద్యాల వెళ్లే బంధు వులు కొంతమంది. వారికి ఆయన్ని అప్పగించి తన దారిన తను వెనక్కి బయలుదేరటం మాత్రం అసాధ్యమై పోయింది అతనికి.

భోజనం చేయవలసిన సమయంలో తమ ఇంటి గడప తొక్కిన మనిషికి మంచినీళ్లు మాత్రమే ఇచ్చి సాగనంపటానికి ససేమిరా అన్నది ఆ ఇంటి ఇల్లాలు.

'చౌడేశ్వరి గుడికి వెళ్ళాలని ఈ రోజున కూర గాయలతోనే వంట చేయటం జరిగింది. నువ్వు రేపు కూడా మాతోనే ఉంటానంటే కమ్మటి వేటను వేయించి విందు భోజనం పెడతాను. ఉండిపో అబ్బాయ్యా..' వడ్డన చేస్తున్న సమయంలో ఆదరంగా అడిగింది.

ఆమె మనసు నొచ్చుకోకుండా, మృదువైన సమాధానం ఎలా చెప్పాలో తెలియక తత్తరపాటుకు గురవుతున్న వెట్టికి చటుక్కున గుర్తుకు వచ్చింది తన ప్యాంటు జేబులో ఉన్న చౌడేశ్వరి ప్రసాదం గురించి.

'తల్లీ...అవతల నేను ఎప్పుడు వస్తానో అని ఎదురు చూస్తూ ఉంటారు మా వాళ్లు. ప్రసాదం తీసుకుపోయి ఇవ్వాలి. మీరు వేరుగా అనుకోకండి' అన్నాడు ఆలస్యం చేయకుండా.

చౌడేశ్వరి పేరు బయటికి వచ్చిన తర్వాత ఒత్తిడి చేయటాన్ని మానుకున్నది ఆ ఇల్లాలు. 'ఫ్యాను కింద పడక వేయిస్తాను. పది నిమిషాలు నడుము వాల్చిన తర్వాత వెళ్లవచ్చు. ఈ లోపల టీ పెట్టిస్తాను' అని చెప్పింది.

ఉక్కిరిబిక్కిరి చేస్తున్న ఆ ఆదరణ ఆప్యాయ తల్ని తట్టుకోవటం వెట్టికి అసాధ్యమైపోయింది. కాదు కూడదని చెప్పటం చేతకాక పడకమీద నడుము వాల్చాడు. అదే అతను చేసిన తప్పు. వెంటనే వచ్చి గుండెల మీద కూర్చుంది నిద్రా దేవత. మెల కువ వచ్చేసరికి చీకట్లు చుట్టుముట్టటానికి సిద్ధంగా ఉన్నట్లు తెలిసి వచ్చింది.

'మెలకువ వచ్చిందా అబ్బయ్య. ఇంత అలస టను నెత్తిమీద పెట్టుకుని, మా ఇంటాయనను క్షేమంగా తీసుకువచ్చావు నువ్వు. నిజంగా నువ్వు గొప్పోడివి. అరగంటలో అన్నం వండటం అయిపో తుంది. శుభ్రంగా తిని మళ్లీ పడక ఎక్కవచ్చు' వేడి వేడి టీ గ్లాసును అందిస్తూ చెప్పింది ఇంటి ఇల్లాలు.

'అన్నట్టు చెప్పటం మరిచిపోయాను. నా తమ్ముడు గుడి దగ్గర్నుంచి మా బండిని తీసుకు వచ్చేశాడు. మధ్యాహ్నం రెండింటికి వచ్చిందిట' అని కూడా చెప్పింది.

'ఒకసారి మీ తమ్ముడిగారితో నేను మాట్లాడ వచ్చా?' అని అడిగాడు వెట్టి.

**(ఇంకావుంది)**

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్




డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# క్యాన్సర్ ఎముకకు పాకితే అనర్థం

## ఎంబిడికి అందుబాటులో అత్యాధునిక చికిత్సలు

మన శరీరాకృతి ఎముకలతో నిర్మితమై ఉంటుంది. బయటకు కనిపించే శరీరాకృతిని అలా నిలబెట్టి ఉంచడానికి తోడ్పడేవి ఎముకలే. శరీరంలో లోపల ఎముక లేకపోతే మనకు రూపమే ఉండదు. ఎముకలు కూడా శరీరంలో భాగమే కాబట్టి వాటికి క్యాన్సర్లు వచ్చే అవకాశం ఉంటుంది. కాకపోతే నేరుగా ఎముకకే క్యాన్సర్ రావడం అరుదు. కానీ సాధారణంగా ఇతర క్యాన్సర్లు ఎముకలకు పాకి ఎన్నో అనర్థాలకు దారితీస్తాయి. ఈ తరహా క్యాన్సర్లను మెటస్టాటిక్ బోన్ డిసీజ్(ఎంబిడి) అంటారు. ఈ క్యాన్సర్ సోకిన భాగంలో నొప్పితో పాటు దైనందిన జీవితంలో ఇబ్బందులు ఎదురవుతాయి. ప్రస్తుతం ఈ క్యాన్సర్లకు అత్యాధునిక చికిత్సా విధానాలు అందుబాటులోకి వచ్చాయి.

**Bone Metastases Mechanism**




### ఎంబిడి అంటే...?

శరీరంలో ఏ భాగంలో క్యాన్సర్ మొదలైతే, దానిని అవయవ క్యాన్సర్‌గా చెబుతారు. ఊపిరితిత్తులకు క్యాన్సర్ సోకితే దానిని లంగ్ క్యాన్సర్ అని పేర్కొంటారు. అలాగే రొమ్ము, ప్రోస్టేట్ క్యాన్సర్ వంటివి క్యాన్సర్లు ఉంటాయి. ఏ భాగానికి ముందుగా క్యాన్సర్ వచ్చిందో దానిని ప్రైమరీ క్యాన్సర్ అంటారు. క్యాన్సర్ అన్నది ఆ అవయవానికే పరిమితం కాకుండా ఎముకలకు పాకితే దానిని మెటస్టాటిక్ బోన్ డిసీజ్(ఎంబిడి) అంటారు. క్యాన్సర్ కణాలు వృద్ధి చెందిన ప్రాంతంలో ఎముకల బలహీనంగా మారి సులువుగా విరుగుతుంది. ఎంబిడి వల్ల ఎముక విరగడాన్ని పాథలాజికల్ ఫ్రాక్చర్స్‌గా పేర్కొంటారు. ఎవరికైనా క్యాన్సర్ సోకి చికిత్స తీసుకుంటూ ఉంటే, ఆ క్యాన్సర్ ఇతర అవయవాలకు వ్యాప్తిచెందడం గురించి వారి వైద్యులతో చర్చించాలి. కొన్ని క్యాన్సర్లు త్వరగా ఎముకకు వ్యాపించవు. మరికొన్ని మాత్రం త్వరగా ఎముకకు పాకే అవకాశం ఉంటుంది. రొమ్ము, ఊపిరితిత్తులు, థైరాయిడ్, కిడ్నీ, ప్రోస్టేట్ క్యాన్సర్లు ఎముకకు పాకే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

### ఏ భాగాలకు వస్తుంది...?

శరీరంలోని వివిధ అవయవాలకు సోకిన క్యాన్సర్ ఊపిరితిత్తులు, కాలేయం తర్వాత అస్థిపంజరానికి వ్యాపించే అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఊపిరితిత్తులు, కాలేయ మెటస్టాటిక్‌లలో లక్షణాలు త్వరగా బయటపడవు. కానీ ఎంబిడిలలో నొప్పి కనిపిస్తుంది. అస్థిపంజరంలో వెన్నుముక, పక్కటెముకలు, పుర్రె, పెల్విస్ (పృష్ఠభాగం), పై చేయి, కాలి ఎముకకు ఎంబిడి సోకే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

**నొప్పి:** ఎంబిడిలో కనిపించే సాధారణ లక్షణం నొప్పి. కణితి పెరగడం వల్ల ఎముక బలహీనపడి నొప్పి వస్తుంది. వెన్నుముక, పెల్విస్ భాగంలో నొప్పి రావచ్చు.

**ఫ్రాక్చర్:** బలహీనమైన ఎముక త్వరగా విరుగుతుంది. ఎంబిడి సోకితే చిన్న గాయానికి కూడ ఎముక విరిగే అవకాశం ఉంటుంది.

**ఎనీమియా:** ఎంబిడి రోగులలో ఎనీమియా(ఎర్ర రక్త కణాల ఉత్పత్తి తగ్గడం) అనే అసాధారణ రక్త పరిస్థితులు కనిపిస్తుంటుంది.

క్యాన్సర్ రోగికి ఏదైనా నొప్పి అనిపిస్తే వెంటనే వారి వైద్యులకు తెలియజేయాలి. ముఖ్యంగా వెనుక భాగంలో, కాళ్లలో, చేతుల్లో నొప్పి కనిపించి వాకింగ్, లిఫ్టింగ్ వంటి దైనందిన కార్యకలాపాలలో ఇబ్బంది అనిపిస్తే ఏమాత్రం నిర్లక్ష్యం చేయకుండా వైద్యులను సంప్రదించాలి.

### నిర్ధారణ పరీక్షలు

రోగిని పరీక్షించిన తర్వాత వైద్యులు ఎక్స్-రే తీయించమని చెబుతారు. అసౌకర్యంగా ఉన్న ఎముక భాగంలో ఎక్స్-రే తీయిస్తే ఎముకకు ఎంతమేర క్యాన్సర్ సోకిందో తెలుసుకోగలుగుతారు. రోగి పరిస్థితిని, అవసరాన్ని బట్టి బోన్‌స్కాన్, కంప్యూటరైజ్డ్ టెమోగ్రఫీ(సిటి) స్కాన్, మాగ్నటిక్ రిసొనెన్స్ ఇమేజ్(ఎంఆర్ఐ) వంటి పరీక్షలు చేయించమని చెబుతారు.

### ఎంబిడినా లేక సర్కోమానా అని తెలిసేదెలా...?

బోన్ క్యాన్సర్‌లో రెండు రకాలు ఉంటాయి. ఒకటి ఎంబిడి, రెండవది సర్కోమా ఎముకకు క్యాన్సర్ సోకితే అది ఎంబిడినా..? లేక సర్కోమా..? అని నిర్ధారణ చేసుకోవాల్సి ఉంటుంది. ముందుగా ఎముకలోనే పుట్టడాన్ని ప్రైమరీ క్యాన్సర్ అంటారు. ఈ తరహా క్యాన్సర్‌ను సర్కోమా అంటారు. 45 ఏళ్లు పైబడి ఎలాంటి క్యాన్సర్ చరిత్ర లేని రోగికి ఎముకలో క్యాన్సర్ కణాలు వృద్ధి చెంది ఎముక పెరుగుతున్నట్లు ఎక్స్-రే నిర్ధారణ అయితే ఆర్థోపెడిక్ సర్జన్లలో క్యాన్సర్ సర్జరీలలో ప్రత్యేకంగా శిక్షణ పొందిన ఆర్థోపెడిక్ ఆంకాలజిస్టులను సంప్రదించాలి. వారు ఎముకలోని కణితి మెటస్టాటిక్ బోన్ డిసీజా లేక సర్కోమా అని నిర్ధారిస్తారు. వ్యాధి నిర్ధారణకు బయాప్సీ కూడా అవసరం కావచ్చు. క్లినిక్‌లో నీడిల్ బయాప్సీ లేదా చిన్న సర్జరీ ప్రక్రియ ద్వారా ఈ పరీక్షను నిర్వహిస్తారు. బయాప్సీ ద్వారా అది ఏ క్యాన్సర్..? ఎంత మేరకు వ్యాపించింది నిర్ధారిస్తారు. ఎక్స్-రే, ఇతర పరీక్షల రిపోర్టులు క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాత ఎంబిడి నిర్ధారిస్తారు. క్యాన్సర్ రోగులలో కొన్ని రకాల కీమోథెరఫీ వల్ల కూడా ఎముక నొప్పి రావచ్చు. అంతమాత్రాన అది ఎంబిడి కాదు. అందుకే చాలా జాగ్రత్తగా పరీక్షించిన తర్వాతనే ఈ వ్యాధిని నిర్ధారిస్తారు.

### చికిత్సా ప్రక్రియలు

ఎంబిడి చికిత్సలో వ్యాధి ఏదశలో ఉంది, ఎముకలోని ఏ ప్రాంతంలో ఉంది, ఆ క్యాన్సర్ కణితి పరిమాణం ఎంత, రోగి ఇతర ఆరోగ్య పరిస్థితులేంటి అనే అంశాలను పరిగణలోకి తీసుకుని చికిత్స అందిస్తారు. ఈ వ్యాధి సోకిన వారికి నాణ్యమైన జీవితం అందించే అధునాతన చికిత్సా విధానాలు అందుబాటులో వచ్చాయి. ప్రస్తుతం సర్జరీ ప్రక్రియలతోపాటు రేడియేషన్, మెడికల్ థెరఫీలలో అత్యాధునిక పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. ఎంబిడి చికిత్సలో నొప్పిని తగ్గించి, వ్యాధి వ్యాప్తి చెందడాన్ని నిరోధిచేందుకు మందులు, రేడియేషన్ ఇవ్వడం వంటి మార్గాలను అనుసరిస్తారు. కొన్ని సందర్భాలలో శస్త్రచికిత్స అవసరమవుతుంది. సర్జరీలో కొన్ని సందర్భాలలో ప్రతికూలతలు ఎదురుకావచ్చు. సాధారణ రోగుల కంటే ఎంబిడి రోగులు తక్కువ ఆరోగ్యంతో ఉంటారు కాబట్టి ఇన్‌ఫెక్షన్, రక్తస్రావం, రక్తం గడ్డ కట్టడం, నరాలు దెబ్బతినడం వంటి రిస్క్ ఉంటుంది. అందుకే రోగిని పరిస్థితిని బట్టి చికిత్స చేసే వైద్యుల బృందం సంయుక్తంగా జాగ్రత్తగా నిర్ణయం తీసుకోవాల్సి ఉంటుంది.




**సకలసృష్టి జరిగిన తీరును జనమేజయునికి వివరించాడు వైశంపాయనుడు. కాసేపు సేదదీరాడు. తర్వాత చెప్పాడిలా. మహారాజా! సమస్త ప్రాణికోటినీ దక్షప్రజాపతి సృష్టించిన అనంతరం, వారందరికీ అధీశ్వరులను ఏర్పరిచాడతను. ఆ అధీశ్వరుల పట్టాభిషేకాన్ని శాస్త్రోక్తంగా నిర్వహించాడు. రాజులకు పృథుచక్రవర్తి అధినాథుడయ్యాడు. బ్రాహ్మణులకు, తారకులకు, తరువులకు, ఓషధులకు, యజ్ఞ యాగాలకు, తపస్సులకు చంద్రుడు అధిపతి అయ్యాడు. సంపదలకు, సాగరాలకు, రాజులకు కుబేరుడు అధిపతి అయ్యాడు. పిశాచాలకు శివుడు అధిపతి అయితే, అమరులకు ఇంద్రుడు అధిపతి అయ్యాడు. రాక్షసులకు ప్రహ్లాదుడు, పితృదేవతలకు అంతకుడు అధిపతులయ్యారు. నాగులకు వాసుకి, మిగిలిన సర్పజాతికి తక్షకుడు, పక్షులకు గరుడుడు, గంధర్వులకు చిత్రరథుడు, ఏనుగులకు ఐరావతం, గుర్రాలకు ఉచ్ఛైశ్రవం, మానవులకు నృపతి, పర్వతాలకు హిమగిరి, వాహినులకు సముద్రుడు ప్రభువులయ్యారు.**

మహారాజా! ప్రజలను భయపెట్టి సత్కర్మలను నిరోధించడం మీవంటివారికి తగదు. దయచేసి మా మాట వినండి.

చెప్పండి అన్నాడు వేనుడు.

మేము ఒక యాగాన్ని చేయదలచాం. ఆ యాగం కొన్ని ఏళ్లపాటు కొనసాగుతుంది. దానికి నీ తోడ్పాటు అవసరం. కరుణించి మా కోరిక తీర్చు, కాదనకు.

తపస్వుల మాటలకు పగలబడి నవ్వాడు వేనుడు. అన్నాడిలా.

నా కంటే ధర్మవేత్తలు ఉన్నారా? ఉంటే చెప్పండి. ఉన్నారని మీరు చెబితే నేనేం చేస్తానో తెలుసా? ఈ భూతలాన్ని సముద్రంలో ముంచి అణగదొక్కుతాను. ఆకాశాన్ని ముక్కలు చేస్తాను. బ్రహ్మాండాన్ని బూడిద చేస్తాను. అయినా మీతో నాకు మాటలేమిటి? వెళ్లండిక్కణ్నుంచి.

వెళ్లలేదు తపస్వులు. మళ్లీ చెప్పజూశారు. వినలేదు వేనుడు. వినలేదు సరికదా, ఆ తపస్వులను అనేక విధాల తూలనాడాడు. అవమానించాడు.

# వేనుని శరీరమథనం:పృథు భూదేవతల సంవాదం

అధిపతులను నిర్ణయించిన అనంతరం దక్ష ప్రజాపతి పృథివి సమస్తాన్నీ నాలుగు ఖండాలుగా విభజించాడు. విభజించి తూర్పుదిశకు విరాట పుత్రుడు వైరాజును రాజుని చేశాడు. అలాగే దక్షిణ దిక్కుకు కర్దముని కొడుకు శంఖపదుణ్ణి రాజుని చేశాడు. పశ్చిమదిశకు రజఃపుత్రుడు కేతుమంతుని, ఉత్తరదిశకు పర్జన్య కుమారుడు హిరణ్యరోముణ్ణి రాజుని చేసి, వారికి పట్టాభిషేకాలు చేశాడు. ఈ నలుగురూ పృథివీ మధ్య భాగానికి రాజయిన పృథువును తమ చక్రవర్తిగా అంగీకరించి, రాజ్యాలేలారు. కొంతకాలానికి చాక్షుషమన్వంతరం గడిచింది. అప్పుడు వైవస్వత మనువునకు ప్రపంచ సామ్రాజ్యాన్ని ప్రసాదించాడు బ్రహ్మ అని కాసేపాగాడు వైశంపాయనుడు. అతడు అలా ఆగడం గొప్ప అవకాశంగా భావించాడు జనమేజయుడు. అడిగాడిలా.

మునీంద్రా! నువ్వు ఇంతకు ముందు పృథు చక్రవర్తి గురించి చాలా సంగ్రహంగా చెప్పావు. దానిని నేను వివరంగా వినాలనుకుంటున్నాను. అసలు పృథుచక్రవర్తి జననం ఎలాంటిది? ఈ భూమిని అతను ధేనువుగా ఎలా మార్చాడు? ఆయన అనుమతితో ఎవరెవరు ఆ ధేనువు నుంచి ఏఏ వస్తువులు పిదుగుకున్నారు? ఆ వివరాలన్నీ నాకు కావాలి. వినాలని చాలా ఉత్సాహంగా ఉంది. దయచేసి వివరంగా వాటినన్నిటినీ వివరించు.

తప్పకుండా అన్నాడు వైశంపాయనుడు. వివరించాడిలా.

ఆదియుగంలో యమపుత్రిక సునీథకూ, అంగ రాజుకూ వేనుడు జన్మించాడు. వేనుడు రాజ య్యాక తాతగారైన యమునితో చేతులు కలిపి, మహాక్రూరుడయ్యాడు. ప్రజలను అనేక విధాల హింసించసాగాడు. ధర్మమార్గాన్ని విడిచి, వేద విరుద్ధంగా నడవసాగాడు. ఒకనాడు రాజ్యంలోని ప్రజలందరినీ సమావేశపరిచాడు. చెప్పాడిలా.

ఇకపై మీరెవరూ పుణ్యకార్యాలు చేయవద్దు. యజ్ఞయాగాల మాటే తలపెట్టవద్దు. నా ఆజ్ఞ మీరితే మరణదండనే! యజ్ఞకర్త, యాగం, అందుకు ఉద్దేశించిన దేవత అన్నీ నేనే! మీరు నా గురించి మాత్రమే యజ్ఞాలు చెయ్యాలి.

రాజాజ్ఞతో నాటి నుంచి జపతపాదులు లోపించాయి. గాయత్రీ, వేదాలూ ఎక్కడా వినరాలేదు. సోమపానాదులు నశించాయి. అగ్నిహోత్రునికి హోమాలు కరువయ్యాయి. అమరుల పూజాపునస్కారాలు రూపుమాశాయి. దానధర్మాలు, వ్రతాలు, ఉపవాసాలు పేరుకే మిగిలాయి.

ధర్మవిధ్వంసాన్ని తపస్వులు తట్టుకోలేకపోయారు. పరిపరి విధాల పరితపించారు. వెళ్లి వేనుణ్ణి వేడుకున్నారు.

**జనమేజయుని కోరిక మేరకు పృథుచక్రవర్తి చరిత్రను వివరంగా చెప్పనారంభించాడు వైశంపాయనుడు. ప్రజలను కంటికి రెప్పలా కాపాడేందుకు పృథుచక్రవర్తి మహా ఔదార్యం ప్రదర్శించాడు. ప్రజలను పోషించాలనే సంకల్పంతో భూదేవికి హెచ్చరిక చేశాడు. తన ప్రజలకు అవసరమైనవన్నీ అందించాలని అడిగాడు. అందుకు భూదేవి ఏమని వేడుకుంది? పృథుచక్రవర్తి ఏం చేశాడు?**

అందుకు ఆగ్రహోదగ్రులయ్యారు తపస్వులు. తమ తపశ్శక్తితో వేనుణ్ణి బంధించారు. నేలపై పడగొట్టారతన్ని. మంత్రించిన దర్భలతో అతని ఎడమతొడను మథించారు. కొంతసేపటికి ఆ తొడనుంచి చాలా పొట్టిగా, నల్లగా ఓ మనిషి ఆవిర్భవించాడు. చేతులు జోడించి నమస్కరించి నిలిచాడు. తపస్వులు అతన్ని 'నిషీద' (కూర్చో) అన్నారు. పరిశీలించారతన్ని. తర్వాత వెంటనే అక్కణ్నుంచి తొలగిపొమ్మని హెచ్చరించారు. వేనుని పాపరాశివల్ల జన్మించిన కారణంగా అతనిని నిషాదుడని వ్యవహరించారు. వింధ్యపర్వత ప్రాంత పాపాత్ములందరూ ఈ నిషాదుని సంతతివారే!

తర్వాత తపస్వులందరూ వేనుని కుడిచెయ్యి మథించారు. దానినుండి తేజశ్శాలి, సుదీర్ఘమూర్తి పృథువు జన్మించాడు. చేతిలో అజగవం అన్న విల్లు, భుజాన్న జాజ్వల్యమానాలైన బాణాలు, బంగారుకవచంతో పుట్టిన పృథువుని చూసి తపస్వులు ఆశ్చర్యానందాలు పొందారు. విశ్వంలోని ప్రాణికోటి అతన్ని చూసి పరవశించింది. దేవతలకు కూడా అతన్ని అర్చించాలనిపించింది. అంతలోనే నదీనదాలతో, జలపూర్ణకుంభాలతో సముద్రుడు అక్కడకు వచ్చాడు. చేతులు కట్టుకుని పృథువు ముందు నిల్చున్నాడు. ఇంద్రాదిదేవతలు సహా బ్రహ్మదేవుడు కూడా వచ్చాడక్కడికి. ప్రసిద్ధులంతా పరివేష్టించారతన్ని. పృథువును కని, పున్నామ నరకం నుండి విముక్తి పొందాడు వేనుడు. స్వర్లోకం చేరుకున్నాడు.

దేవతలంతా పృథువుని అభిషేకించారు. ఆశీర్వదించారు. తండ్రిలా తాను ప్రవర్తించకూడదను కున్నాడు పృథువు. ప్రజలను హింసలపాలు

చెయ్యకూడదనుకున్నాడు. ప్రజలను కంటికి రెప్పలా కాపాడాలని కంకణం కట్టుకున్నాడు. అలాగే అందరినీ సంరక్షించాడు. అలా ప్రజలందరినీ రంజించిన కారణంగానే అతను రాజయ్యాడు. సార్థకనామధేయుడయ్యాడు.

రథాన్ని అధిరోహించి పృథుచక్రవర్తి విజయ ప్రస్థానం ప్రారంభించినంతనే సముద్రాలు మెట్ట భూములయినాయి. పర్వతాలు నేలలోనికి అణగి పోయాయి. ఆకాశం దిగివచ్చి కింద నేలగా పరచు కుంది. దావాగ్ని జ్వాలలు చల్లారాయి. స్వర్గ మర్త్య పాతాళాలలో పృథురథానికి అడ్డులేకుండా పోయింది. దున్నాల్సిన అవసరం లేకుండానే ఎల్లె డలా నేలంతా పండింది. ధేనువులు కామధేనువు లయ్యాయి. తీయతీయని పండ్లతో చెట్లు భారంగా నేలకొరిగాయి.

దివిలో బ్రహ్మదేవుడు చేసిన యజ్ఞానికి సూతుడు, మాగధుడు అని ఇద్దరు జన్మించారు. వారు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం దేవతల ముందు స్తోత్రపాఠాలు ఆరంభించారు. ఆ పాఠాలకు ఋషీ శ్వరులూ, దేవతలూ ఎంతగానో ఆనందించారు. ఆజ్ఞాపించారిలా.

ఇకపై మీరు పృథుచక్రవర్తి సత్కార్యాలను అభివర్ణించి శ్రోతలకు ఆనందాన్ని కలిగించండి.

సరేనని సూత మాగధులు పృథుచక్రవర్తిని సందర్శించి అతన్ని వేనోళ్ళ పొగిడారు. ఆనందిం చాడు పృథువు. ఆ ఆనందంలో సూతునికి సూత దేశాన్నీ, మాగధునికి మగధదేశాన్నీ బహూకరిం చాడు.

ఆ మహా ఔదార్యాన్ని గమనించిన ప్రజలంతా పృథుచక్రవర్తిని సమీపించారు. తగిన వృత్తులు తమకూ కల్పించాల్సిందిగా వేనోళ్ళ స్తుతించార తన్ని. ఆ స్తుతులకు ఆనందించాడు పృథువు. ఆలో చించాడు. భయంకరమైన బాణాన్ని తీసి, భూదేవతకు గురిపెట్టాడు. హెచ్చరించాడిలా.

పృథివీ! అన్ని కాలాల్లోనూ అవసరమైన వస్తువు లన్నీ నా ప్రజలకు నువ్వు అందించాలి. లేని పక్షంలో నిన్ను ఇప్పుడే ఇక్కడే ముక్కలుముక్కలు చేస్తాను.

పృథువు హెచ్చరికకు ఆందోళన చెందింది భూదేవి. భయపడి గోవు రూపం ధరించింది. గోవుగా మారిన మరుక్షణం వెనుకకు తిరిగి చూడ కుండా పరుగందుకుంది. యోగశక్తితో దానిని అనుసరించాడు పృథువు. ఎటునుంచి ఎటుపోయినా పృథువే! ఎక్కడ చూసినా పృథువే! పృథుమహా రాజుని తప్పించుకుని బతకడం అసాధ్యం అను కున్నది భూదేవి. పరుగు ఆపింది. తలవంచు కుని నిలిచింది. పృథువును వేడుకున్నదిలా.

మహారాజా! ప్రజలను పోషించాలన్న నీ సంకల్పం గొప్పదే! కాదనను. అందుకు నన్ను బలి చెయ్యడం తగదు. కనిపించే ఈ ప్రపంచం మొత్తాన్ని భరిస్తున్న నన్ను సంహరించడం అంటే నువ్వు కావాలనే పెనుముప్పును ఆశిస్తున్నట్టు. ఆలోచించు. అన్నాన్ని నేనే కదా సృష్టించేది. అది లేకపోతే మానవులు క్షణకాలం కూడా బతక లేరు. ఈ సంగతి నీకు తెలియనిది కాదు.

అవునన్నట్టుగా ఆలోచనలోపడ్డాడు పృథువు.

బాగా ఆలోచించి చక్కని ఉపా యాన్ని కనుక్కో! నీ ఉపాయంతో అందరి మనోరథాలూ నెరవేరాలి. స్త్రీవధను మించిన పాపం లేదు. నన్ను చంపి పాపాన్ని మూటగట్టుకోకు అన్నది భూదేవి.

ఆలోచన నుండి తేరుకున్నాడు పృథువు. అన్నాడిలా.

చంపడం పాపమే! ఒప్పుకుంటాను. అయితే అందరికోసం ఏ ఒక్కరినో చంపడం ఎంతమాత్రం పాపం కాదు. అందుకే నిన్ను సంహరించాలను కుంటున్నాను. నా సంగతి పక్కన పెట్టు. నీ సంగతి చెప్పు. నువ్వు సర్వసమర్థురాలివి. అనుకుంటే నువ్వు చేయలేనిది లేదు. కాకపోతే కావాలనే నన్ను వేధిస్తున్నావు. అవునా?

లేదులేదన్నట్టుగా చూసింది భూదేవి.

అయితే ఓ పని చెయ్యి! నువ్వు నా కూతురిగా జన్మించు. అలా జన్మించిన పక్షంలో నిన్నేమి చెయ్యను. లేదంటే తప్పదు, ఈ బాణానికి నువ్వు బలికావాల్సిందే అన్నాడు పృథువు.

ఆలోచనలో పడింది భూదేవి. దీర్ఘంగా ఆలో చించింది. కాసేపటికి తేరుకుంది. అన్నదిలా.

మహారాజా! ఓ పని చెయ్యి. నాకు తగిన లేగ దూడలు ఏర్పాటు చెయ్యి. చేసి, ప్రాణులన్నీ వారి వారికి అవసరమైన వస్తువులను పిదుగు కొనేట్టు ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞతో తగిన వస్తువు లను నేను అందరికీ అందజేస్తాను. అన్ని రకాలుగా ఇది సరైనది. సబబైనది. అలాగే ఎత్తుపల్లాలతో ఇబ్బంది పడుతున్న నన్ను సమానంగా రూపొం దించాల్సిన బాధ్యత కూడా నువ్వే స్వీకరించు.

సరేనని అందుకు అంగీకరించాడు పృథువు. చెదురుగా పడి ఉన్న శిలల్ని పోగు చేసి, పర్వ తాలుగా రూపొందించాడు. మిగిలిన ప్రదేశాల్లో భూమిని చదునుచేసి, అక్కడ వీలునుబట్టి గ్రామా లనూ, నగరాలనూ నిర్మించాడు. తర్వాత స్వయం భువు మనువును దూడగా చేశాడు. తన అర చేతిని పాత్రగా చేశాడు. చేసి, భూదేవిని పిదికాడు. సర్వసస్యాలూ సర్వకాలాల్లోనూ పండేట్టుగా ఏర్పాటు చేశాడు. ప్రాణికోటి ఆకలి తీర్చాడు. వారి అభి వృద్ధికి బాటలు వేశాడు. ఆ తర్వాత ఆయా లోకాల్లోని వారందరినీ ఆహ్వానించి, రకరకాల లేగలను ఏర్పాటు చేశాడు. ఆ లేగలతో వారికి ఇష్టమైనవి పిదుగుకొమ్మని ఆజ్ఞాపించాడు.

అప్పుడు మునులంతా జాబిల్లిని లేగగా చేసి, బృహస్పతి చేత వేదమయమైన పాత్రలో బ్రహ్మం



అనే పాలు పిదుగుకున్నారు. ఇంద్రుణ్ణి దూడను చేసి, సూర్యునితో బంగారుపాత్రలో గొప్ప తేజోరాశిని పిండుకున్నారు దేవతలు. వైవ స్వతుణ్ణి దూడను చేసి, యమునితో వెండిగిన్నెలో అన్నాన్ని పిండుకున్నారు పితృదేవతలు. విరోచ నుణ్ణి దూడను చేసి, ద్విమూర్ధునితో ఇనుప పాత్రలో మాయాక్షీరాన్ని పిదుగుకున్నారు రాక్షసులు. చిత్రరథుణ్ణి లేగను చేసి, పద్మపాత్రలో సురుచితో గానమన్న క్షీరాన్ని పిదుగుకున్నారు గంధర్వులూ, అప్సరసలూ.

కుబేరుణ్ణి లేగను చేసి, పచ్చికుండలో అంత ర్ధానశక్తి అన్న క్షీరాన్ని పిదుగుకున్నారు యక్షులు. సుమాలిని లేగను చేసి, రజతనాభునితో మానవ కపాలాల్లో రక్తాన్ని పిదుగుకున్నారు పిశాచులూ, దానవులూ. తక్షకుని లేగను చేసి, పడగను పాత్రను చేసి, వాసుకితో గరళాన్ని పిండుకున్నాయి నాగులు. హిమవంతుని లేగను చేసి, మేరు గిరితో రత్నాలనూ, ఓషధులనూ కొల్లలుగా పిండుకున్నాయి పర్వతాలు. రావిచెట్టును లేగను చేసి, సాలంతో తమను పదేపదే ఖండించినా తిరిగి అభివృద్ధి చెందే శక్తిని లతలూ, చెట్లూ పిదుగుకున్నాయి. అలా చరాచర భూతాలన్నీ వారి వారి అభీష్టానుసారం శక్తులు సాధించి, పరమా నందభరితమయ్యాయి అని ఆగాడు వైశంపాయ నుడు. కళ్లు మూసుకుని శ్రద్ధగా వింటున్న జనమే జయుణ్ణి చూశాడు. చెప్పింది ఉత్సాహంగా, ఉత్కంఠగా వింటున్న అతని తీరును గమనించి ఆనందించాడు.

**-అరణి**




**నూనూగు మీసాల కవ్వించే యువకుల చూపులు.. సౌందర్యంపై శ్రద్ధ, అందరిలోనూ ప్రత్యేకంగా ఉండాలనే తపన... అదే సమయంలో శారీరక మార్పుల ప్రక్రియ, ఏదో మనో సంఘర్షణ..**

**బాల్యందాటి టీనేజ్‌లోకి అడుగిడుతున్న పిల్లల్లో తెలియని భయాలు, వింత భావనలు, ఎన్నోరకాల సందేహాలు, సంకోచాలు కలుగుతుంటాయి. ఒకవైపు పెద్దవాళ్లం అనే భావన, మరోవైపు అవగాహన లేమి! మరి ఇవన్నీ వారికి అవగతమయ్యేట్టు చెప్పేదెవరు? వారికి తల్లిదండ్రుల అవసరం ఎంతవరకూ ఉంది?**

# కోమలం.... కౌమార్యం



బాల్యావస్థ నుంచి యవ్వనంలోకి మారే క్రమంలో పిల్లల శరీరంలో కలిగే మార్పులు వారి మానసిక ఆరోగ్యం మీదా, ఎదుగుదల మీదా ప్రభావం చూపిస్తాయి.

"ఎదిగే వయసు మొదలయ్యే నిడివి చాలా ఎక్కువ" అని 'లెట్టింగ్ గో విత్ లవ్ అండ్ కాన్ఫిడెన్స్' అనే పుస్తకంలో రచయిత చెప్పాడు.

కొందరు పిల్లలు ఆలస్యంగా యవ్వనంలోకి ప్రవేశిస్తే మరికొందరు త్వరగా యవ్వనంలోకి ప్రవేశిస్తారు. యవ్వనంలోకి అడుగిడిన సందర్భంలో రకరకాల దేశాల్లో రకరకాల సంబరాలు నిర్వహిస్తారు. రోమన్ల కాలంలో యవ్వనదశకు చేరుకోగానే బోగా అనే అంగవస్త్రం ధరింపచేసి యవ్వనంలోకి అడుగుపెట్టారని సంబరం చేసుకునేవారు. అమ్మాయిలకు కూడా సంతానవతిగా తయారు కావడానికి అనుగుణంగా సంబరాలు నిర్వహించేవారు. మనదేశంలో కూడా అమ్మాయిలకు శరీరంలో వచ్చే మార్పులను ఒక వేడుకగా చేయడం ఆనవాయితీ!

### తేడా కనిపిస్తుంది

పదమూడు దాటగానే పసితనపు అంచులు దాటి యవ్వనం తొలినాళ్లలోకి అడుగుపెడుతుంది బాల్యం. అబ్బాయిలలో కంటే అమ్మాయిల్లో ఇదికొద్దిగా ముందే మొదలవుతుంది. ఎదుగుదలకు సంబంధించి ఆడపిల్లలకు, మగపిల్లలకు మధ్య తేడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. పది సంవత్సరాల వయసుదాకా మగపిల్లలు ఆడపిల్లలకన్నా పొడుగ్గా కనిపిస్తారు, కానీ పదకొండు నుంచి పద్నాలుగు సంవత్సరాల సమయంలో మాత్రం ఆడపిల్లలు, ఆ వయసు మగపిల్లలతో పోలిస్తే ఎక్కువ ఎత్తు ఎదుగుతారు. ఇందుకు కారణం ఈ వయసులో ఆడపిల్లల హార్మోన్లలో తేడాలు మగవారికంటే ఎక్కువ. వారిలో అభివృద్ధి వేగవంతంగా ఉంటుంది. ఆ తర్వాత అంటే పద్నాలుగేళ్లు దాటిన తర్వాత అబ్బాయిల ఎదుగుదల ప్రారంభమవుతుంది. ఈ సమయంలో వారు అమ్మాయిలను మించి పొడవు పెరుగుతారు. పైన చెప్పిన శారీరక అభివృద్ధి కారణంగానే ఆడపిల్లల పట్ల మగపిల్లలు, మగపిల్లల పట్ల ఆడపిల్లలు ప్రత్యేక ఆసక్తి కనబరుస్తుంటారు.

### ముఖ్యంగా ఆడపిల్లలోనే

అమ్మాయిలు బాల్యంనుంచి యవ్వనంలోకి అడుగుపెట్టే క్రమంలో శారీరక మార్పులు చోటు చేసుకోవడం సహజం. ఈ వయసులో వచ్చే మార్పులు స్పష్టంగా కనిపించడంవల్ల మగపిల్లలకన్నా ఆడపిల్లలే ఎక్కువ ఆలోచనలో పడతారు. ఆడపిల్లల్లో స్వయం స్పృహ అప్పటి నుంచే ప్రారంభమవుతుంది. కొన్ని మార్పులు ఒక్కసారిగా కనిపిస్తే మరికొన్ని మార్పులు నెమ్మదిగా కనిపిస్తాయి. ఈ వయసులో వాళ్ల శరీరం ఒంపులు తిరగడం మొదలు పెడుతుంది. ఎముకలు, కండరాల ఎదుగుదలతో పాటు సంతానోత్పత్తికి అనువుగా మరికొన్ని మార్పులు చోటుచేసుకుంటాయి. దాంతో వారు తమ శరీర భాగాలను కప్పిపుచ్చుకోవడానికి తలకిందికి వంచుకుని నడవడం మొదలు పెడుతుంటారు. బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగుపెట్టే సమయంలో శారీరకంగా ఎలాంటి మార్పులు జరుగుతాయనేది తెలుసుకోవాలి. మెదడులో ఈ ప్రక్రియ మొదలై గొనాడోట్రోపిన్ అనే హార్మోన్ విడుదల అవుతుంది. అది పిట్యుటరీ గ్రంథికి చేరి ఎల్ హెచ్, ఎఫ్ఎహెచ్ అనే హార్మోన్లను విడుదల చేస్తాయి. ఈ రెండూ అమ్మాయిల్లో శారీరక మార్పులు జరిగేందుకు తోడ్పడే ఈస్ట్రోజన్ హార్మోన్లను అండాశయాల్లో



# అందంపైనే శ్రద్ధ



**బా**లికలపై పడుతున్న ఒత్తిళ్ల కారణంగా వారి మానసిక ఆరోగ్యం బాగా దెబ్బతింటోందని ఓ అధ్యయనం తెలిపింది. గర్ల్ గైడింగ్ యుకె, మెంటల్ హెల్త్ ఫౌండేషన్ సంయుక్తంగా నిర్వహించిన ఒక అధ్యయనం ప్రకారం మేగజైన్లు, వెబ్‌సైట్‌ల వంటి వాటిలో బాలికలు చూస్తున్న దృశ్యాలు, చదువుతున్న అంశాలు వారిపై తీవ్ర ఒత్తిడి కలుగచేస్తున్నాయి. ముఖ్యంగా లండన్ బాలికల్లో పెరుగుతున్న మానసిక ఒత్తిళ్లకు ఈ నివేదిక అద్దం పట్టింది. అయితే ఇది ఇంచుమించు ప్రపంచంలోని అందరమ్మాయిలకు ఒకేలా ఉంటుందని ఈ అధ్యయనంలో వెల్లడించారు.

మీడియాలో కనిపించేవారిని చూసి బాలికలు తమను తాము కించపర్చుకోవడం, వారితో పోల్చుకోవడం పెరుగుతోందట. వారిలా మారాలనుకునే వారి సంఖ్య పెరిగింది. ఇది ఏస్థాయికి వెళుతోందంటే బాలికలు తాము యువతులుగా తమ వయసుకు మించి తమను తాము ప్రదర్శించుకునేలా దుస్తులను వేసుకోవాలని ప్రయత్నిస్తున్నారు, టీనేజ్ యువతులైతే ఇంకా ఎక్కువగా దీని గురించే ఆలోచిస్తున్నారట. కాబట్టి ఎవ్వరితోనూ పోల్చుకోకుండా ఉండాలని ఈ అధ్యయనం హెచ్చరిస్తోంది. అందుకు తల్లిదండ్రులు టీనేజర్లకు సహకరించాలని అధ్యయనం సూచిస్తోంది.

విడుదలయ్యేలా చేస్తాయి. అప్పటి నుంచి శారీరక మార్పులు చోటు చేసుకుంటాయి.

### అవగాహన అవసరం

వయసుకు తగినట్లు శారీరక మార్పులు జరిగితేనే ఆనందం. కానీ ఆ ఆనందాన్ని వారు అంత త్వరగా జీర్ణించుకోలేరు. తమకు ఏదో జరుగుతోందనే భావనతో ఉంటారు. అందుకే ఎదిగే పిల్లలు ఎంతో కొంత ఆక్వర్డ్‌గా కనిపిస్తారు. శరీరాన్ని వారు అంచనా వేసుకోలేరు. చేసే ప్రతిపనిలోనూ ఆదుర్దా కనిపిస్తుంటుంది. ప్రతిపని ఇంతకు ముందు చేసిందే అయినా ఇప్పుడు చేస్తే అది తప్పుగా అనిపిస్తుంది. దీనికి తగ్గట్టుగానే పూర్వం కంటే ఈ రోజుల్లో పిల్లల్లో కొంచెం ముందుగానే యవ్వనత్వం వస్తోంది. అందరికీ ఫలానా వయసులోనే యవ్వనత్వం వస్తుందని ఇప్పుడు చెప్పలేకపోతున్నాం. దీని మూలంగా అటు పెద్దవాళ్లకూ, ఇటు పిల్లలకూ కొన్ని ఇబ్బందికర పరిస్థితులు ఎదురవుతున్నాయి. శరీరంలో ఒక్కసారిగా జరిగే మార్పుల వల్ల పిల్లలు కంగారు పడతారు. ఈ విషయం అర్థం చేసుకోలేక చాలామంది తల్లిదండ్రులు, 'పని సరిగ్గా చేయలేవా?' అని పిల్లలకు చివాట్లు పెడుతుంటారు. తన శరీరంలో జరిగే మార్పులు తనకు అర్థం కాక, ఎవరికి చెప్పుకోవాలో తెలియక సతమతమవుతుంటారు. ఇలా తల్లిదండ్రులు ఈ సమయంలో చివాట్లు పెట్టే దానికన్నా వారిలో జరిగే మార్పులకు కారణం వివరించి విడమర్చి చెప్పడం మంచిది. వీటిగురించి మాట్లాడుతున్నప్పుడు మీ పిల్లల్లో ధైర్యం పెంచండి. పెద్దవాళ్లుగా ఎదిగేముందు ఈ యుక్తవయసు ముఖ్యమైన దశ అని చెప్పండి. చాలామంది పిల్లలు శరీరంలో వచ్చే మార్పులు గురించి తల్లిదండ్రులతో మాట్లాడటానికి ఇష్టం లేదన్నట్టు వ్యవహరిస్తారు. కానీ అది నిజం కాదు ఈ విషయాలు చెప్తున్నప్పుడు వాళ్లు అస్సలు ఇష్టంలేనట్లు, బోర్‌కొట్టినట్లు, విసుక్కుంటున్నట్లు ఉంటారు కానీ వాళ్లు మీరు చెప్పే ప్రతీమాటా వింటారు.

It takes courage to grow up, and become who really are.

-E.E cummins

మొన్నటి దాకా ఆడుతూపాడుతూ పెరిగిన పిల్లలు సడెన్‌గా అందం మీద, ఆహార్యం మీద శ్రద్ధ చూపుతున్నారంటే వారు టీనేజ్‌లోకి అడుగిడుతున్నారనే అర్థం. ఆడపిల్లలు, మగపిల్లల్లో ఈ శ్రద్ధ సమానంగానే ఉంటుందిగానీ ఆడపిల్లల్లోనే ఎక్కువ తెలుస్తుంది. 'అదృష్టం అడ్డం తిరిగితే పండు తిన్నా పన్ను విరుగుతుంది' అని ఓ పర్షియన్ సామెత. టీనేజ్ ఓ అదృష్టం. దాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి.

ఈ ఏజ్ మంచి చెడుల విచక్షణ నేర్పే సమయం. అద్భుతాలు సృష్టించగల వయసు కూడా ఇదే! ఈ వయసులో పొరబాట్లు తడబాట్లు సహజం. ప్యూబర్టీ దశలో పిల్లల్లో లైంగిక అభివృద్ధి జరుగుతుందని అనుకుంటారు కానీ అది సరికాదు. నిజం చెప్పాలంటే సెక్స్ గ్రంథులు చురుకుదనాన్ని సంతరించుకోగానే శారీరక ఎదుగుదల కుంటుపడుతుంది. మరి టీనేజర్లలో శృంగారపరమైన భావనలు ఎలా ఉంటాయి? ఎందుకు కలుగుతాయి? దానికి గల కారణాలేంటి? అనేది ముందు ముందు తెలుసుకుందాం!

- లతాకమలం

email:lathakamalam.me@gmail.com

## అతి అనర్థదాయకం

**న**వ్వులు చిందిస్తూ, తుళ్లుతూ, అందరినీ ఆటపట్టిస్తూ ఎంతో చలాకీగా కనిపిస్తుంటారు టీనేజర్లు. అయితే ఇటీవల కాలంలో టీనేజర్లు ఏదో టెన్షన్ ఫీలవుతూ, ఆందోళనగా కనిపిస్తున్నారని పలు సర్వేలు చెబుతున్నాయి. ఈ ఏజ్‌లో తీవ్ర ఒత్తిడి, మానసిక ఆందోళనకు గురవుతున్నారంటే అందుకు ముఖ్యకారణం వాళ్లు ప్రతి చిన్న విషయానికి అతిగా ఆలోచించడమే అని మానసిక వైద్య నిపుణులు చెప్తున్నారు. భావోద్వేగాలను అదుపులో ఉంచుకోలేనప్పుడు ఇలాంటి పరిస్థితి ఏర్పడుతుందని అంటున్నారు. అందుకని వాటిని అదుపులో ఉంచుకునే ప్రయత్నం చేయాలంటున్నారు.



# లక్ష్యం

-శృంగవరపు రచన

**"ఒరేయ్! కార్తీక్... మీ ఫ్రెండ్ దిలీప్‌కి టి.సి.ఎస్.లో జాబ్ వచ్చిందటగా!" బజార్లో వాళ్లనాన్న కనిపించి చెప్పాడు. నాకీ జన్మకి అలాంటిభాగ్యం కలిగించవేమో! క్యాంపస్‌జాబ్ రానంత మాత్రాన ఇలా ఖాళీగా కూర్చుని కవితలు, కథలు రాసుకుంటూ, వాటిని పత్రికలకు పంపటం, అవి తిరిగిరావటం, మోటివేషనల్ స్పీకర్నవుతానంటూ ఊహల్లో విహరించడం.... ఆ! ఇలా ఎంతకాలం ఇంట్లో ఖాళీగా కూచుంటావురా! నిన్ను కన్ననేరానికి నిన్ను ఏమీ అన్లేక, కనిపించిన వాళ్లందరికీ తమరి ప్రతిభ గురించి చెప్పలేక చస్తున్నాను. ఎప్పుడు బాగుపడతావో ఏంటో! అంతా నా కర్మ. బ్యాంకులోను తీసుకుని ఇంజనీరింగ్ చదివించాను. కనీసం నెలనెలా ఇన్‌స్టాల్మెంట్ కట్టడానికైనా కష్టపడు" అంటూ కొడుకుని విసుక్కుని లోపలికెళ్లాడు భాస్కరరావు.**

మంచిమూడ్‌లో కథ రాస్తున్న కార్తీక్, తండ్రి తిట్లకి నిస్సహాయంగా చెవులు, కళ్లు అప్పగించాడు. తండ్రి లోపలికెళ్ళాక కథవైపు చూస్తుంటే, తను రాసిన కథలోపాత్రలు తననే వెక్కిరిస్తున్నట్టనిపించింది. మూడ్ అవుటై, అలవాటు ప్రకారం ఇంట్లోంచి బైటకొచ్చాడు. అప్పటివరకూ కథ చుట్టూ తిరిగిన ఆలోచనలు వెనక్కి తగ్గాయి. ఇంట్లో వాళ్లు అసలు తననెందుకు అర్థం చేసుకోవడం లేదో అని ఆలోచించసాగాడు. అలా నడుస్తూ ఊరిచివరికి వచ్చాడు. తనకిష్టమైన స్ట్రాంగ్ కాఫీ తాగాడు.

అసలు అందరికీ చదివిన వెంటనే ఉద్యోగాలు రావాలా? ఉద్యోగమే చదువుకి పరమార్థమా? తన క్లాస్‌మేట్స్‌లో తనలా వాగ్ధాటి గల వాళ్లెంతమందున్నారు? తనలా కవితలు, కథలు రాయగల వాళ్లెంతమంది ఉన్నారు? ఇంజనీరింగ్ చదివితే సాఫ్ట్‌వేర్ ఉద్యోగమే చెయ్యాలా? చదువుకున్న రంగంలోనే కాకుండా, అభిరుచి ఉన్న రంగంలో రాణించి సక్సెస్ అయిన వాళ్లెంతమంది ఉన్నారు? తన అభిరుచిని ఇంటా బైటా పాదులోనే తుంచేస్తుంటే అంకురించిన ఆలోచనలు ఎదిగేదెప్పుడు? ఆలోచిస్తూ వెనుతిరిగాడు.

•••

కార్తీక్ ప్రపంచమే భావుకత. తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని, పరిస్థితుల్ని చూసి స్పందిస్తాడు. అలవోకగా అక్షరరూపం కల్పిస్తాడు. తనకు తెలిసినరీతిలో ఆ సమస్యకు తనెలా స్పందిస్తాడో, పరిష్కారం చూపగలడో సూచిస్తాడు. ఏ సమస్య గురించి అయినా అనర్గళంగా మాట్లాడగలడు. ఏదో చెయ్యాలి, ఏదో సాధించాలన్న తపన, నిర్మాణాత్మకమైన వ్యక్తిత్వం, అదే తనని ఉన్నత స్థితికి తీసుకువెళుతుందని, అంతర్లీనంగా తనలో శక్తి ఉందని తనపైతనకు నమ్మకం ఉన్న యువకుడు. అయితే ఆ శక్తి బాహ్యప్రపంచంలోకి వచ్చి ఒక్కసారి గుర్తింపు రావాలి! ఎవరెన్ని విధాలుగా నిరుత్సాహపరిచినా తనపై తనకి నమ్మకం ఉండబట్టి, ఎవరేమన్నా తనపని తాను చేసుకుపోయే మనస్తత్వం అతనిది.

•••

రెండేళ్ళ తర్వాత....

ఇండియా, ఆస్ట్రేలియా 20/20 మ్యాచ్ సెమీస్ చూద్దామని టి.వి. ఆన్‌చేశాడు. ఛానల్ మార్చే లోపు విన్పిస్తున్న న్యూస్ అతన్ని ఛానల్ మార్చనియ్యలేదు.

"ప్రపంచంలో అన్నిటికంటే మనిషికి ఎక్కువ ఆనందాన్నిచ్చేది డబ్బు మాత్రమే కాదు. జీవితంలో ఆనందాన్ని నింపేది ప్రశాంతత. దేనికి ఎంత ప్రాముఖ్యం ఇవ్వాలో తెలియక ఉరుకుల, పరుగుల జీవితంలోపడి విపరీతమైన ఒత్తిడికిలోనై ఆత్మహత్యలకు పాల్పడుతోంది యువత. ఆ జాబితాలో రెండేళ్ల క్రితం సాఫ్ట్‌వేర్ ఉద్యోగంలో చేరిన దిలీప్ అనే యువకుడు ఒత్తిడి తట్టుకోలేక జీవితాన్ని అర్ధాంతరంగా ముగించాడు. టీవీలో వార్తలు సాగిపోతున్నాయి.

కార్తీక్ ఉలికిపడ్డాడు. టీవీలో దిలీప్ క్లిప్పింగ్స్ చూపిస్తున్నారు. సోఫాలో వెనక్కి వాలిపోయాడు. కళ్లముందు కాలేజీలో తన పక్కనే కూచునే దిలీప్ కనిపించాడు. కార్తీక్ మనసు గతంలోకి పరుగెత్తింది. కన్నీళ్లు అతని చెంపల్ని నిమురుతున్నాయి.

•••

దిలీప్ బొమ్మలు బాగా వేసేవాడు. కాన్వాస్ మీద పోట్రైట్స్, ల్యాండ్‌స్కేప్స్ అద్భుతంగా ఆవిష్కరించేవాడు. ఓసారి క్లాస్‌లో కూచునే క్లాస్ రూమ్‌నీ, స్టూడెంట్స్‌ని అందంగా పెయింట్ చేశాడు. ఆ పెయింటింగ్‌ను కాలేజీ ఆడిటోరియంలో ఉంచి అందరికీ తెలిసేలా, చూసేలా ఏర్పాటుచేయించారు ఎలక్ట్రానిక్స్ డిపార్ట్‌మెంట్ హెడ్. అతనిలోని క్రియేటివిటీ గురించి ఆరోజు అందరూ మాట్లాడుతుంటే, "దిలీప్ నీకు పెయింటింగ్ అంటే ఇష్టం గదరా! ఆ టాలెంట్‌తో క్రియేటివ్ డిజైనర్ ఫీల్డ్‌లోకి వెళ్లావంటే టాప్‌రేంజ్‌కి ఎదిగిపోవచ్చు. ఈ సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలదేముందిరా! రొటీన్, అందరూ చేసేవే! యు ఆర్ సంథింగ్ డిఫరెంట్" అన్నాడు కార్తీక్.

"ఆపరా బాబూ! నువ్వూ నీ ఉపన్యాసాలూ, జీవితంలో కళ అయినా డబ్బు ఉంటేనేరా. మనకు ఏది నచ్చిందని కాదు.. ఏది చేస్తే మనం స్థిరపడగలమో అందులోకి చొచ్చుకుపోవాలి. నువ్వు చెప్పినట్టు 'క్రియేటివిటీ'తో పెయింటింగ్ రంగంలో ఎదగాలంటే కనీసం పదేళ్లైనా పడుతుంది. అంత ఓపిక మనకులేదు బ్రదర్. ముందు సాఫ్ట్‌వేర్ ఉద్యోగంలోచేరి, యుఎస్ వెళ్లి సెటిలవ్వాలి. ఆ తర్వాతే క్రియేటివిటీ గురించి ఆలోచిస్తా! కథలు, కాకరకాయలు, స్పీకర్ అనే సుత్తికథలు ఆపి నువ్వు కూడా సాఫ్ట్‌వేర్ జాబ్ గురించి ఆలోచించు" అని హితబోధ చేశాడు దిలీప్.

•••

ఆలోచనల్లో మునిగిపోయిన కార్తీక్, సెక్రటరీ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు. "సార్! ఈరోజు ఎస్వీఎస్ ఇంజనీరింగ్ కాలేజీలో మోటివేషన్ క్లాస్. కానీ మీరు క్యాన్సిల్ చెయ్యమన్నారు. వాళ్లు మళ్లీ ఇప్పుడు ఫోన్ చేసి రిక్వెస్ట్ చేస్తున్నారు. ఏం చెప్పమంటారు?" అడిగాడు సెక్రటరీ.

'క్యాన్సిల్ చెయ్యకు. మోటివేషన్ క్లాసు ఉంటుందని, వస్తానని చెప్పు' అన్నాడు కార్తీక్.

•••

ఇంజనీరింగ్ కాలేజీ ఆడిటోరియం విద్యార్థులతో నిండిపోయింది. "డియర్ ఫ్రెండ్స్, గుడ్మార్నింగ్ ఆల్ ఆఫ్ యూ" విద్యార్థులను ఉద్దేశించి అన్నాడు కార్తీక్.

హాలంతా కరతాళధ్వనులతో మార్మోగిపోయింది.

"ఇప్పుడు నేను మాట్లాడే ప్రతి మాట, నా అనుభవాల్లోంచి వచ్చినదే. ఎదుటివారు మాట్లాడే దాన్నుంచి మంచిని తీసుకోండి, చెడు వదిలెయ్యండి అని ప్రతి వాళ్లూ చెబుతారు. కానీ దానిని 'మంచి' అనే దానికంటే అందులో మీకు ఉపయోగ పడేవాటిని తీసుకోవడం మంచిది అంటాను" అన్నాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ! సార్! ఈ రెంటికీ తేడా ఏముంటుంది?" అన్నాడో విద్యార్థి వెనుకనుండి.

"గుడ్! మీరిప్పుడు ఇంజనీరింగ్ చదువుతున్నారు. దానికి సంబంధించిన సాంకేతిక ప్రగతి, సంబంధిత సూక్ష్మవిషయాలు కూడా 'మంచి' క్యాటగిరీలోకి వస్తాయి. కానీ మీ కల ఓ బిజినెస్‌మాన్ అవ్వడమయితే మీకు బిజినెస్‌స్కిల్స్ "ఉపయోగపడే" క్యాటగిరీలోకి వస్తాయి. ఉపయోగపడేవి అంటే దిక్సూచిలా మనల్ని మన కలవైపు నడిపించేవి" చెప్పాడు కార్తీక్.

"అలా అయితే సార్ మేమందరం ఇంజనీరింగ్ పూర్తయ్యాక సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు మానేసి ఎప్పుడో కలగన్నామని ఎండమావుల వెంట పరుగులుతీసి చేతిలో ఉన్న ఉద్యోగాలు వదులుకోమంటారా?" రెండో వరసలో కూచున్న స్వప్నిక ప్రశ్నించింది.

"అలా అనడంలేదు. నేను ముందే చెప్పాను. ఇక్కడ మీకు చెప్పేవి కేవలం నా అనుభవాల్లో నాకు బలంగా సరైనవని అన్పించినవే.

మనుషులు రెండు రకాలుంటారు. మనసుకు నచ్చిన దానికోసం వచ్చిన ఉద్యోగాన్ని కూడా వదిలిపెట్టే ధైర్యం ఉన్నవాళ్లు. వాళ్లల్లో కాన్ఫిడెన్స్ లెవెల్స్ చాలా ఎక్కువగా ఉంటాయి.

మైక్రోసాఫ్ట్ అధినేత బిల్‌గేట్స్ ఎగ్జామ్స్‌లో కొన్ని సబ్జెక్టుల్లో ఫెయిలయ్యేవాడు. ఒక సంస్థను స్థాపించి, ఎక్కువమందికి ఉపాధి కల్పించడం అతని కల. అతని క్లాస్‌మేట్ అన్ని సబ్జెక్టుల్లో మంచి ర్యాంకులతో పాసయ్యేవాడు.

చివరకి బిల్‌గేట్స్ మైక్రోసాఫ్ట్ సంస్థ స్థాపించి, క్లాస్‌మేట్‌కి తన కంపెనీలోనే సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ ఉద్యోగం ఇచ్చాడు.

ఇక రెండోరకంవాళ్లు గోడమీద పిల్లిలా ఉంటారు. ఏ అవకాశం ముందొస్తే దానివైపు దూకేస్తారు. స్థిరమైన మనస్తత్వం కాదు వాళ్లది. అన్ని పడవల్లోనూ కాలుపెడతారు. కానీ ఎందులోనూ వీళ్లకి కాన్ఫిడెన్స్‌గానీ, స్థిరత్వంగానీ ఉండదు. మన శ్యాంతి అంతకంటే ఉండదు. కాబట్టి మీరు ఏ రకానికి చెందినవాళ్లో మీరే నిర్ణయించుకోండి".

"అయితే నచ్చింది సాధించేవరకూ ఉద్యోగం చెయ్యకూడదంటారా?" మరో విద్యార్థి ప్రశ్నించాడు.

"గుడ్! ప్రొఫెసర్ అవుదామని కలగన్నవాడు టీచర్ అయ్యాడనుకోండి, తన కల నెరవేర్చుకోవడానికి కావల్సిన నైపుణ్యాలను సంపాదించుకోవాలన్న కసిని పెంచుతుంది ఆ ఉద్యోగం. నువ్వు మొదటిరకం అయినప్పుడు, అనుకున్నది సాధించేవరకూ నిద్రపోనివ్వదు.

కానీ అదే వ్యక్తి ఓ సాఫ్ట్‌వేర్ ఉద్యోగి అయ్యాడనుకో. అతన్ని అతని కలనుండి దూరం చేస్తుంది. ఎందుకంటే, తన కల నెరవేర్చుకోవడానికి తగినంత సమయం కేటాయించనివ్వదు ఆ ఉద్యోగం.

చదివిన చదువుకి సార్థకత ఉద్యోగమే అను

**రాత్రి పడుకోబోయే ముందు తన స్నేహితుడికి మనసులోనే పుట్టినరోజు శుభాకాంక్షలు చెప్పాడతను. కానీ అతడి కళ్లలో తడి. తన స్నేహితుడు రాసిన ఉత్తరాన్ని లోపలినుంచి మళ్లీ బైటకు తీశాడు. ఆ ఉత్తరం చదివిన ప్రతిసారీ, అతడిలో కసి రెట్టింపు అవుతూ ఉంటుంది. ఇంకా ఏం చెయ్యాలి? ఇంకా ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తూ ఉంటాడతను. ఇంతకీ అతనెవరు? స్నేహితుడు ఆ ఉత్తరంలో ఏం రాశాడు?**

# నా కొడుకు నా ఇష్టం

**'నా** మొగుడు నాకే సొంతం' అనే లెవెల్లో చెబుతోంది కరీనా. తమ కొడుకుకి తైమూర్ అని పేరు పెట్టి కరీనా దంపతులు వార్తల్లో నిలిచారు. ఆ పేరు మీద జరుగుతున్న రచ్చ అంతా ఇంతా కాదు. దీని మీద ఇప్పటి వరకూ కరీనా బాబాయ్ నోరు విప్పగా, మొదటిసారి కరీనా నోరు విప్పింది. నా కొడుక్కి ఏ పేరు పెట్టాలన్నది నా ఇష్టం. అంతే తప్ప ఇందులో ఇతరుల జోక్యం అనవసరమంటూ సోషల్ మీడియా ద్వారా పెద్ద క్లాసు పీకింది.

కుంటే, ఆ ఉద్యోగం మనలోని అసలైన నైపుణ్యాలను పెంపొందించేలా ఉండాలి. కలలు నెరవేర్చుకునేందుకు దోహదపడాలి".

కార్తీక్ వాక్ప్రవాహం కొనసాగుతోంది. మధ్య మధ్యలో అడ్డొచ్చే ప్రశ్నలు క్రమంగా ఆగిపోయాయి.

'జీవితంలో ప్రతిఒక్కరూ ఏదో ఒకటి సాధించాలని అనుకుంటాం. కానీ ముందుగా ఆర్థిక స్వాతంత్ర్యం సాధించాలి. అంటే విద్య పూర్తైన వెంటనే ఏదో ఒక దానిలో స్థిరపడాలనే ఆలోచన మంచిదే. ఐతే ఆ ఆలోచనల్ని మీరు కన్న కలల వైపు నడిపించడానికి "యువర్ డ్రీం యువర్ లైఫ్" అనే పేరుతో ప్రతి కాలేజీలోనూ ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచెయ్యాలని నిర్ణయించుకున్నాను. మీ మీ కలలకు, నైపుణ్యాలకు సంబంధించిన విషయాలను మొదటి సంవత్సరం నుంచే ఈ ప్రత్యేక విభాగంలో రిజిస్టర్ చేస్తారు. దానికి తగ్గట్టు ఆయా రంగాల్లో నిష్ణాతులైన వ్యక్తులు మీకు మార్గ నిర్దేశం చేస్తారు. అలా మీ చదువు పూర్తయ్యేనాటికి మీ కలలను నెరవేర్చుకునే మార్గాలు సుగమం అవుతాయి.

'నచ్చిందా? వచ్చిందా?' అనే సందిగ్ధం నుండి బైటపడి నచ్చిన దానిని అందరూ మెచ్చేలా సాధించేలా యువతకు దిశానిర్దేశం చెయ్యడమే ఈ ప్రత్యేక విభాగం లక్ష్యం అని ముగించాడు కార్తీక్.

•••

నెల రోజుల్లో ఇరవై ఇంజనీరింగ్ కాలేజీల్లో "యువర్ డ్రీం యువర్ లైఫ్" సెల్స్ ఏర్పాటయ్యాయి. ప్రముఖ పర్సనాలిటీ డెవలప్‌మెంట్ స్పీకర్ కార్తీక్ యువతకోసం చేస్తున్న కృషి, దృఢ సంకల్పమే దీనికి కారణం.

•••

ఆ రోజు కార్తీక్ బర్త్‌డే. అతడి ఇంజనీరింగ్ క్లాస్‌మేట్, మరణించిన దిలీప్ బర్త్‌డే కూడా అదే రోజు కావడం యాదృచ్ఛికం. కాలేజీలో చదువుకున్న నాలుగేళ్లూ ఇద్దరూ కలిసే ఫ్రెండ్స్‌కి పార్టీ ఇచ్చేవాళ్లు. దిలీప్, కార్తీక్ ఫ్రెండ్సే అయినా వారి ఆలోచనలు వేరు. దాంతో దిలీప్‌ని కాపాడలేకపోయిన బాధ కార్తీక్‌ని వదలడం లేదు.

ఆరోజు రాత్రి పడుకోబోయేముందు కార్తీక్ మనసులోనే దిలీప్‌కు 'పుట్టినరోజు శుభాకాంక్షలు' తెలియజేశాడు. దిలీప్ ఆత్మహత్య చేసుకోబోయే ముందు తనకు రాసిన ఉత్తరం లోపలినుంచి తీసి చదవడం మొదలెట్టాడు.

"ఒరేయ్! కార్తీక్... నువ్వు చాలా తెలివైన వాడివి. నువ్వెప్పుడూ, కలలు, ప్రత్యేకతలు, సాధించడం.. లక్ష్యం.. ఇలాంటివి చెబుతుంటే, నీకు ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేక, చేతకానితనానికి అవి నువ్వు పెట్టుకున్న పేర్లు అనుకునేవాణ్ణి. మంచి సాఫ్ట్‌వేర్ కంపెనీలో నాకు జాబ్ రాగానే ఏదో సాధించాను అనుకున్నాను. నెలకు యాభైవేల జీతం నా ఈగోని సంతృప్తిపరిచింది కానీ, నా లక్ష్యానికి, నా కలకి నేను దూరమౌతున్నానని తెల్సుకోలేకపోయాను. అనుక్షణం ఒత్తిడి, భయం, అసహనం, టార్గెట్స్. వీటితో నాకు తెలీకుండానే నాలో కోపం పెరిగిపోసాగింది. యాంత్రికజీవితంలో ఇరుక్కుపోయిన నా కలల కాన్వాస్ రంగులు లేక వెలవెల బోయినట్టు అనిపించేది. నా క్రియేటివిటీ అంతా అర్థరాత్రిళ్లు కన్నీరుకారుస్తూ కలలోకి వచ్చేది. నువ్వు చెప్పినట్టే, నాకు ఇష్టమైన క్రియేటివ్ ఫీల్డ్‌లోనే నా ఈ శ్రమనంతా వెచ్చించి ఉంటే నాకంటూ ప్రత్యేక గుర్తింపు వచ్చేది. ఈ సాఫ్ట్‌వేర్ ఉద్యోగంలో ఇమడలేక, అనుక్షణం కళ్ళ ముందు టార్గెట్లు పూర్తిచెయ్యలేక క్రమంగా నేను ఉనికిని కోల్పోతూ అభద్రతా భావానికి లోనవుతున్నాను. ఈ మధ్య తప్పుల మీద తప్పులు చేస్తుంటే ఉద్యోగం పోయింది. ఇన్నాళ్లూ ఉన్న ఉద్యోగం మత్తు వీడిపోయింది. మళ్లీ ఉద్యోగం రావాలంటే కొన్నాళ్లు గ్యాప్. స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్. మొన్నటి వరకూ తీసుకున్న జీతం కంటే తక్కువ జీతంతో సర్దుబాటు చేసుకోవాల్సిరావడం నా వల్ల అయింది గానీ, నా భార్య వల్ల కాలేదు. ఇంట్లో సమస్యలు, ఉద్యోగంలో ఒత్తిళ్లతో చివరకు సంసారం దెబ్బతింది. అపార్థాలు, అనుబంధాలు, అనుమానాలు, కేసులు, విడాకులు.. ఇవన్నీ మూకుమ్మడిగా నా మనస్సుమీద దాడి చెయ్యనారంభించాయి. ఇల్లాలు లేని ఇంట్లో ఒంటరి బ్రతుకు బ్రతకలేననే విరక్తి నాలో ప్రవేశించింది. ఆఫీసుకి వెళ్లాలనిపించటం లేదు. మూలపడేసిన పెయింటింగ్ 'కళ' మొదలు పెడదామని ఎంత ప్రయత్నించినా మనసులో అశాంతి కుంచె అంచుల్ని ఇంచుకూడా కదలనీయడంలేదు. ఒంటరితనం క్రమంగా జీవితంమీద ఆశల్ని అణచివేయసాగింది. నువ్వు నీ కలల్ని సాకారం చేసుకోవటంలో సఫలమవుతున్నావు. ఆలోచనారాహిత్యంతో లక్ష్యాన్ని అలక్ష్యంచేసి, నాలాగా రాజీ బ్రతుకు బ్రతకవద్దని యువ తకు అర్థమయ్యేలా అరిచి చెప్పాలని ఉంది. కలలు సాకారం చేసుకోవటంలో ఆరోహణం ఉంటుంది. అందమైన జీవితం ఉంటుంది. ఎటుబడితే అటు ఏ గాలికిపడితే ఆ గాలికి కొట్టుకుపోయే గాలిపటం లాంటి జీవితాల్లో అవరోహణమే ఉంటుంది. నాబోటివాళ్లు టెన్షన్, అస్థిరత్వంతో పిరికివాళ్లుగా మిగిలిపోతుంటే, నూటికొక్కడు నీలాంటివాడిలా ఆశాకిరణాల్లా ఉదయిస్తారు. కలలకు దూరమైన యువత నాలాగా అనామకుల్లా మిగిలిపోకూడదు. నీ కథల్లోని చైతన్యం, నీ మాటల్లోని ఉత్తేజం రెంటినీ కలగలిపి, నువ్వు యువత కలల్ని సాకారం చేసే దిక్సూచివి కావాలని ఆశిస్తూ, జీవితంలో ఓడిపోయిన ఓ పిరికివాడు.... 'దిలీప్'.

•••

కార్తీక్... కళ్లలో తడి. ఆ లెటర్ చదివిన ప్రతిసారీ, జీవితంలో తనకు మరో దిలీప్ కనపడకుండా ఇంకా ఏం చెయ్యాలా...? అన్న కసి రెట్టింపు అవుతోంది అతనిలో. ఆ కసిలో నుంచి ఆవిర్భవించిందే "యువర్ డ్రీం యువర్ లైఫ్".

మనం చేసే ప్రతిపనీ మన లక్ష్యానికి దూరంగా లేదా దగ్గరగా తీసుకెళ్తుంది. ప్రతి ఒక్కరిలో ఏదో ఒక ప్రత్యేక, అంతర్గత నైపుణ్యం ఉంటుంది. చదువు పూర్తయ్యాక ఆ నైపుణ్యాన్ని వెలికితీసి దాన్ని మెరుగుపరచుకునే ఉద్యోగాలు వెతుక్కునే వారి సంఖ్య చాలా తక్కువ. లక్ష్యం దిశగా అడుగులు వేసేవారే కలల్ని సాకారం చేసుకోగలుగుతారు. జీవితంలో ఎలాంటి అసంతృప్తిని తొంగి చూడనివ్వరు" క్షణికావేశాలకు, బలహీనతలకు లొంగిపోయి ఆత్మహత్యలకు పాల్పడుతున్న యువత కోసం చేపట్టబోయే కొత్త ప్రాజెక్ట్‌కోసం అన్వేషించడం మొదలు పెట్టాయి కార్తీక్ ఆలోచనలు.

సెల్:99591 81330

## అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయనూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేదిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా, పెద్దా అందరు శ్వాస కోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్ధానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జిన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పోడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.



డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి

**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇస్నోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జికి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జి ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికములిన్స్, ఆరమ్‌ఢైఫిలమ్, ఇఫ్రెసియా, ఆలియంసెప మొందలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.



## నడుంనొప్పికి ఆయుర్వేద చికిత్స

**ప్రస్తుత పరిస్థితుల్లో మానవుని జీవనం ప్రకృతి సహజ విధానాలకు విరుద్ధంగా ఉంటోంది. పెరిగి పోతున్న పని ఒత్తిడి, పోషకాహారం సరిగా తీసుకోక పోవడం వల్ల ఈ రోజుల్లో 40 ఏళ్లకే నడుంనడప్పి వస్తోంది. శారీరకంగా, మానసికంగా సమస్యలు కలిగించే నడుంనొప్పిని దూరం చేయాలంటే ఆయుర్వేద చికిత్సే ఉత్తమమైన మార్గం అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ మనోహర్.**

నేటి జీవనవిధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్తమైన దిన చర్యలు, స్వప్న విపర్యం అంటే రాత్రివేళ నిద్రపోక పోవడం, పగటిపూటనిద్రపోవడం వంటి అలవాట్లు శరీర వ్యవస్థను బాగా దెబ్బ తీస్తున్నాయి. ఆందోళన, మానసిక ఒత్తిడి కూడా అనేక అనారోగ్యలకు కారణ మవుతున్నాయి. వీటిలో అతిముఖ్యమైనది నడుంనొప్పి. ఆయుర్వేదశాస్త్రం నడుం నొప్పికి 'గృధ్రసీవాతం' గా నామకరణం చేసింది. తొంభైశాతం మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒక్క సారి నడుంనొప్పి బారినపడతారని కొన్నిఅధ్యయనాల్లో స్పష్టమయింది. **కారణాలు:** ఎక్కువసమయం ఒకే భంగిమలో కూర్చోవటం, స్థూలకాయం, ఎక్కువగంటలు వీపరితంగా శ్రమించడం, అతిగా బరువులు మోయడం, ద్విచక్ర వాహనం మీద ఎక్కువ దూర ప్రయాణం చేయడం, రోడ్డు ప్రమాదాలు,దీర్ఘకాలికరుగ్మతలు, వంశ పారంపర్య వ్యాధులు ఇవన్నీ నడుంనొప్పికి కారణాలు. ఈ కారణాల వల్ల వాత ప్రకోపం జరుగుతుంది. ఫలితంగా ముందుగా పిరుదుల పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి ఆ తరువాత నడుం భాగం, ప్రత్యేకించి ఎల్-4, ఎల్-5 వెన్నుపూసల మధ్య ఉండే సయాటికా నరం మీద ఒత్తిడి పడటంవల్ల నడుంనొప్పి వస్తుంది. డిస్కులో వచ్చే మార్పులు. వెన్నుపూసల మధ్య ఉండే డిస్కుల్లో కొన్ని మార్పులు జరిగినప్పుడు డిస్కుల మీద ఒత్తిడి పెరుగు తుంది. వాపు రావడం, డిస్కుకి రక్త ప్రసరణ సరిగా లేక పోవడం, డిస్కు అరిగి పోవడం వంటి సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్కులలో వాపువస్తే అందులోనుంచి ద్రవం బయటకు వచ్చి మేరుదండం నుంచి వచ్చే నరాల పైన ఒత్తిడి పెరుగు తుంది. దీనివల్ల వెన్ను నొప్పి వస్తుంది. **లక్షణాలు:**నడుంనొప్పి, వాపు, కాస్త శ్రమించినా సూదుల తో గుచ్చినట్లుగా నొప్పి తీవ్రంకావడం, కాళ్ళలో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. సకాలంలో చికిత్స అందకపోతే స్పర్శజ్ఞానం కోల్పోతారు.సమస్య తీవ్రమైతే మలమూత్రాల మీద నియంత్రణ కోల్పోయే ప్రమాదం ఉంది. పెయిన్ కిల్లర్స్ వాడకూడదు. పెయిన్‌కిల్లర్స్‌తో మలబద్దకం, జీర్ణా శయ సమస్యలు వస్తాయి. వెన్నుసంబంధిత సమస్యలను వెంటనే గుర్తించి చికిత్స తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా ఉంటుంది.

**ఆయుర్వేదచికిత్స:** నడుంనొప్పిసమస్యకు ఆయుర్వేద శాస్త్రం సూచించిన సమగ్రమైన చికిత్సా పద్ధతుల్లో నిదాన పరి వర్జనము, శమన చికిత్స, శోధనచికిత్స అని మూడు ప్రధానమైనవి ఉన్నాయి. **నిదానపరివర్జనము:** వ్యాధికి కారణమయిన విషయాలను పాటించక పోవడం. ఉదా॥ విరుద్ధ ఆహార, విహార సేవన (రాత్రి మేల్కోవటం, పగలు నిద్రపోవటం).**శమనచికిత్సలు:** వ్యాధితాలూకు దోషాలను శమింప చేయాటానికి తెచ్చే ఔషదాలు. ఇందులో రోగ బలాన్నిబట్టి, రోగిబలాన్నిబట్టి చూర్ణాలు, గటికలు, కషాయాలు, లేహ్యలు, తైలాలు వంటి ఔషదాలు రోగికి ఇవ్వడం జరుగుతుంది. కానీఈ శమన చికిత్సవల్ల ఒక్కో సారి ప్రకోపించిన దోషాలుమళ్ళీ తిరగబడవచ్చు. అందుకే వ్యాధితీవ్రతను బట్టి శమన చికిత్సలతో పాటు కొందరికి పంచకర్మ (శోధన చికిత్స) కూడా అవసరం. ప్రకోపించిన దోషాలను(వాత, పిత్త, కఫ) దీని ద్వారా సమంగా చేసి శరీర శుద్ధిని, అగ్ని బలాన్ని పొందవచ్చు. ఆయుర్వేదంలోని స్వేద కర్మ ద్వారా వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపోదించి కీళ్లకదలికలను సులభతరం చేయువచ్చు. బిగుసుకుపోయిన కీళ్లను స్వేదకర్మ ద్వారా వదులుగా, మృదువుగా మార్చవచ్చు. **కటివస్తి:** ఇది ఆయుర్వేదంలోని ఒక విశిష్టప్రక్రియ. అరిగిపోయిన మృదలాస్థి (కార్టిలేజ్)కి రక్తప్రసరణ పెంచినొప్పి తీవ్రతను తగ్గించడంలో ఈ ప్రక్రియఎంతగానో ఉపయోగపడు తుంది. ఇదే క్రమంలో సర్వాంగధార చికిత్స కూడా వీరికి బాగా ఉపయోగపడుతుంది. వస్తికర్మ ఆయుర్వేద శాస్త్రం లో వస్తికర్మచికిత్స అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించు కుంది. ఈ వస్తికర్మచిన్నపేగులు, పెద్దపేగులలోని ఎంటరిక్ నర్వస్ సిస్టమ్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా నాడీ కణాలలో ఏర్పడిన లోపాలను సరిచేసి బలం చేకూర్చ వచ్చు. అలాగే పక్వాశయ వాతస్థానంకాబట్టి ప్రకోపించిన వాతాన్నికూడా సహజస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** అవసరమైన పోషకాహారం తీసుకుంటూ వైద్యులు సూచించిన విధానా లను అనుసరించడం చాలా ముఖ్యం. ఔషదచికిత్సల తరువాత క్రమం తప్పకుండా వ్యాయామం కూడా చేస్తే నడుం నొప్పి సమస్యనుంచి శాశ్వతంగా విముక్తి కలుగుతుంది.

డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద

ADVT

# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**మంచం మీద వెల్లకిలా పడుకున్న లాలస శయనాగారం పైకప్పును అలంకరించిన రంగురంగుల లతలనూ, పుష్పాలనూ చూస్తూ ఉండిపోయింది. ఆ ఆకృతులకి మెరుపు తరగని రంగులు అద్దినట్టున్నారు. అక్కడున్న కృత్రిమ లతలలాగే ఆమెలో ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకుంటున్నాయి.**

పరిచారికలు దీపాలు వెలిగిస్తున్నప్పుడు తను నిద్ర నటిస్తూ కళ్లు మూసుకుంది. వాళ్లను పలకరించడం, వాళ్లు పలకరిస్తే సమాధానంగా మాట్లాడ్డం తనకి ఇష్టం లేదు. మొదట్లో ఈ మందిరం గురించీ, మహారాజ కుటుంబం గురించీ, అపహరించి తెచ్చిన వ్యక్తి గురించీ తెలివిగా ప్రశ్నించి, పరిచారికల నుండి వీలయినంత సమాచారం సేకరించాలని ఉబలాటపడింది తను. కానీ అది వృథా ప్రయాస అనీ, అపాయకరమనీ అనిపించింది. తన మందిరంలో తన పరిచారికలు అపరిచితులకు తన రహస్యాలు చెప్పరు. అలాగే ఇక్కడా! ఈ మందిరంలో ఉన్న కేతకీ, సుగంధీ వాళ్ల యువరాజు గారి గురించి గానీ, మహారాజు గురించి గానీ, తనను బంధించిన మందిరం గురించి గానీ తనకు చెప్పరు. ఒకవేళ తన పట్ల జాలి చూపిస్తూ చెబితే, అది నిజమైన జాలి కాదు; ఆ సమాచారం నిజమైంది అయ్యుండదు!

ప్రస్తుత స్థితిలో తన త్రికరణాలలో రెండవ, మూడవ కరణాలు ఉపయోగించవు. రెండవ కరణమైన 'వాక్కు' ఉపకరించదు! మూడవ కరణమైన 'కాయిక కర్మ, శరీరంతో చేసే పని' ఉపకరించదు. ఔను..తన మాటలు వృథా. తన చేతలు వృథా. త్రికరణాలలో రెండు ఉపయోగించనప్పుడు; వాటిని తాను ఉపయోగించలేనప్పుడు మొదటి దానినే ఆశ్రయించాలి. దానినే ఉపయోగించాలి! త్రికరణాలలో మొదటిది 'మనసు'! ఆ మనసును మాత్రమే తనిప్పుడు ఉపయోగించాలి. మనోవాక్కాయ కర్మలలో మొదటిదైన మనసుతో చేయగలిగింది ఆలోచన మాత్రమే! తను ఆలోచించాలి; పథకం వేయాలి. పొంచి ఉన్న ఆపద నుండి తెలివిగా తప్పించుకోవాలి. ప్రస్తుతం తన శక్తి మాటలో లేదు; చేతలలో లేదు. మనసులో ఉంది!

ఆ ఆలోచనలతో తను నిద్ర నటించింది. శయనాగారం తలుపులకున్న చిరుగంటలు చప్పుడు చేసినప్పుడు తన కళ్లను కొద్దిగా తెరిచింది. మొదటిసారి ఒక అపరిచిత యువతి తన వైపు కళ్లు చించుకుని చూస్తూ, ఠీవీగా మంచాన్ని సమీపించింది. ఆమె నడకలో గాంభీర్యం ఉంది. రాజసం ఉంది. అహంకారం ఉంది. ఆమె...అందంగానే ఉంది. ఆమె తిరిగి వెళ్తున్నప్పుడు తను కళ్లు పూర్తిగా తెరిచి చూసింది. వెనక నుండీ ఆమె నడకలో తనకు వయ్యారం కనిపించింది. ఆ కదలికలో దర్పం, నిర్లక్ష్యం కనిపించాయి.

రెండవసారి తలుపు తెరుచుకున్నప్పుడు పరిచారిక కేతకి అని తనకు పరిచయమైన పరిచారిక వచ్చింది; అడుగుల చప్పుడు కాకుండా పిల్లి లాగా. తన నిద్రకు భంగం కలిగించకూడదన్న జాగ్రత్త వ్యక్తమైంది, ఆమె నడకలో! చప్పుడు కాకుండా వెళ్లిపోయి, చప్పుడు కాకుండా గొళ్లెం పెట్టింది.

తనది గాఢనిద్ర అని వాళ్లు అనుకోవచ్చు. అపహరించినప్పుడు తన మీద ప్రయోగించిన ఔషధం మూలంగా, మళ్లీ తనకు మైకం కమ్మి ఉంటుందని అనుకోవచ్చు. వాళ్లు ఎలా అనుకున్నా తనకు మంచిదే! తాను నిద్ర నటిస్తున్నట్టు పసికట్టకుండా ఉంటే చాలు. అలా అనుకుని, బిగ్గరగా మాట్లాడుకోవచ్చు. ఆ మాటలలో తనకి ఉపయోగించే అంశం ఉండవచ్చు.

లాలస ఆలోచనలు పక్కకు నెట్టి తన ఆరాధ్య దేవత కామరూపను ధ్యానించడం ప్రారంభించింది.

●●●

శక్తిరత్న మహారాజూ, మహామంత్రీ, సేనాధిపతీ, యువరాజు కళింగరత్న, కోశాధికారి సమాలోచన మందిరంలో సమావేశమయ్యారు. గత రాత్రి పొద్దుపోయేదాకా జరిగిన సమావేశానికి కొనసాగింపుగా జరుగుతున్న చర్చాకార్యక్రమం ఇది.

యువరాజుకు చతురంగ బలాల వివరాలతో, సహాయక అధికారులతో ప్రత్యక్ష పరిచయ కార్యక్రమం నిర్వహించమని సేనాధిపతినీ, మహామంత్రినీ ఆదేశించాడు శక్తిరత్న మహారాజు.

"కళింగా, మన శక్తిసామర్థ్యాలు నీకు అవగాహనకు రావాలి. త్వరలో సామ్రాజ్య భారం నీ భుజస్కంధాల మీద మోపాలన్న నిర్ణయం జరిగింది...." శక్తిరత్న మహారాజు కుమారుడితో అన్నాడు.

"అలాగే నాన్నగారూ" కళింగరత్న వినయంగా అన్నాడు.

"మహామంత్రీ..."

"ప్రభూ..."

"కామరూప చక్రవర్తి కుబేరవర్మ గారి పుత్రిక స్వయంవరం

## జరిగిన కథ

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున, ఆలయానికి వెళ్ళిన యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. రాకుమార్తెను రహస్యమార్గం ద్వారా అపహరించిన సుకర్మ, ఆమెను కళింగ యువరాజు కళింగరత్నకి అప్పగిస్తాడు. కళింగరత్న ఆమెని ఒక మందిరంలో ఉంచి జరిగిన విషయాలన్నీ వివరిస్తాడు. కురంగిని, ఇద్దరు పరిచారికలను కాపలాగా ఏర్పాటుచేస్తాడు. కళింగరత్న మేనమామ కూతురు జలజ అనుకోకుండా ఆ పర్వత మందిరానికి వచ్చి లాలసను చూస్తుంది. ఆ విషయాన్ని ఉలూకుడికి తెలియజేస్తుంది పరిచారిక.

ఆ తర్వాత....

నాడు అదృశ్యమైన విషయం మనకు తెలుసు. వారికి మన సానుభూతి తెలియజేస్తూ లేఖ పంపించండి. వారి సుపుత్రిక క్షేమంగా వారిని చేరుకోవాలన్న మా ఆకాంక్షను వ్యక్తం చేయండి. లేఖలో స్వయంగా మేము చేవ్రాలు చేస్తాం!"

"చిత్తం. ఇవాళే ప్రత్యేక వార్తాహరుడిని పంపించే ఏర్పాటు చేస్తాను.." మహామంత్రి అన్నాడు.

"ఆ తల్లిదండ్రులు తల్లడిల్లిపోతూ ఉంటారు. ఆ కన్నె పిల్లను అపహరించిన రాక్షసుడిని ఉరి తీయకూడదు. శిరచ్ఛేదం చేయకూడదు. ముక్కలు ముక్కలుగా నరకాలి!" శక్తిరత్న మహారాజు ఆవేశంగా అన్నాడు.

కళింగరత్న ఉక్కిరిబిక్కిరి అవుతూ తండ్రివైపు చూశాడు. ఆ రాక్షసుడు తన పుత్రరత్నమే అని ఆయనకు తెలిస్తే..? బిగుసుకుపోతున్న ముఖాన్ని సహజస్థితికి తెచ్చే ప్రయత్నం చేస్తూ కూర్చున్న చోటు నుండీ లేచాడతను.

"నాన్నగారూ..."

"ఇక నువ్వు వెళ్లు నాయనా. తీరిక సమయాలలో ఆచార్య చాణక్యుని అర్థశాస్త్రం పఠించు. చక్రవర్తి కాబోయే నీకు ఆ మహా గ్రంథం కొట్టిన పిండి కావాలి సుమా!"

"అలాగే నాన్నగారూ... పర్వత మందిరంలో నేను చేస్తున్న పని అదే!" కళింగరత్న నవ్వు ఆపుకుంటూ అన్నాడు.

ద్వారం వైపు వెళ్తున్న కళింగరత్నను కాసేపు చూసి, మహామంత్రి శక్తిరత్న మహారాజువైపు చిరునవ్వుతో చూశాడు. "చూశారా ప్రభూ, ఆ మాట తీరూ, ఆ ప్రవర్తనా, ఆ వినయం... యువరాజుగారిది ముమ్మూర్తులా తమ పోలికే!"

"రక్తం మహామంత్రీ, రక్తం!" శక్తిరత్న మహారాజు సగర్వంగా అన్నాడు.



●●●

సమాలోచన మందిరంలోంచి అవతలకి అడుగుపెట్టిన కళింగరత్న ముందు ప్రధాన భటుడు వినయంగా తలవాల్చి, నిలుచున్నాడు. "యువరాజులుంగారికి మనవి..."

"ఏమిటి?" కళింగరత్న గంభీరంగా అన్నాడు.

"మాతృశ్రీ మహారాణిగారు పూజామందిరంలో ఉన్నారు. తమరిని ఒకసారి వెంటనే రమ్మన్నారు.."

పర్వతం మీద ఉన్న ఏకాంత విలాసమందిరానికి వెళ్లకుండా రాత్రి నుంచీ తండ్రి అడ్డుపడ్డాడు. ఇప్పుడు కొసరుగా తల్లి అడ్డపడుతోంది! కళింగరత్న విసుగ్గా అనుకున్నాడు. తప్పదు... చూడకుండా వెళ్తే అమ్మ ఏకాంత మందిరానికే సేవకుల్ని పంపుతుంది.

ఒకసారి కనిపించి వెళ్తే దినమంతా తనకు ఆటవిడుపే!

"సరే.." అంటూ అంతఃపుర ద్వారం వైపు నడిచాడు కళింగరత్న.

●●●

కళింగరత్న పూజామందిరంలోకి అడుగుపెట్టాడు. మహారాణి అపర్ణాదేవి కర్పూర నీరాజనం సమర్పించి, నమస్కరించి వెనుదిరిగి చూసింది.

"అమ్మా..." కళింగరత్న చిరునవ్వుతో అన్నాడు.

"ఇలా రా కళింగా!" మహారాణి పిలిచింది.

కళింగరత్న పూజా మండపం ముందుకు వెళ్లాడు. అపర్ణాదేవి పళ్లెంలోని పువ్వులు కొన్ని, బంగారు గిన్నెలోని అక్షతలు కొన్ని తీసి కుమారుడికి ఇచ్చింది.

"కలశానికి పుష్పాక్షతలు సమర్పించి నమస్కరించుకో నాయనా!" అందామె.

కళింగరత్న మందిరం మధ్య ఉన్న పెద్ద బంగారు కలశాన్ని చూస్తూ నమస్కరించాడు. కలశం మీద కొబ్బరికాయ ఉంది. కొబ్బరికాయ చుట్టూ తమలపాకులు అందంగా అమర్చబడి, కలశంలోంచి తొంగిచూస్తున్నాయి. పూర్తిగా పసుపు రాసిన కొబ్బరికాయ కలశం రంగులో కలిసిపోతోంది. పుష్పాక్షతలు వేసి, మళ్లీ నమస్కరించాడు కళింగరత్న. తల్లి కోసం చూశాడు. మహారాణి పూజాగృహం తలుపు మూసి గొళ్లెం పెట్టి, అతని దగ్గరగా వచ్చింది.

"అమ్మా నేను వెళ్లిరానా?" కళింగరత్న అడిగాడు.

"కళింగా, నువ్వు నమస్కరించిన కలశ దేవత ఎవరో తెలుసా?" కొడుకు ప్రశ్నను పట్టించుకోకుండా అడిగింది మహారాణి.

"పార్వతీదేవో, లక్ష్మీదేవో అయి ఉండాలి కదమ్మా?" కళింగరత్న అన్నాడు.

"కాదు...మహాశ్వేతాదేవి."

"ఓ...అంటే సరస్వతీదేవి కదమ్మా?" కళింగరత్న అన్నాడు.

"కాదు" మహారాణి ముక్తసరిగా అంది.

"కాదా!" కళింగరత్న కంఠంలో ఆశ్చర్యం.. "అది సరస్వతీదేవి మరొక పేరే కదా!"

మహారాణి అపర్ణాదేవి కొడుకు ముఖంలోకి తదేకంగా చూసింది. "ఆ కలశ దేవత దేవతాస్త్రీ కాదు. ఒక మానవ కాంత. ఆమె అయిదు తరాలుగా ఈ పూజామందిరంలో పూజలు అందుకుంటోంది. ఆమె ఎవరో తెలుసా?"

"నాన్నగారు కానీ, నువ్వు కానీ ఎప్పుడూ చెప్పలేదుగా.."

"ఆమె కామరూప సామ్రాజ్య చక్రవర్తి దంపతుల జ్యేష్ఠ పుత్రిక..."

కళింగరత్న నిర్ఘాంతపోతూ చూశాడు. అపర్ణాదేవి అతని ముఖంలోకి రెప్పవేయకుండా చూసింది. "కామరూప చక్రవర్తి వంశంలో పుట్టిన ఒక స్త్రీని దేవతగా కలశంలో ఆవాహన చేసి పూజామందిరంలో ఎందుకు ప్రతిష్ఠించారని అడగవేం?"

"...ఎందుకు?" కళింగరత్న నోరు పెగుల్చుకుని అన్నాడు.

"ఆమె మహా సౌందర్యవతి. ఆ తరంలో మన వంశంలో నీలాగే ఒక యువరాజుగారు ఉండేవారు. కామరూప ఆలయంలో ధ్యానంలో ఉన్న ఆ యువతిని అపహరించి తెచ్చుకున్నాడు. ఆమెను బలవంతంగా వివాహం చేసుకోవాలనుకున్నాడు. కానీ ఆ యువరాజు కోరిక తీరలేదు. మహాశ్వేతాదేవి తన ఉంగరంలోని నవరత్నాలను చూర్ణం చేసి, ఔషధంలాగా త్రాగివేసి, ఆత్మహత్య చేసుకుంది. తనను నిర్బంధించి ఉంచిన గదిలో...ఈ రాజప్రాసాదంలోనే..." అపర్ణాదేవి ఆగింది.

కళింగరత్న మౌనంగా చూశాడు. వందల ఏళ్ల కిందట జరిగిన ఆ అపహరణ గురించి తనకు తెలుసు. అయితే కలశం గురించి తెలీదు. అపహరణ గురించి తెలిసినప్పటికీ తెలియనట్టు ఉండిపోయాడతను...

"ఆత్మహత్య చేసుకున్న మహాశ్వేతాదేవి ప్రేతాత్మ మన రాజమందిరంలో సంచరించ సాగింది. రాత్రి వేళల్లో మందిరంలో మువ్వల సవ్వడి, కిలకిల నవ్వులు. ప్రతీనెలా ఆమె ఆత్మహత్య చేసుకున్న తిథి నాడు దీనంగా ఏడుపు వినిపిస్తూ ఉండేది. రాచనగరంలో అందరూ భయంతో వణికిపోయేవారు. మహాశ్వేతాదేవి ప్రేతాత్మ సంచారాన్ని పరిశీలించిన ఒక సాధువు ఆ యువరాజు తల్లిదండ్రుల చేత ప్రేత శాంతి యాగం చేయించాడు. ఆ యాగ పరిసమాప్తి సమయంలో ఈ స్వర్ణకలశం ప్రతిష్ఠించబడింది. స్వర్ణకలశ రూపంలో ఉన్న ఆ మహాశ్వేతాదేవికి నిత్యార్చన జరగాలని ఆయన నిర్దేశించారు. నిర్లక్ష్యం చేస్తే ప్రేతాత్మ సంచారం పునఃప్రారంభం కావడమే కాకుండా దుష్పరిణామాలు చోటు చేసుకుంటాయని హెచ్చరించాడు ఆ సాధువు.." అపర్ణాదేవి ఆపి, కుమారుడి ముఖంలోకి సూటిగా

**మహారాణిగారు మిమ్మల్ని వెంటనే రమ్మంటున్నారు అంటూ కబురు తెచ్చాడు భటుడు. సరేనంటూ అంతఃపుర ద్వారం వైపు కదిలాడు కళింగరత్న. పూజామందిరంలోకి అడుగుపెడుతూనే తల్లి ఓ పెద్ద బంగారు కలశానికి పూజ చేయడం గమనించాడు. అతణ్ణి కూడా ఆ బంగారు కలశానికి నమస్కరించుకోమంది. దీని చరిత్ర తెలుసా? అని అడిగింది. తెలియదన్నాడు కళింగరత్న. ఆ బంగారు కలశ చరిత్ర ఏమిటి? ఇప్పుడు ఆమె కళింగరత్నకు దాన్ని గురించి ఎందుకు వివరిస్తోంది?**

చూసింది.

"వింటున్నావా, కళింగా?"

కళింగరత్న మంత్రముగ్ధుడిలా తల ఆడించాడు. ఇన్నేళ్లుగా లేనిది ఈనాడే అమ్మ ఆ ప్రేతాత్మ కథ తనకు ఎందుకు చెప్తోంది? యాదృచ్ఛికమా?

"ఆ మహాశ్వేతాదేవి ప్రేతాత్మ ఉనికిని పరీక్షించే ఉద్దేశంతో నేను పట్టపురాణి అయిన కొత్తల్లో నిత్యార్చన నిలిపివేసి చూశాను. ఆ రాత్రే ఆ గది లోంచీ మువ్వల సవ్వడీ, నవ్వుల కిలకిలా వినిపించాయి! అంతే, అప్పటి నుంచీ ఆ తల్లి నిత్యార్చనకు భంగం కలగకుండా చూసుకుంటున్నాను. ఈ వంశం ఉన్నంతకాలం మహాశ్వేత కలశారాధన కొనసాగాల్సిందే!" అపర్ణాదేవి అంది.

"విచిత్రంగా ఉంది..." కళింగరత్న ఏమనాలో తెలీని పరిస్థితిలో అప్రయత్నంగా అన్నాడు.

"కళింగా, లాలసను ఎందుకు అపహరించావు?" మహారాణి అపర్ణాదేవి కంఠం పూజా మందిరంలో గంటలా ఖంగుమంది.

కళింగరత్న శరీరం ఒక్కసారి జలదరించింది. శరీరం మీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. నోరు కొద్దిగా తెరిచి, తల్లి వైపు చూశాడు.

"అప్పుడెప్పుడో ఆరో తరంలో ఒక అహంకారి చేసిన అపరాధాన్ని నువ్వెందుకు చేశావు?"

"...అమ్మా.."

"సమాధానం చెప్పు! ఆ ఘోరం ఎందుకు చేశావు?"

కళింగరత్న ధైర్యం కూడదీసుకుని, ఒక్కసారి వేడి నిట్టూర్పు విడిచాడు. "ఆమెను ఇష్టపడ్డాను. ఆమె నాలాంటి మెల్లకంటి వికార స్వరూపుణ్ణి స్వయంవరంలో వరించదు! నా తల్లిదండ్రులు నాకు వికార రూపం బహూకరించారు. రాక్షస వివాహం మన క్షత్రియులకు ఆచరణీయమే! నా తల్లిదండ్రులకు చెప్పినా, లాలసను నాకు తెచ్చి ఇవ్వరు. అందుకని నేనే తెచ్చుకున్నాను."

"నీ నేరాన్ని నీ తల్లిదండ్రుల మీదికి నెడుతున్నావా?" మహారాణి అపర్ణాదేవి అంది. "నీ అందం లేదా అందవికారం నీ తల్లిదండ్రులది కాదు. మనిషికి కన్న తల్లిదండ్రుల పోలికలే కాదు; తరతరాల వంశజుల పోలికలు వస్తాయి! ఇది సత్యమైన జన్మ రహస్యం. నీకొక విషయం తెలుసా? ఆరు తరాలప్పుడు మహాశ్వేతాదేవి అనే అమాయక కన్యను అపహరించి, ఆమె దుర్మరణానికి కారకుడైన సింహరత్న నీలాగే అందవిహీనుడు.



నీకు సంక్రమించినవి ఆయన పోలికలే; శారీరకంగా, మానసికంగా కూడా!"

"అమ్మా!"

"నిజం కళింగా! మనిషి జయించాల్సింది మనసును; శరీరాన్ని కాదు. ఆనాడు ఆయన చేసిన పాడు పనిని ఈనాడు నువ్వు చేశావు!"

"ద్వాపర యుగంలో ఇదే అపరాధం చేసిన వ్యక్తి దేవుడయ్యాడు! నేటికీ ఆరాధనలు అందుకుంటున్నాడు. అదే నేడు నేను చేస్తే అపరాధమైపోయింది!" కళింగరత్న కంఠంలో, కసీ, ఎగతాళీ పెనవేసుకుని ధ్వనించాయి.

మహారాణి అపర్ణాదేవి కళింగరత్న ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. "ద్వాపరయుగం...దేవుడు... శ్రీకృష్ణపరమాత్మనేనా నువ్వు చెప్పుతోంది? అవును. ఆయన రుక్మిణీదేవిని దేవీ ఆలయంలోంచి అపహరించుకుపోయాడు. ఆమె సందేశంలో పేర్కొన్న విధంగా రాక్షస వివాహం చేసుకున్నాడు. కానీ అక్కడ కన్నెపిల్ల ఆయనను ప్రేమించింది. ఆయనా ఆమెను ప్రేమించాడు. అందుకు అడ్డు చెప్పింది తల్లిదండ్రులు కాదు, ఆమె సోదరుడు రుక్మి. పరస్పర అంగీకారంతో రుక్మిణీ కృష్ణులు వివాహం చేసుకున్నారు. నీ విషయంలో ఆ నీతి లేదు. పరస్పర అంగీకారం లేదు. నువ్వెవరో కామరూప రాకుమారికి తెలీదు. దుర్మార్గంగా ఆమెను అపహరించావు. శ్రీకృష్ణుడిలాగా బహిరంగంగా కాదు; దొంగచాటుగా. ఏ మత్తు మందో ప్రయోగించి ఆ పిల్లను అపహరించి తెచ్చావు. కామరూప నగరానికి వచ్చిన సారథిని విచారించాను. అతన్ని తిప్పి పంపేశావు! అంగీకరిస్తావా?"

కళింగరత్న తల్లివైపు విసుగ్గా చూశాడు. మహరాణి కుమారుడి కళ్లల్లోకి తీక్షణంగా చూసింది. "నీకు తెలుసా, కళింగా? నువ్వు అనుసరించిన విధానం పైశాచికం! అంటే ఏమిటో తెలుసా...నిద్రలోనో, మైమరుపులోనో ఉన్న స్త్రీని కేవలం కామంతో రహస్యంగా అపహరించి, రహస్యంగా చేసుకునే వివాహం.."

"అమ్మా..."

"పైశాచికంగా పెళ్ళాడ్డం క్షత్రియులకు తగిన ధర్మం కాదు.."

"అమ్మా...లాలసను ఇష్టపడ్డాను...ప్రేమిస్తున్నాను.."

"నీ ప్రేమ ఏకపక్షం. పైశాచికమైన వివాహం.. వివాహం కాదు. అది ఒక అసహాయురాలి మీద జరిగే అత్యాచారం. నా బిడ్డడు ఆ పాడు పని చేయకూడదని కోరుకుంటున్నాను.."

"అలాంటి ఉద్దేశం ఈ క్షణం దాకా నాలో లేదు.." కళింగరత్న ఆవేశంగా అన్నాడు.

"కళింగా, అడ్డు రాకుండా విను. ప్రస్తుత స్థితిలో లాలసతో నీ వివాహాన్ని నేనూ, మీ నాన్నగారూ అంగీకరించం, అనుమతించం. నీకు తెలిసో తెలియకో, నువ్వు రెండు శతాబ్దాలనాడు ఈ వంశంలో జన్మించిన యువరాజును ఆదర్శంగా తీసుకుని ఒక కన్యను పైశాచికంగా అపహరించావు. ఆయన లాగే ఆలోచించావు. ముందు ముందు కూడా ఆయనలాగే నువ్వు ఆలోచించవచ్చు. పెళ్లికి అభ్యంతరం చెప్పిన తల్లిదండ్రుల్ని చెరసాలలో బంధిస్తానన్నాడు! ఆత్మహత్య చేసుకుంటానన్నాడు! అవసరమైతే నువ్వు...ఆ కంసుడిని ఆదర్శంగా తీసుకోవాలని అనుకోవచ్చు! అది ఫలించదు! అలాంటి దురాలోచనలు చేయొద్దు! మహారాజుగారు నిన్నూ, లాలసనూ ఆమె తండ్రికి నిస్సంకోచంగా అప్పగిస్తారు!"

కళింగరత్న, తల్లి వైపు ఆశ్చర్యంగా చూశాడు. అమ్మ తన ఆలోచనలను ఎలా పసిగట్టగలిగింది? పాలు తాగే కన్నబిడ్డ ఆకలిని పసిగట్టే తల్లి, కన్నబిడ్డ ఆలోచనల్నీ పసిగడుతుందా? అప్రయత్నంగా అతను తల్లి వైపు దీనంగా చూశాడు. 'ఉరి వేయకూడదు, శిరచ్ఛేదనం చేయకూడదు, ముక్కలు ముక్కలుగా నరకాలి!' తండ్రి మాటలు గుర్తొచ్చాయతనికి.

"అమ్మా...నాకు...నాకు లాలస కావాలి. నన్ను వివాహం చేసుకునే అవకాశం ఆలోచించుకొమ్మని ఆమెకు అవకాశం ఇచ్చానమ్మా...సమయం కూడా ఇచ్చానమ్మా..."

"మంచి పని చేశావు. మెచ్చుకుంటున్నాను. నేను నీ తల్లిని. నీ ముచ్చటను కాదనలేను. లాలస ఇష్టపడితే, అంగీకారాన్ని స్వచ్ఛందంగా వ్యక్తం చేస్తే మేమే మీ వివాహం జరిపిస్తాం. ప్రయత్నించు. ఆమెను స్వాధీనం చేసుకోవడం కాదు. ఆమె మనసును స్వాధీనం చేసుకో!"

"అమ్మా...నిజంగానా?"

"వివాహం జరిగితేగానీ ఆ కన్నెపిల్లను నువ్వు చేతితో తాకకూడదు కూడా! గతంలో మహాశ్వేతా దేవిలాగా ఆ యువతి ఆత్మహత్యకు పాల్పడితే ఒక్కగానొక్క వంశాంకురం అని కూడా నీ తల్లిదండ్రులు చూడరు. నీ మీద హత్యానేరం మోపి, కామరూప చక్రవర్తికి అప్పగిస్తారు.."

"అమ్మా..."

"మన వంశం మీదా, ఈ మందిరంలోనూ మరొక ప్రేతాత్మ సంచరించడం నేను సహించను. చేతనైతే ఆ రాకుమారిని ప్రసన్నం చేసుకో!" మహారాణి అపర్ణాదేవి అంది.

"ప్రయత్నిస్తాను..."

"కళింగా, నిస్సహాయురాలిగా నీ నిర్బంధంలో ఉన్న ఆ కన్నెపిల్ల మీద అఘాయిత్యం చేయనని నాకు వాగ్దానం చేయి!"

కళింగరత్న మౌనంగా ఆమె చేతిని అందుకుని, ఆ చేతిలో తన చేతిని వేశాడు. "నీ కుమారుణ్ణి నమ్ము!" అన్నాడు. అపర్ణాదేవి చిరునవ్వు నవ్వింది.

"అమ్మా... నీకు లాలస గురించి ఎలా తెలిసింది? ఎవరు చెప్పారు? పరిచారికలా? ఉలూకుడా?"

"ఉలూకుడు నీకు తోడుదొంగ! మాకు తెలుసు. ఇక్కడే ఉండు, ఆ మూడోకంటిని పంపిస్తాను" అంటూ మహారాణి ద్వారం వైపు వెళ్ళింది. తలుపు తెరుచుకుంది. ఆమె గుమ్మం దాటింది. తలుపు మూసుకుంది. కళింగరత్న ఆత్రంగా చూస్తున్నాడు. రెండు నిమిషాల తరువాత తలుపు తెరుచుకుంది. మెల్లిగా కళింగరత్న కళ్లు చించుకుంటూ చూస్తున్నాడు. వెనకపాటుగా లోపలికి ప్రవేశించి, తలుపు మూసి అతని వైపు తిరిగింది జలజ...

•••

కళింగరత్న పర్వత మందిరంలోని తన ఏకాంత కక్ష్యలో కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. తన తల్లి పలికిన మాటలూ, తరువాత జలజ పలికిన మాటలూ అతన్ని ఇంకా ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. పూజామందిరంలోకి వచ్చిన జలజను నివ్వెరపాటుతో చూస్తూ "నువ్వా?" అన్నాడు.

"నేనే! అందగత్తెను అపహరించి తెచ్చావు; అభినందనలు అందుకో బావా!" జలజ వెటకారంగా అంది. "నా విచారం ఏమిటంటే ఆ అందం నీకు అందదు!"

తను కొరకొర చూశాడు. జలజ, చక్రవర్తి కుమార్తె కాదు. త్రిలింగరాజ్యంలోని ఇంద్రగిరి అనే చిన్న సామ్రాజ్యాన్ని ఏలుకుంటున్న మేనమామ కూతురు. తన భార్య కావాలని కలలు కంటోంది ఎప్పట్నుంచో!

"తొందరపడ్డావు బావా. ఒక్కసారి దర్పణంలో నీ దర్శనం చేసుకో. నాలాంటి అమాయకురాలు తప్ప మరో అందగత్తె నిన్ను కన్నెత్తి కూడా చూడదు!"

"నోర్ముయ్!" తను గర్జించాడు. "నీ 'ఇష్టం' నా మీద కాదు; పట్టమహిషి పదవి మీద! నాకు తెలీదనుకున్నావా?"

"ఔను. ఒక చక్రవర్తి అర్ధాంగిగా పట్టమహిషి కావాలనుకుంటున్నాను. అది నేరమా? శౌర్య ప్రతాపాల స్థానంలో, విద్యావిజ్ఞతల స్థానంలో ఒంటి నిండా, బుర్రనిండా నక్కజిత్తులు నింపుకున్న నువ్వు చక్రవర్తి కావాలని ఉబలాటపడొచ్చేం? నేను ఆశపడటం అపరాధమైతే నువ్వు ఆశపడటం కూడా అపరాధమే! ఆలోచించు; లాలస వద్దు పొమ్మంటే ఆ తర్వాత నేను ముద్దుగా రమ్మంటాననుకోకు! ఇష్టంలేని ఆడదాన్ని బలవంతంగా పెళ్లాడాలన్న ఆరాటం నీది. ఇష్టపడని మగాణ్ణి అంటురో

## తల్లి కావాలనుందట!



*'ఆలు లేదు చూలు లేదు...కొడుకు పేరు సోమలింగం' అన్నట్టు ఉంది కంగనా వ్యవహారం అంటున్నారు బాలీవుడ్ జనాలు. 30 ఏళ్ళకి దగ్గర్లో ఉన్న కంగనాకి పిల్లల్ని కనాలన్న కోరిక ఎక్కువగా ఉందట! ఈ కోరిక ఇంతకు ముందు ఎప్పుడూ కలగలేదు. ఇప్పుడిప్పుడే కలుగుతోంది. 30 సంవత్సరాలకు దగ్గర్లో ఉన్నాను కనుక ఇలాంటి కోరిక కలుగుతోందేమో నాకు తెలియదు. కానీ త్వరలోనే తగిన వ్యక్తిని పెళ్లి చేసుకుని వెంటనే పిల్లల్ని కనేస్తానని అంటోంది. కాకపోతే చేసుకోబోయేవాడు ఏ రంగానికి చెందినవాడు అన్నది కూడా చెప్పడం లేదు. ముందు పెళ్లి చేసుకుని ఆ తరువాత పిల్లల గురించి ఆలోచించుకోమని బాలీవుడ్ జనాలు కంగనాకు సలహా ఇస్తున్నారు.*

గిని ఉంచినట్టు దూరంగా ఉంచాలన్న ఆత్మాభిమానం నాది!"

"వెళ్లవతలకి! ఎవర్రమ్మన్నారు నిన్ను?" అన్నాడు తను పళ్లు కొరుకుతూ.

"నేనే వచ్చాను. ఇది నా మేనత్తగారి గృహం! ఆమె వెళ్లమంటే గానీ వెళ్లను!" జలజ నిర్భయంగా అంది తనతో. "ఎదుగు బావా! నీ బలహీనతలన్నీ నాకు తెలుసు. అత్తగారిని చూసి అన్నింటినీ నిర్లక్ష్యం చేస్తున్నాను. రాతిస్తంభానికి చీరకట్టితే, దాని ముందు పాతుకుపోయే మగతనం నీది!" అంది జలజ కళ్లతో ఎగతాళిగా నవ్వుతూ.

కళింగరత్న పళ్లు కొరుక్కుంటూ గుర్తు చేసుకున్నాడు. జలజ జలజ కాదు; జలగ! నెత్తురు పీల్చేస్తుంది! కంసుడిలాగా దురాలోచనలు చేయొద్దంటూ ఘాటుగా హెచ్చరించింది అమ్మ. వందల ఏళ్ల కిందట ఆ యువరాజులాగా ఆత్మహత్య పేరుతో బెదిరించవద్దంది. 'నువ్వు నీ తల్లిదండ్రుల్ని చెరసాలలో బంధించలేవు;' అంది అమ్మ పరోక్షంగా. 'నువ్వు ఆత్మహత్య చేసుకున్నా బాధపడం!' అని కూడా పరోక్షంగా స్పష్టం చేసింది. కళింగరత్న రెండు చేతుల్తో తల పట్టుకుని, తన ఆసనంలో కూలబడ్డాడు. లాలస మనసును జయించమంది. అది అసంభవం అని తనకి తెలుసు. బలప్రయోగంతో మంగళసూత్ర బంధం వేయడమే తనకున్న అవకాశం. తల్లిదండ్రులు జరగనిస్తారా? చిన్న




చప్పుడుతో తెరుచుకున్న తలుపు అతడి ఆలోచనా ప్రవాహానికి అడ్డుకట్ట వేసింది. చేతుల నుండి తలకు విముక్తి కలిగించి చూశాడు. తలుపు మూసి ఉలూకుడు వస్తున్నాడు.

"యువప్రభూ.." ఆందోళనను ఒక రంగులా ముఖానికి పులుముకున్న కళింగరత్నను చూస్తూ అన్నాడతను.

"జల్లెడలో నీళ్లు పట్టుకునేంత పటిష్టంగా చేశావు కాపలా ఏర్పాట్లు!" కళింగరత్న ఉక్రోషంతో అన్నాడు.

"చిత్తం. యువప్రభువులు ఆలోచించాలి. సాక్షాత్తుగా తమరూ, నేనూ ఉన్నా జలజాదేవిగారిని నిరోధించలేమని తమకు తెలుసు.." ఉలూకుడు అన్నాడు. "అంతఃపురంలో విషయం పొక్కిందా? చెలికత్తెల చెంపలు పగలేసి అన్నీ తెలుసుకున్నారు జలజాదేవిగారు.."

కళింగరత్న బరువుగా నిట్టూర్చాడు. "అడ్డుగోడలు అంతెత్తున లేచాయి. మహారాణిగారు మండిపడ్డారు. శరీరాన్ని కాదు, మనసును పట్టుకోవాలన్నారు. యువరాణి స్వచ్ఛందంగా అంగీకరించకపోతే ఆమెనూ, నన్నూ కామరూప చక్రవర్తికి అప్పగిస్తామన్నారు.."

కళింగరత్న చెప్పిందంతా ఆందోళనతో ఆలకించాడు ఉలూకుడు. "మహారాణిగారు అలా అన్నారంటే తమరు జాగ్రత్తగా, తెలివిగా, అతి త్వరగా వ్యవహరించాలి..."

కళింగరత్న బరువుగా నిట్టూర్చాడు. "లాలసను, సాటి చక్రవర్తి కూతురిని అపహరించిన దుర్మార్గుణ్ణి ముక్కలు ముక్కలుగా నరకాలన్నారు మహారాజుగారు. మహారాణిగారూ మండిపడుతున్నారు. బలవంతంగా, రహస్యంగా వివాహం చేసుకుంటే ఇద్దరూ ఏం చేస్తారో తెలీదు! ఇంక జలజ పగ ఏం చేస్తుందో ఊహించలేం..."

"జలజాదేవిగారి సమస్య గోటితో పోయేదే, యువప్రభూ!" ఉలూకుడు తెలివిగా అన్నాడు. "మహారాణిగారి సోదరుల పుత్రిక కదా! మహారాణిగారికీ ఆమె మీద మమకారం ఉంటుంది."

"ఔను. జలజ కోడలు కావాలని అమ్మ కోరిక. నాకు తెలుసు. బాల్యం నుండీ వింటున్న కథే!"

"చిన్న సమస్య! ఎలా తుంచివేయవచ్చో ఆలకించండి. బహు భార్యత్వం ప్రభువులకు దోషం కాదు. ఆమెను ప్రథమపత్నిగా, సాహసంతో తెచ్చుకున్న కామరూప యువరాణిగారిని ద్వితీయపత్నిగా స్వీకరించండి..."

"ఉలూకా! మతిపోయిందా?"

"మనవిని పూర్తిగా ఆలకించండి. ప్రథమ పత్ని పట్టపురాణి అవుతారు. తమరు కావాలనుకున్నప్పుడు జలజాదేవిగారికి తీరని జబ్బు చేస్తుంది. పట్టపురాణిగారు పరమపదిస్తారు.."

కళింగరత్న నోరు వెళ్ళబెట్టి ఆశ్చర్యంగా చూశాడు. "నీవన్నీ ప్రమాదకరమైన, భయంకరమైన ఆలోచనలే! ఒక్కసారి మా ప్రథమపత్ని అయ్యాక జలజ ఇనుమడించిన శక్తియుక్తులతో అడ్డు తగుల్తుంది. నీకు తెలీదు. జలజను నమ్మలేం. కామరూప చక్రవర్తిని కలుసుకోగలదు. లాలసను మనం అపహరించినట్టు చెప్పగలదు సుమా!"

"అమ్మో! ప్రమాదమే! పర్యవసానం యుద్ధమే! కామరూప సైన్యం ముందు కళింగ సైన్యం ఆగదు!" ఉలూకుడు కంగారుగా అన్నాడు.

"జలజ కొంతకాలం పాటు ఇక్కడే ఉండేలా చూడాలి" కళింగరత్న సాలోచనగా అన్నాడు.

ఉలూకుడు మాట్లాడకుండా అటూ ఇటూ తిరుగుతూ ఉండిపోయాడు. కణత మీద చూపుడు వేలుతో తాళం వేస్తూ ఆలోచనలో మునిగిపోయాడు. వాతాయనం ముందు నిలుచుని తలెత్తి దేనికోసమో వెతుకుతున్నట్టు నీలాకాశంలోకి చూస్తూ ఉండిపోయాడు. తటాలున కళింగరత్న వైపు తిరిగి, రెండు చేతుల్ని చరుస్తూ ఫెళ్లున చప్పుడు చేశాడు.

"యువప్రభూ... పట్టేశాను!" ఉలూకుడు ఉద్రేకంతో అరిచాడు.

"ఏమిటి? ఎవర్ని?"

"ఉపాయం! దివ్యమైన ఉపాయం! అద్భుతమైన ఉపాయం! అపాయం లేని ఉపాయం!" ఉలూకుడు అరిచాడు.

కళింగరత్న నోరు తెరిచేలోగా, మళ్లీ తనే అన్నాడు. "మొన్న రాత్రి తమరు మధువు సేవిస్తూ, ఇప్పుడు ఆసీనులై ఉన్న ఆసనం మీదే ఆదమరిచారు, గుర్తుందిగా? కొద్దిపాటి మైకంలో మీరు కళ్లు అర మూసి గొణుగుతూ ఉండిపోయారు. గుర్తుందా, యువప్రభూ?"

"విషయం చెప్పు"

"అంతర్ధానమైన తమ పుత్రికను అన్వేషించి తెచ్చే యువకుడికి ఆమెనిచ్చి వివాహం చేసి, సామ్రాజ్యాన్ని అప్పగిస్తానని కామరూప చక్రవర్తిగారు స్వయంవర మంటపంలో ప్రకటించారన్నది మీ మైకం మాటల సారాంశం!"

కళింగరత్న ప్రశ్నార్థకంగా చూశాడు. "అయితే?"

"ఆ ప్రకటనతో స్ఫూర్తి పొందిన కళింగ యువరాజు కళింగరత్న అద్భుతమైన సాహసంతో అన్వేషించి, అపహరణకు గురి అయిన కామరూప యువరాణిని అపహర్త హస్తాల నుండీ రక్షించారు! ఆమెను క్షేమంగా ఆమె తల్లిదండ్రులకు అప్పగిస్తారు!" ఉలూకుడు ఆగి, గర్వంగా మెరిసే కళ్ళతో చూశాడు.

"ఉలూకా..." కళింగరత్న నోరు వెళ్ళబెట్టాడు. తటాలున పైకి లేచాడు. "అద్భుతం! మహాద్భుతం! అపాయం లేని ఉపాయం!"

"తప్పు తెలుసుకున్నాననీ, యువరాణిని ఆమె తల్లిదండ్రులకు అప్పగించేస్తాననీ మాతృశ్రీ మహారాణిగారికి చెప్పండి! మీ వివాహం మీ చేతుల మీద బలవంతంగా కాకుండా కామరూప చక్రవర్తిగారి అమృత హస్తాల మీదుగా వధూవరుల తల్లిదండ్రుల ఆశీస్సులతో జరుగుతుంది! జలజాదేవి ఏమీ చేయలేదు!"

కళింగరత్న తల పంకిస్తూ ఉండిపోయాడు. కళ్లు చిట్లిస్తూ ఉలూకుడి వైపు చూశాడు. "అపహర్త ఎవడు? ఎక్కడున్నాడు? అని కామరూప ప్రభువు అడిగితే?"

"ఆ మాత్రం ఆలోచించలేరా, యువప్రభూ! అన్వేషణా క్రమంలో అరణ్యమార్గంలో గుర్రం మీద తీసుకెళ్తూ మీ కంటపడ్డాడు. ద్వందయుద్ధం జరిగింది. మీ కత్తి వాడి కంఠాన్ని కత్తిరించింది! అంతే!"

"ఉలూకా! భవిష్యత్తులో మహామంత్రి నువ్వే మాకు!" కళింగరత్న ఆనందంగా నవ్వసాగాడు.

**(ఇంకా వుంది)**




# నట్స్ ఎన్ని తినాలంటే...

నట్స్ తినడం ఆరోగ్యానికి మంచిదన్న సంగతి అందరికీ తెలిసిందే! కాకపోతే రోజుకి ఎన్ని నట్స్ తీసుకోవాలన్న సంగతి చాలామందికి తెలియకపోవచ్చు. మంచిది కదా అని ఎక్కువ తినేస్తుంటారు. దీనివలన మంచి కన్నా చెడే జరుగుతుందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. పిస్తా, బాదం, వాల్‌నట్స్, జీడిపప్పుల్లో విటమిన్లు, ఖనిజలవణాలు ఎక్కువగా లభిస్తాయి. మెదడును ఆరోగ్యంగా ఉంచడానికి ఇవి ఎంతో సహాయపడతాయి. కొలెస్ట్రాల్‌ని తగ్గించే శక్తి వాల్‌నట్స్‌కి ఉంది అంటున్నారు నిపుణులు. ఇవి కేన్సర్ కారకాలను దూరంగా ఉంచడానికి సహాయపడతాయి అని చెబుతున్నారు. వీటిని రోజుకి పది గ్రాములకి మించి తీసుకోకూడదని వారు చెబుతున్నారు. పది గ్రాములంటే ఐదు వాల్‌నట్స్, పన్నెండు వేరుశనగపప్పులు, తొమ్మిది బాదం పలుకులు, ఆరు జీడిపప్పులను మాత్రమే తీసుకోవాలని, ఇలా తీసుకున్నప్పుడే అవి శరీర ఆరోగ్యాన్ని కాపాడతాయని వారు స్పష్టం చేస్తున్నారు. ఈ మోతాదులో వీటిని ప్రతిరోజూ తీసుకోవడం వలన దాదాపు 23 అనారోగ్య సమస్యలను దరి రాకుండా చూసుకోవచ్చని వారు వివరిస్తున్నారు.

# విటమిన్-డితో ఆరోగ్యం

విటమిన్-డి లోపిస్తే కలిగే పరిణామాల గురించి తెలిసిందే! ఇది కేన్సర్ రోగుల్లో లోపిస్తే వారి ప్రాణానికి ముప్పు వాటిల్లే అవకాశం ఎక్కువ అంటున్నారు పరిశోధకులు. కేన్సర్ వచ్చి తగ్గిన వారిలో విటమిన్ డి లోపిస్తే కేన్సర్ తిరిగి వచ్చే అవకాశాలు ఎక్కువ అన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. కేన్సర్ వచ్చి తగ్గిన కొంతమంది మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరికి విటమిన్-డి తగ్గకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. అంటే పాలు, పాలాధారిత ఉత్పత్తులు తరచూ ఇచ్చేవారు. రెండో గ్రూపు వారికి అలాంటి జాగ్రత్తలు ఏమీ తీసుకోలేదు. కొన్నిరోజుల అనంతరం వీరిని పరిశీలించగా, విటమిన్-డి లోపించిన వారిలో కేన్సర్ తిరిగి వచ్చిన సంకేతాలను గమనించారు. అదే పాలు, పాలాధారిత ఉత్పత్తులు తీసుకున్న వారిలో ఈ మార్పును గమనించలేదు. అందుకే విటమిన్-డి సమృద్ధిగా లభించే పాలు, పాలాధారిత ఉత్పత్తులు తగినంత తీసుకోవాలని వీరు సూచిస్తున్నారు.

# వ్యాయామంతో ఆనందం

రోజూ క్రమం తప్పని వ్యాయామం ఆరోగ్యానికి మంచిదన్న సంగతి తెలిసిందే! అయితే ఇది మానసికంగా సంతోషాన్ని కూడా కలిగిస్తుంది అంటున్నారు హార్వర్డ్ యూనివర్సిటీ పరిశోధకులు. 50 సంవత్సరాలు పైబడిన సుమారు పదివేల మంది మీద వీరు సుదీర్ఘ పరిశోధనలు నిర్వహించారు. వీరిని నాలుగు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారి చేత క్రమం తప్పకుండా వ్యాయామం చేయించారు. రెండో గ్రూపువారి చేత వారంలో రెండు రోజులు, మూడో గ్రూపు వారి చేత ఒక రోజు నాలుగవ గ్రూపు వారి చేత పదిహేనురోజులకొకసారి వ్యాయామం చేయించారు. కొన్ని నెలల అనంతరం నాలుగు గ్రూపులనూ పరిశీలించారు. మొదటి గ్రూపువారు శారీరకంగా ఆరోగ్యంగా ఉండగా, అంతకు ముందుకన్నా మానసికంగా ప్రశాంతతను, ఆనందాన్ని అనుభవించామని చెప్పారు. రెండు, మూడు గ్రూపుల వారిలో కూడా శారీరకంగా, మానసికంగా కొంత వరకూ మార్పును గమనించారు. నాల్గవ గ్రూపు వారిలో ఎలాంటి మార్పూ గమనించలేదు. 50 సంవత్సరాలకు పైబడిన వారు ప్రతి రోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేసినట్టయితే శారీరకంగా, మానసికంగా ఆరోగ్యంగా, ఆనందంగా జీవించవచ్చని పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు.



# క్యాబేజీతో వ్యాధులు పరార్!

కాయగూరలలో ఎక్కువమంది ఇష్టపడని కూర ఏది అంటే టక్కున అందరూ క్యాబేజీ పేరు చెబుతారు. దీనిని తరచూ కాకపోయినా వారంలో కనీసం ఒకటి రెండు రోజులు తినడం వలన పలు ఆరోగ్య సమస్యల నుంచి తప్పించుకోవచ్చని నిపుణులు చెబుతున్నారు. దీన్ని తీసుకోవడం వలన గుండెజబ్బులు, టైపు-2 డయాబెటీస్, అజీర్ణం, మలబద్ధకం, చర్మంపై మంట, వాపు వంటి సమస్యల నుంచి తప్పించుకోవచ్చని వారు అంటున్నారు. దీనిలో విటమిన్ సి, యాంటీ ఆక్సిడెంట్లు పుష్కలంగా లభిస్తాయి. ఇవి యాంటీ రాడికల్స్‌ను అడ్డుకుని వ్యాధుల బారిన పడకుండా చేస్తాయని వివరిస్తున్నారు. చిన్నతనం నుంచే పిల్లలకు క్యాబేజీ తినడం నేర్పించాలని తల్లిదండ్రులకు వీరు సూచిస్తున్నారు.



# మనవలతో గడిపితే దీర్ఘాయుష్షు

వృద్ధులు ఆరోగ్యంగా, ఎక్కువ కాలం జీవించాలంటే వారిని ఎక్కువసేపు మనవలు, మనవరాండ్రతో గడపనివ్వాలని బెర్లిన్ పరిశోధకులు చెబుతున్నారు. వృద్ధుల ఆరోగ్యం వారి గ్రాండ్ చిల్డ్రన్‌లోనే దాగి ఉందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు 500 మంది వృద్ధుల మీద వీరు దీర్ఘకాలం పరిశోధనలు చేశారు. వీరందరూ 60 నుంచి 75 సంవత్సరాల మధ్య వయస్సువారే! వీరిలో కొందరు తరచూ అంటే వారంలో రెండు లేదా మూడు రోజులు తమ గ్రాండ్ చిల్డ్రన్‌తో గడిపేవారు. మరి కొందరు నెలలో ఒకసారి మాత్రమే వారిని కలుసుకుని వారితో గడిపేవారు. పది సంవత్సరాల అనంతరం వీరిని పరిశీలించగా, గ్రాండ్ చిల్డ్రన్‌తో గడపనివారు ఐదు లేదా ఏడు సంవత్సరాలకే మృత్యువాత పడగా, గ్రాండ్ చిల్డ్రన్‌ని తరచూ కలుసుకుని వారితో ఎక్కువసేపు గడిపినవారు పది సంవత్సరాల కాలంలో ఆరోగ్యంగా, ఆనందంగా ఉండడం వీరు గమనించారు. గ్రాండ్ చిల్డ్రన్‌తో గడపడం వృద్ధులకు అంతులేని ఆనందాన్ని కలిగిస్తుందనీ, అదే వారిని ఆరోగ్యంగా ఉంచుతుందని పరిశోధకులు స్పష్టం చేస్తున్నారు.

-అవినాష్





# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 14

(గతవారం తరువాయి)

**పాత్రకు తగ్గట్టు నేను చెప్పిన మేనరిజం డైలాగ్ విని వర్మగారు థ్రిల్లైపోయారు.**

**వెంటనే అసిస్టెంట్లను పిలిచి ఆ డైలాగ్ రికార్డ్ చేసుకోమన్నారు.**

**వాళ్ళు వచ్చి నన్ను ఇంకోసారి చెప్ప మన్నారు. చెప్పా. వినయంగా రాసి చూపించా.**

**'ఇంతేనా సార్' అన్నారు.**

**'అంతేనయ్యా' అన్నా.**

అప్పటికే సెట్లోకి అమితాబ్ బచ్చన్ వచ్చారు. పెద్దవారుకదా, నేనే వెళ్లి పలకరించా.

'నమస్కారమండీ' అన్నా.

### అమితాబ్ సంస్కారం

అమితాబ్ నన్ను చూడగానే, 'హా.. కోటాజీ. నమస్తే. ఆప్ కైసాయేజీ' అని ఆప్యాయంగా భుజం మీద చెయ్యేశారు.

అంతకు ముందెప్పుడూ నేను ఆయన్ను చూడ లేదు. కానీ తొలి పరిచయంలోనే అమితాబ్‌పట్ల పాజిటివ్ స్పందన కలిగింది. ఆ సినిమా చేసి నన్నాళ్లూ అంతే సౌకర్యవంతంగా ఫీలయ్యా. ఇండియన్ సినిమా ఇండస్ట్రీ మొత్తం బిగ్‌బీని గౌరవిస్తుంది. అంతటి గౌరవానికి కారణం నాకు అప్పుడే అర్థ మైంది. డిసిప్లిన్, సిన్సియారిటీకి ప్రాణమిస్తారాయన. సెట్లో ఉన్నప్పుడు కూడా ఆయన పద్ధతులు, వ్యవహారం గొప్పగా ఉంటుంది. 'సర్కార్' షూటింగ్ జరుగు తుండగా ఆయన కుమారుడు అభిషేక్ మధ్యలో జాయిన్ అయ్యాడు. అతను సెట్లోకి రాగానే, వాళ్ల బ్బాయిని పిలిచి 'హి ఈజ్ మిస్టర్ కోటా శ్రీనివాస రావు. వెరీ గుడ్ ఆర్టిస్ట్. నువ్వు ఇలాంటి వారితో యాక్ట్ చేయడం నీ అదృష్టం' అని పరిచయం చేశారు. ఆ మాట విన్న వాళ్లందరూ ఆశ్చర్యపోయారు. సహ నటుణ్ణి గౌరవించడం ఆయన సంస్కారం. అమితాబ్ సంస్కారవంతుడు.

## నాగభూషణం, రావుగోపాలరావు నాలోనే ఉన్నారని ప్రశంసించారు

ఆ తర్వాత ప్రెస్‌మీట్‌లో కూడా "వర్మగారి దర్శకత్వంలో నటించడమే థ్రిల్లింగ్‌గా ఉంటుంది. అందులోనూ కోట శ్రీనివాసరావుగారితో నటించడం మరింత థ్రిల్‌గా అనిపించింది" అన్నారట. వర్మ గారు ఫోన్ చేసి మా అబ్బాయికి చెప్పారు.

'అమితాబ్ మాటలు విన్నాక మీకేమనిపించిం దండీ' అని అడిగారు ఇక్కడ మన విలేకరులు.

అందుకు సమాధానంగా "అమితాబ్‌గారు నేషనల్ స్టేచర్ దాటిన ఇంటర్నేషనల్ ఫిగర్. అంత పేరున్న నటుడితో నటించాలంటే జనరల్‌గా భయం ఉంటుంది. కానీ మా మీద కంపోజ్ చేసిన తొలి షాట్‌లోనే ఆ భయం లేకుండా నటిం చాను. ఆయన ఆశ్చర్యపోవడానికి కారణం అదే నేమో" అని చెప్పాను. అప్పట్లో చాలా పత్రికలు ఈ విషయం ప్రచురించాయి.

### రాష్ట్రపతి భవన్‌లో అమితాబ్, అభిషేక్ ప్రశంస

నాకు పద్మశ్రీ పురస్కారం వచ్చినప్పుడు రాష్ట్రపతి భవన్‌కి వెళ్లాం. ముందుగానే అక్కడికెళ్లి కూర్చున్నాం. నాతో పాటు మా పెద్ద మనవడు, పెద్ద అల్లుడు వచ్చారు. పక్కనే నా అసిస్టెంట్ కూడా ఉన్నాడు. పద్మశ్రీ వచ్చినవారిని ఒక పక్కన, ప్రధాన మంత్రిగారి పక్కనేమో పద్మభూషణ్, పద్మవిభూషణ్ వచ్చినవారినీ కూర్చోబెట్టారు. కాసేపటికి 'అమితాబ్ బచ్చన్‌గారు వచ్చారు' అని అక్కడ అందరూ చెప్పుకుంటున్నారు. అటు చూశా. అందరూ ఆయన్ని చుట్టుముట్టేశారు. సరేనని కాసేపు ఆగి ఆయన చుట్టూ జనం తగ్గిన తర్వాత వెళ్లి పలకరించా. పక్కన ఉన్న ప్రధానమంత్రి చూస్తూనే ఉన్నారు. అమితాబ్ నన్ను చూసి టక్కున కుర్చీలోనుంచి లేచి ఎదురొచ్చి కౌగలించుకుని 'హలో కోటాజీ.. హౌ ఆర్ యూ' అన్నారు. ఆయనే మరలా.

'కంగ్రాచ్యులేషన్స్. ఇప్పటికే లేటయింది. ఎప్పుడో రావాల్సింది. ఎనీవే కంగ్రాట్స్' అన్నారు.

మా మనవణ్ణి చూపించి 'మా గ్రాండ్‌సన్ సర్' అన్నా. ఆయన షేక్‌హ్యాండ్ ఇచ్చారు.

అమితాబ్‌గారి మైండ్‌లో నేను ఎంతగా గుర్తు లేకపోతే నన్ను అందరిలో అంత గౌరవంగా పలక రిస్తారూ. ఆ రోజు నామీద ఆయనకున్న అభిమా నాన్ని మరోసారి ప్రత్యక్షంగా చూశా. అవార్డుల ప్రదానోత్సవం తర్వాత అక్కడ హై టీ అరేంజ్ చేశారు.

నేనక్కడ సమోసా తినబోతుంటే అభిషేక్



బచ్చన్ ఎదురుగా నిలబడి ఉన్నాడు.

పలకరిద్దామనుకున్నా. తను అక్కడ ఎవరితోనో మాట్లాడుతున్నాడు. చూసి సరేలే తర్వాత మాట్లాడదామని అటుగా వెళ్లబోయా. అంతలో అతను నన్ను చూశాడు. అమాంతం దగ్గరకువచ్చి, 'హలో సార్' అంటూ కౌగలించుకున్నాడు. 'టూ లేట్ సార్. ఇప్పటికైనా వచ్చింది. కంగ్రాచ్యులేషన్స్ సార్' అని తండ్రి చెప్పినట్టే చెప్పాడు. పక్కనే వాళ్లమ్మగారు ఉంటే పిలిచి 'హి ఈజ్ మిస్టర్ కోటాజీ' అని పరిచయం చేశాడు. మా మనవడు ఆ సంఘటనని ఎన్నిసార్లు తల్చుకున్నాడో.

## గుమ్మడి ప్రశంస

నా నటన గురించి ఎంతమంది ప్రశంసించినప్పటికీ, గుమ్మడిగారు నన్ను తొలిసారి పలకరించి, మనసారా ఆశీర్వదించిన తీరు జీవితాంతం గుర్తుండిపోతుంది. ఓ రోజు విజయనిర్మలగారి దర్శకత్వంలో సినిమా చేస్తున్నా. కృష్ణగారు హీరో. నేను తొమ్మిది గంటలకు ఇంకో షూటింగ్‌కి వెళ్లాలి. అందుకోసం నాకు సంబంధించిన సన్నివేశాలు ముందు తీశారు. అందులో భాగంగానే గుమ్మడిగారిని, కృష్ణగారిని స్తంభాలకు కట్టేశారు. నాకు ఇచ్చిన డైలాగ్స్ చెప్పేశా. షాట్ ఓకే అయింది.

'ఏయ్. ఎవరయ్యా అక్కడ? ముందు మా కట్లు విప్పదీయండి. ఎండ చిటచిటమంటోంది' అన్నారు గుమ్మడిగారు. ఆయన మాటలు వింటూనే నేను మేకప్ తీస్తున్నా. వీపుమీద తాడుతో సర్రున చరిచినట్టైంది. గభాల్న వెనక్కి తిరిగి చూశా. ఇంకో రెండు పీకారు గుమ్మడిగారు.

'ఏంటండీ' అనబోయా. అంతలోనే ఆయన, 'నీ దుంపతెగ ఇన్నాళ్లూ ఎక్కడున్నావయ్యా అసలు. నువ్వు చేస్తుంటే నాకు నాగభూషణం, రావుగోపాలరావు గుర్తుకొస్తున్నారు. అంత పెద్ద డైలాగు గుక్క తిప్పుకోకుండా ఎంత స్పష్టంగా చెప్పావ్' అని మెచ్చుకున్నారు. గుమ్మడిగారితో పోలిస్తే నేనెక్కడ? తెలుగుభాషను ఆయన చాలా స్పష్టంగా పలుకుతారు. డైలాగ్ డిక్షన్, క్లారిటీ, ఒత్తుల్ని స్పష్టంగా పలకడం... ఇలా భాషకు సంబంధించి ఎన్నిరకాల మాటలుంటాయో అన్నిటిలోనూ ఆయన పర్ఫెక్ట్. అలాంటి వ్యక్తి మెచ్చుకునేసరికి ఆనందమేసింది.

'థాంక్యూ సార్. వస్తానండీ. ఇంకో షూటింగ్ ఉంది' అని చెప్పి ఆ రోజుకు సెలవు తీసుకున్నా.

ఆ తర్వాత చాలాసార్లు ఆయనతో కలిసి ఔట్‌డోర్ షూటింగ్‌లకు వెళ్లా. షాట్ గ్యాపుల్లో మేం కలిసి కూర్చున్న ప్రతిసారీ ఆయన 'ఎక్కడ కామా ఉండాలి? ఎక్కడ ఫుల్‌స్టాప్ ఉండాలి? ఎక్కడ ప్రశ్నార్థకం ఉండాలి?' వంటి విషయాల గురించి చెప్పేవారు. మేం ఎక్కువగా నాటకాల గురించి మాట్లాడుకునేవాళ్లం. మాధవపెద్ది వెంకట్రామయ్యగారి శిష్యుడు గుమ్మడిగారు. ఎప్పుడూ తన గురువుగారిని గుర్తుచేసుకునేవారు. ఆయన దగ్గర శిష్యరికం చేసిన కారణంగానే తెలుగుపై తనకు మంచిపట్టు వచ్చిందని చెప్పేవారు. ఎప్పుడైనా ఆయనకు నా నటన నచ్చితే 'బావుంది' అని ఏదో ఒక్కమాటలో తేల్చి చెప్పడంలాంటివి చేసేవారు కాదు. ఫోన్ చేసి 'కోటా. ఫలానా పాత్ర చూశా. ఫలానా సన్నివేశంలో బాగా చేశావ్. నువ్వు చేసిన ఫలానా అంశం బావుంది' అని వివరంగా చెప్పేవారు.





**సర్కార్ షూటింగ్ సమయంలో కోట శ్రీనివాసరావు భుజంమీద చెయ్యివేసి పలకరించారు అమితాబ్ బచ్చన్. అభిషేక్ బచ్చన్‌ను పిలిచి, హి ఈజ్ కోట, వెరీగుడ్ ఆర్టిస్ట్ అని పరిచయం చేశారు. రాష్ట్రపతి భవన్‌లో పద్మశ్రీ తీసుకోవడానికి వెళ్లినప్పుడు కూడా కౌగలించుకుని వారెంతో ఆప్యాయంగా పలకరించారు. ఒకసారి కోట రూమ్ తలుపు తట్టారు రావుగోపాలరావు. అప్పుడు ఏం జరిగింది? రావుగోపాలరావు ఏమన్నారు?**

## రావుగోపాలరావు ప్రశంస

నేను పరిశ్రమలో అడుగుపెట్టేనాటికే రావుగోపాలరావుగారు విలక్షణ నటుడిగా అత్యున్నతమైన స్థాయిలో ఉన్నారు. ఆయనతో కలిసి చాలా చిత్రాల్లో నటించినా రెండు, మూడు సన్నివేశాలు మాత్రం ఎప్పుడూ నా మనసులో పదిలంగా ఉంటాయి. రావుగోపాలరావుగారు హైదరాబాద్ షూటింగ్‌కి వస్తే ప్రశాంత్ కుటీర్‌లో బస చేసేవారు. ఆయన ఎప్పుడొచ్చినా ఫ్యామిలీతోనే వచ్చేవారు. నేను కూడా అక్కడే ఉండేవాణ్ణి. నాది రూమ్ నంబర్ నాలుగు. అది పర్మనెంట్. 'అల్లరి అల్లుడు' షూటింగ్ జరుగుతున్నప్పుడు అనుకుంటా. ఇద్దరం ప్రశాంత్ కుటీర్‌లోనే ఉన్నాం. ఆ చిత్రంలో నాగార్జునగారు హీరో. నగ్మా, మీనా హీరోయిన్లు. అందులో వాణిశ్రీగారి బ్రదర్‌గా నేను, భర్తగా రావుగోపాలరావుగారు నటించాం. ఒకరోజు షూటింగ్ అయిపోయింది. నేను కుటీర్‌కి వెళ్లా. స్నానం చేసి ఫ్రెష్ అవుదామనుకుంటున్నప్పుడు కాలింగ్ బెల్ మోగింది. ఎవరో రూమ్‌బోయ్ అనుకుని తలుపు తీశా. ఎదురుగా రావుగోపాలరావుగారు. నేనేమో తుండుగుడ్డ చుట్టుకుని ఉన్నా.

'అయ్యా కోటయ్యా.. మీతో రెండు నిమిషాలు మాట్లాడుదామని... కాలక్షేపం' అన్నారు.

'ఇప్పుడే వచ్చానండీ షూటింగ్‌నుంచి. మీరు కబురుపెడితే నేనే వచ్చేవాణ్ణి కదా' అన్నా.

'అట్టాకాదుగానీ ఫర్వాలేదు. కాసేపు మాట్లాడుకుందాం. అరగంటో, పావుగంటో కూర్చుంటాను' అని లోపలికి వచ్చారు. నేను లుంగీ కట్టుకుని వచ్చి కూర్చున్నా.

ఏవేవో విషయాలు, పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం. అరగంట, గంట దాటింది. ఆయన ఒక్క నిమిషం గంభీరంగా మారిపోయారు.

'ఏం లేదయ్యా. మా పిల్లలు నీకు ఫ్యాన్స్ అయ్యా. ఆయన నటించిన ఓ సినిమా చూడండి నాన్నా అని మూడేళ్లుగా చంపుతున్నారయ్యా నన్ను. 'ఒక్క సినిమాను చూడండి, అందులో కోటగారు ఎలా చేశారో మీకే తెలుస్తుంది' అని మరీ మరీ చెప్పారు. నా బిజీ, నా గోలలో నేను ఇన్నాళ్లూ చూడలేదు. ఇదిగో ఈ రోజు నా రూమ్‌లో నీ సినిమా వీడియో కేసెట్ వేస్తే పిల్లలు చెప్పిన మాట గుర్తొచ్చి చూశాను' అన్నారు.

అప్పట్లో రూమ్‌కి కేసెట్లు వేసేవారులెండి. రూముల్లో ఉన్న వారికి ఖాళీ ఉంటే కాలక్షేపం కోసమని ఏదో ఒక కేసెట్ వేసేవారు.

'ఇవాళే ఆ కేసెట్ చూశానయ్యా. నీకు మంచి భవిష్యత్తు ఉంది. మరలా విలన్ అనే పదానికి కొత్త ఒరవడి తెచ్చే నటుడు దొరికాడని నాకు అనిపించింది అన్నారు. నువ్వు డైలాగ్ చెబుతుంటే ఫైర్ ఇంజన్ గణగణగణమని గంట కొట్టినట్టు ఉంటుంది' అని ప్రశంసించారు.

'ఏ సినిమా సార్ అది' అన్నా.

'శత్రువు' అన్నారు. నేను వెంటనే సమాధానంగా

'నా గొప్పతనం ఏమీ లేదండీ. బాటిల్‌లో వైన్ పాతదే. కానీ షేప్ కొత్తది. వైన్ మీదేనండీ. కాకపోతే బాటిల్ షేప్ నా రూపంలో ఉందండీ. మీలాగే చేశాను' అన్నా.

అందుకాయన కాస్త దగ్గరగా జరిగి, 'చూడు కోటయ్యా. రావుగోపాలరావులో ఒక్క రావుగోపాలరావు మాత్రమే ఉన్నాడు. నాగభూషణంగారు నటిస్తే ఆయనే కనిపిస్తారు. కానీ నువ్వు వేషం చేస్తే ఆ వేషంలో నాగభూషణం, రావుగోపాలరావు ఉన్నారు. అంతేకాదు మాతోపాటు కోట శ్రీనివాసరావు ప్రత్యేకత కూడా కనిపిస్తోంది. చక్కటి భవిష్యత్తు ఉన్న నటుడివి. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి' అన్నారు. నేను రెండు చేతులెత్తి నమస్కారం చేస్తూ ఆయనవైపు అలాగే చూస్తూ కూర్చున్నా.

'సర్లేవయ్యా. ఫ్రెష్ అయి రెస్ట్ తీసుకో. రేపు ఉదయం కలుద్దాం' అని తన రూమ్‌కి వెళ్లిపోయారు.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

**‘ఏంటమ్మా సడన్‌గా ఏమైంది? మనం అనుకున్న నార్త్ టూర్‌కి నాన్నగారు ఎందుకు రానంటున్నారు?’ తల్లి యశోదను అడిగాడు విశాల్.**

**ఏముందీ, మనం ఎప్పుడు ఏ ప్రోగ్రాం వేసుకున్నా సరిగ్గా అదే టైముకి శాపంలా ఆఫీసులో ఏదో పని పడుతుంది మీ నాన్నగారికి. ఇప్పుడు కూడా ప్రైమ్ మినిస్టర్ ప్రోగ్రాం ఉందిట. అందుకే రానంటున్నారు’ భర్తవంక చూస్తూ అదోలా అంది యశోద.**

అబ్బా యశోదా... వాడంటే కుర్రవాడు. అన్నీ తెలిసిన నువ్వు కూడా నన్నే తప్పు పట్టడం ఏం బాగాలేదు. పిఎమ్ వస్తే ముఖ్యమైన ఆఫీసర్ని నేను ఉండకపోతే ఎలా? మిమ్మల్ని వెళ్లమంటున్నాను కదా! నాకోసం మీరు ప్రోగ్రాం మానుకోవద్దు. పైగా ట్రావెల్ ఏజంట్ అన్ని ఏర్పాట్లు చేసేశాడు కూడాను. ఇప్పుడు మనం క్యాన్సిల్ చేసుకున్నాగానీ డబ్బు వాపసు ఇవ్వడు. కాబట్టి మీరు మా అమ్మానాన్నల్ని తీసుకెళ్లండి. పాపం మన నార్త్‌టూర్ గురించి చెప్పినప్పటినుండి అమ్మా నాన్న రోజులు లెక్కపెడుతూ ఎదురుచూస్తున్నారు. వాళ్లకు ఇదొక అరుదైన అవకాశం’ యశోదకు నచ్చచెబుతూ అన్నాడు శ్రీధర్.

అదేంటి నాన్నగారు, అందరూ సరదాగా వెళితే బాగుంటుంది కాని, ఇలా ఎవరిమటుకు వారే అయితే ఏం బాగుంటుంది అన్నాడు విశాల్.

నిజమేరా, నేనూ అదే ఆశ పడ్డాను. మనమొకటి తలిస్తే ఆ భగవంతుడు ఇంకొకటి తలచాడు. ఈ ప్రోగ్రాం కోసమే అమెరికా నుండి వచ్చావు. ఇప్పుడు కాదనుకుంటే మరలా నీకు కుదురుతుందో లేదో. ఈసారికి మీరందరూ వెళ్లండి’ కొడుకుతో అన్నాడు శ్రీధర్.

బావుందండీ, మీరు లేకుండా మేము మాత్రమే వెళితే ఏం బాగుంటుంది. పోనీలెండి మనవడితో అత్తా మావయ్యలు వెళతారు. కావలిస్తే మీరన్నట్లు మనం తర్వాతైన వెళ్లొచ్చు’ అంది యశోద.

ఒరేయ్ మా కోసం మీరు ఇబ్బందులు పడొద్దు. ఎప్పటి నుండో అనుకుంటున్న ఋషికేశ్, హరిద్వార్‌లు మీతో సరదాగా చూడొచ్చు అనుకున్నాం. ఏంచేస్తాం, మాకా అదృష్టం లేదు’ అక్కడే ఉన్న శ్రీధర్ తండ్రి బాధగా అనడంతో ‘అయ్యయ్యో తాతగారూ బాధపడకండి. నేను అన్నీ దగ్గరుండి మరీ చూపిస్తాను. ఏం చేస్తాం అందరం కలిసి ఎంజాయ్ చేసే యోగం లేదు’ అన్నాడు విశాల్. తాతయ్యా మామ్మలతో



# తొలి చూపులోనే..

**-ఎ.ప్రసాద్**



నార్త్ టూర్ బయలుదేరాడు.

•••

ఢిల్లీ కరోల్‌భాగ్‌లో సదరన్ ట్రావెల్స్‌కి ఉదయం ఎనిమిదిగంటలకు చేరుకున్నాడు విశాల్. అక్కడ ఉన్న వారిలో చాలామంది నడివయస్కులు, పెద్ద వాళ్లే. టూర్ వివరాలు తెలుగు, తమిళం, కన్నడ భాషల్లో చెబుతున్నాడు గైడ్. ఆ ప్రకారం ముందు ఢిల్లీ, ఆగ్రా, మధురా బృందావనం, ఆపై హరిద్వార్, ఋషికేశ్ చూపించి తిరిగి ఢిల్లీకి తీసుకు వస్తాడు. ఎనిమిది రోజులు టూర్. అందరూ వెళ్లి బస్సులో కూర్చుంటే మనటూర్ ప్రారంభ మౌతుందని గైడ్ చెప్పడంతో ఒక్కరొక్కరే వచ్చి బస్సులో కూర్చున్నారు.

•••

'అమ్మా సంజనా, నా షుగర్‌మాత్ర ఇస్తే వేసుకుంటాను' ఎవరో పెద్దాయన మాటకు బదులుగా, 'ఆ వస్తున్నా తాతయ్యా' అనే కోమలమైన కంఠం వినిపించింది విశాల్‌కి. 'ఎవరిదా కోకిల స్వరం' అనుకుంటూ వెనక్కు చూస్తే, మెరుపుతీగ లాంటి అందమైన అమ్మాయి! నోట మాటరాని వాడిలా ఉండిపోయాడు ఆమెనుచూసి.

సంజన అచ్చు బాపూబొమ్మలా, నాజూగ్గా పెద్దపెద్ద చక్రాల్లాంటికళ్లతో చూడముచ్చటగా ఉంది. ఆమె ఎదమీద కప్పుకున్న చుడీదార్‌లో నుండి ఆమె 'కన్నె వయసు' అందాలు దాచినా దాగడం లేదు. ఎదమీది ఓణీ మాటిమాటికి పక్కకు జరగడంతో ఆమె 'కుచద్వయం' కను విందులు చేస్తూ అతడి కళ్లకు ఆమె ఒక 'కుండో ద్వీ'లా కనిపించింది.

'తాతగారు ఇదిగో మీ మందులు' అంటూ సంజన తన పక్కనుండి రాసుకుంటూ వెళ్లడంతో విశాల్ ఒంట్లో వేయి వోల్టుల విద్యుత్ ప్రవహించింది. అబ్బా! ఎంత బావుంది సంజన! వెన్నెలంత నిర్మలంగా, హాయిగా ఉంది ఆమె నవ్వు. కోమలమైన ఆమె చేతిగాజులు, కాళ్లకు ఘల్లు ఘల్లుమనే మువ్వలపట్టీల సవ్వడులతో విశాల్ గుండె లయతప్పింది. ఇప్పుడు సంజన అతని కళ్లకు ఎడారిలో 'ఒయాసిస్సు'లా కనిపించడంతో అతనిలో ఎక్కడలేని ఉత్సాహం తన్నుకు వచ్చింది.

•••

ఢిల్లీలో ముఖ్యమైన ప్రాంతాలన్నీ సందర్శించిన వారి బస్సు సాయంత్రానికి ఆగ్రా చేరుకుంది. మర్నాడు తాజ్‌మహల్ సందర్శన. ఆ రాత్రికి మధుర బృందావనానికి ప్రయాణం. ఆగ్రాలో గైడ్ ఏర్పాటుచేసిన బసకు వాళ్లందరు చేరుకున్నారు.



తడిసిన ఆమె అందాలు అతడికి మత్తెక్కించాయి. ఆమెను గట్టిగా వాటేసుకున్నాడు. ఆమె అతడికి అధరామృతాన్ని అందించింది. ఆమె నాభిపై అతడు ముద్దుపెట్టాడు. ఆమె నరాలు జివ్వు మన్నాయి.

సాయంత్రం చిరుచీకట్లు కమ్ముకుంటున్న వేళ.. బైట చల్లగాలి వీస్తోంది. 'తాతగారు పదండి తాజ్‌మహల్ చూసివద్దాం' అన్నాడు విశాల్. 'నాయనా ఇప్పుడొద్దు, రోజంతా తిరిగి బాగా అలసిపోయాం, కాస్త రెస్టు తీసుకుంటాం. రేపు ఎలాగూ చూస్తాం కదా, కావలిస్తే నువ్వు వెళ్లు' అంటూ గ్రీన్‌సిగ్నల్ ఇవ్వడంతో, 'సరే తాతగారు' అంటూ ఆ వెన్నెలలో తాజ్‌మహల్ అందాలు తిలకించేందుకు ఒంటరిగానే బయలుదేరాడు విశాల్. అప్పుడే రూములో నుండి బైటకు వస్తోంది సంజన. కళ్లతోనే ఆమెను పలుకరించాడు. 'మీరూ తాజ్‌మహల్ చూసేందుకే వెళ్తున్నారా?' నవ్వుతూ అడిగాడు.

అవునండి, మా మమ్మీవాళ్లు రానన్నారు. అందుకే ఒంటరిగా బయలుదేరా. ఈ వెన్నెల్లో తాజ్‌మహల్ ఎంతో అందంగా ఉంటుంది కదా! అందుకే ఆ అవకాశం మిస్ కాకూడదని బయలుదేరా. మరి మీరు?' తిరిగి నవ్వుతూ అడిగింది సంజన.

నేనూ తాజ్‌మహల్ చూడ్డానికే. తాజ్‌మహల్ పగటిపూటకంటే రాత్రే చూడ్డానికి బాగుంటుంది' అని ఆమెతో పాటు బయలుదేరాడు.

•••

తొలి పరువపు అందాలు ఓవైపు, యమునా తీరాన తాజ్‌మహల్ అందాలు మరోవైపు, చెంతనే మనసుకు నచ్చిన అమ్మాయి! తన ఒంపుసొంపులతో ఊరిస్తోంది సంజన. ఆమెను చూస్తున్నకొద్దీ అతడిలో నిగ్రహం లోపిస్తోంది. ఎవరూలేని ఏకాంతం, మనసులో మాట చెప్పాలనే తహతహ క్షణక్షణానికీ పెరుగుతోంది. అయితే ఏదో తెలియనిభయం. విశాల్ మనసు మనసులో లేదు. సంజనను చూసినదగ్గర నుండి ఆమె అంటే చెప్పలేనంత ఇష్టం ఏర్పడింది. తొలి చూపులోనే తెగ నచ్చేసింది సంజన. అతనిలో తొలిప్రేమ చిగురించింది.

ప్రేమకు ప్రతిరూపం తాజ్‌మహల్. ఆ అందాలు వారిని మంత్రముగ్ధుల్ని చేశాయి. తెల్లని పాల రాతి తాజ్‌మహల్ ప్రతిబింబం యమునానదిలో కనువిందు చేస్తోంది.

నదీ తీరానికి చేరుకుని అక్కడే బెంచీమీద

కూర్చున్నారు ఇద్దరూ. చంద్రుని కిరణాలు నది మీద పడుతూ వింత కాంతులు విరజిమ్ము తున్నాయి. తాజ్‌మహల్‌ని తన్మయత్వంతో చూస్తోంది సంజన. ఆమెతో మళ్లీ మాట కలుపుతూ, 'అవును సంజనగారు తాజ్‌మహల్ చూడ్డం ఇదే మొదటి సారా?' అడిగాడు విశాల్.

'ఔనండి. ఇంతకుముందు ఎప్పుడైనా మీరు ఇక్కడికి వచ్చారా?' అడిగింది సంజన.

లేదండి. ఇంత అద్భుతమైన చోటుకి రావడం ఇదే మొదటిసారి, ఆమె ఎదకేసి చూస్తూ అన్నాడు విశాల్.

అతని చూపులు ఆమె ఒంటిని ఎక్కడెక్కడో తడుముతున్నాయి. సంజన సిగ్గుపడింది. మనసు లోనే నవ్వుకుంది. 'అబ్బా ఈ వెన్నెల్లో తాజ్ మహల్ ఎంతబాగుందో కదా. ఇది ప్రేమకు ప్రతిరూపం అంటే ఏమో అనుకున్నానుగానీ, అది నిజమని ఇప్పుడు తెలుస్తోంది. ఓ ప్రియుడు ప్రేయసికి ఇచ్చిన ఓ గొప్పకానుక' నవ్వుతూ అంది సంజన. ఆమె కళ్లల్లో ఏదో చిలిపితనం కని పించింది విశాల్‌కి. మీకు ప్రేమంటే నమ్మక ముందా? సడన్‌గా అడిగాడు. 'ప్రేమిస్తే తప్పే ముంది?' నవ్వుతూ ప్రశ్నించింది సంజన.

నిజమేననుకోండి. అయితే మీరు ఎవరినైనా ప్రేమించారా? ధైర్యంగా అడిగేశాడు విశాల్.

'లేదు, మరి మీరో!'

'ఇంతవరకు లేదు'

'ఇంతవరకులేదు అంటే ఇప్పుడు ఎవరినైనా ప్రేమిస్తున్నారా?' కొంటెగా అడిగింది.

'మిమ్మల్నే' అందామనుకుని, 'నా ఉద్దేశం అదికాదు. అయినా మనసుకు నచ్చిన మీలాంటి అందమైన అమ్మాయి దొరకాలి కదా' ఎటో చూస్తూ మెల్లగా అన్నాడు విశాల్.

ఏమన్నారు?' రెట్టించి అడిగింది సంజన.

'అబ్బే ఏం లేదు. పదండి అలా పడవలో తిరిగి వద్దాం' అన్నాడు. 'సరే' అంటూ బయలుదేరింది సంజన.

'ఆహా! ఇలా పండువెన్నెల్లో మీతో పడవ ప్రయాణం ఎంతో ఆనందంగా ఉంది' అన్నాడు విశాల్. 'నిజమేనండి నేను ఎప్పుడూ ఇంత ఆనందం పొంద లేదు' అంది సంజన.

మరికొంతసేపు నదిలో విహరించి తిరిగి ఒడ్డుకి చేరుకున్నారు. పడవ లోంచి దిగుతున్నప్పుడు ఆమెకు తన చేయి అందించి మెల్లగా కిందకు దించుతున్నప్పుడు తూలిన ఆమెను ఒడుపుగా పట్టుకుని తన గుండె లకు ప్రేమగా హత్తుకున్నాడు. మనసులోనే ముసిముసిగా నవ్వు కుంది సంజన.

'ఈ తాజ్‌మహల్ చాలా అందంగా ఉందికదూ' విశాల్ పక్కనే నడుస్తూ అడిగింది. సంజనగారూ, మీకు తాజ్ మహల్ నచ్చింది, నాకు మీరు నచ్చారు, 'ఐ లవ్యూ' అన్నాడు సడన్‌గా. విశాల్ వైపు ఆశ్చర్యంగా చూసింది సంజన. ఇద్దరి మధ్య 'మౌనం' కొంతసేపు రాజ్యమేలింది. నేను ఆవే శంలో చెప్పలేదు. మనస్ఫూర్తిగానే మిమ్మల్ని ఇష్ట పడుతున్నాను. తీరుబడిగా ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి అని ఆమెతోపాటుగా హోటల్‌కి చేరుకు న్నాడు. 'విశాల్ ఎంత వేగంగా నిర్ణయం తీసుకు న్నాడు!' అనుకుంటూ రాత్రంతా అతడి గురించే ఆలోచించింది సంజన.

●●●

మర్నాడు తాజ్‌మహల్‌చూసి సాయంత్రం బృందావనానికి బయలుదేరారు అంతా.

విశాల్, సంజన బస్సులో పక్కపక్కనే కూర్చు న్నారు! ఆ అవకాశం చిక్కింది విశాల్ వాళ్ల మామ్మగారివల్లే. కొద్దిసేపటి క్రితం అసలు ఏం జరిగిందంటే...

అమ్మా సంజనా, నేను మీ అమ్మగారు మంచి స్నేహితులమైపోయాం. అలాగే మీ నాన్నగారు మా వారు చాలా చక్కగా కలిసిపోయారు. ఇంక కలవాల్సింది మీ ఇద్దరే. నేను, మీ అమ్మగారు ఓ సీట్లో కూర్చుంటాం. అలాగే మగవాళ్లిద్దరూ ఇంకో సీట్లో కూర్చుని చక్కగా కబుర్లు చెప్పు కుంటారు. కాబట్టి నువ్వెళ్లి నా మనవడి పక్కన కూర్చో. ఏ మాత్రం సిగ్గుపడకు' నవ్వుతూ చెప్పింది విశాల్ నాన్నమ్మ. ఇంకా అక్కడే సందేహంగా నించున్న సంజనతో 'అమ్మా, పెద్దవాళ్లు చెప్పిన మాట వినాలి' అని సంజన అమ్మగారు అనడంతో 'ఛ... ఏంటి వీళ్లు పెళ్లికాని అబ్బాయి పక్కన కూర్చోమంటారు. అసలే ఆ విశాల్ చేతులు తిన్నగా ఉండవు. ఇంక చూపుల సంగతి సరేసరి. బాడీని మొత్తం స్కాన్ చేసేస్తాడు. భగవంతుడా ఇప్పుడు ఏది దారి' అనుకుని గత్యంతరంలేక వెళ్లి మౌనంగా విశాల్ పక్కన కూర్చుంది. సంజన అమ్మగారు, విశాల్ మామ్మగారు కళ్లతోనే నవ్వు కుంటూ ఎవరూ చూడకుండా ఒకరికొకరు ఆనం దంతో షేక్ హ్యాండ్ ఇచ్చుకున్నారు.

●●●

'ఏంటి సంజనా, నా పక్కన కూర్చున్నావ్' నవ్వుతూ మెల్లిగా అడిగాడు విశాల్.

'ఆహా....! ఏం తెలియనట్లు నటించకండి. అసలు ఇదంతా మీ మామ్మగారివల్లే! నిజం



## కృతి కచ్చ ఎవరిమీద?

మొన్నామధ్య కుటుంబ నేపథ్యం ఉన్న హీరోయిన్లకే అవకాశాలు దక్కుతున్నాయంటూ కృతీసనన్ తోటి హీరోయిన్ల మీద నోరు పారేసుకుంది. కృతికి స్టార్ హీరోలతో చేసే అవకాశాలు అంతంత మాత్రంగానే వస్తున్నాయి. బాలీవుడ్‌లో స్టార్ హీరోల సరసన ఛాన్స్ అంటే అంత త్వరగా రాదు. బోలెడంత 'టాలెంట్' ఉండాలి. అన్ని రకాల టాలెంట్ చూపించగలిగితేనే స్టార్ హీరోలతో చేసే అవకాశం దక్కుతుంది. స్టార్ హీరోలతో చేయాలంటే ఇంత కథ ఉంటుంది. ఇదంతా చూపించకుండా తనకు అవకాశాలు రాకపోవడానికి కుటుంబ నేపథ్యం లేకపోవడమే అనడం సరికాదు అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఐశ్వర్యారాయ్, దీపికా, ప్రియాంకా, అనుష్క లాంటి స్టార్ హీరోయిన్లకు ఎలాంటి కుటుంబ నేపథ్యమూ లేదు. అయినా వారందరూ స్వశక్తితో పైకొచ్చినవారే! వారిని మరిచిపోయి కొందరు హీరోయిన్లను కృతి టార్గెట్ చేయడం ఏమిటి? అని కూడా అంటున్నారు.

చెప్పండి, కావాలనే ఇదంతా చేశారు కదూ' చిరు కోపంతో అడిగింది సంజన.

'అయ్యయ్యో... మధ్యలో మా మామ్మేం చేసింది' అమాయకంగా అన్నాడు.

'నిజం చెప్పండి. మీరు మీ మామ్మగారితో నా గురించి ఏం చెప్పారు' అతని తొడగిల్లుతూ అడిగింది సంజన. ఒట్టు అమ్మతోడు నేనేం చెప్ప లేదు, ఆమె చేతిని గట్టిగా పట్టుకుంటూ అన్నాడు విశాల్. మరి లేకపోతే, సడన్‌గా మీ మామ్మ గారికి నన్ను మీ పక్కన కూర్చోమనాల్సిన అవ సరం ఏమొచ్చింది? మీరు నా గురించి ఆమెకు ఏదో చెప్పే ఉంటారు. అందుకే ఆ పెద్దావిడ తెలి విగా ఇలా చేసింది. ఇదంతా మీరందరూ కలసి ఆడుతున్న నాటకం. అయినా ప్రేమన్నది మన సులో దాచుకోవాలిగాని ఇలా పది మందిలో చెప్పుకోరు' ఉడుకుమోత్తనంగా అంది సంజన. ఆమెవైపు ఆనందంగా చూసిన విశాల్ 'ఏంటి ఏమన్నారు, మళ్లీ చెప్పండి' అనడిగాడు. 'గోల్డెన్ వర్డ్స్ ఆర్ నాట్ రిపీటెడ్' అతని చేతిని తన చేతి లోకి తీసుకుంటూ ఎవరూ చూడకుండా మెల్లగా ముద్దాడింది సంజన.

'థాంక్యూ సంజనా, నువ్వు ఎలా రియాక్ట్ అవుతావోనని ఎంతో భయపడ్డాను. సో.. ఐయామ్ వెరీవెరీ లక్కీ.. నీలాంటి అందమైన అమ్మాయి నా ప్రేమను ఒప్పుకుంది.... థాంక్యూ వెరీమచ్' ఆమె చేతిని నొక్కుతూ ప్రేమగా అన్నాడు విశాల్.

ప్రేమ ఎప్పుడు ఎలా మొదలౌతుందో ఎవ రికీ తెలియదు. పైగా మీరు యమునమ్మ తల్లి సాక్షిగా తాజ్‌మహల్ చెంత నాకు 'ఐ లవ్యూ' చెప్పారు. నిజంగా అంత అద్భుతమైన ఒక రొమాంటిక్ ప్రదేశంలో అలా మీ ప్రేమను వ్యక్తం చేయడం నాకు ఎంతోబాగా నచ్చింది. రాత్రంతా ఆలోచించాను. అవును... ఇంతకీ మామ్మగారిని, ఆమెతో పాటు మా వాళ్లని ఏంచెప్పి బుట్టలో పడేశారు?' అతని భుజం మీద తల ఆనుస్తూ అడిగింది సంజన.

అదే నాకూ అర్థం కావడం లేదు. నాకు నేనుగా వాళ్లకు నీ గురించి గాని, నా ప్రేమ గురించి గాని ఏమీ చెప్పలేదు. అయితే ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా చెప్పగలను మన దొంగచూపులు, మనిద్దరం నిన్నరాత్రి తాజ్ మహల్ దగ్గరకు వెళ్లడం ఇవన్నీ మా మామ్మ పసిగట్టే ఉంటుంది. మా మామ్మ చాలా ఘటికు రాలు. ఎంతో తెలివైంది. ఆవులిస్తే పేగులు లెక్క బెట్టే రకం. ఆవిడకు కొత్తగాని, మొహమాటం గాని ఏమీ ఉండవు. ఆవిడే మీ అమ్మగారితో మాట్లాడి ఉంటుంది. ఏమైతేనే కాగల కార్యాన్ని గంధర్వులే నెరవేర్చారు అన్నట్లు, మా మామ్మకు మనం జీవితాంతం ఋణపడి ఉండాలి' అన్నాడు విశాల్ ఆమె నడుం చుట్టూ చేతులు వేస్తూ. ఇంకా దగ్గరకు జరిగి అతడి ఒడిలో తలపెట్టి పడు కుంది సంజన. లైన్ క్లియరైపోవడంతో చిలిపి చేతులు ఆమె పరువాలతో ఆట ప్రారంభించాయి. ఆ తొలి స్పర్శకు పులకించిపోయింది సంజన.

బృందావనంలోని అందమైన ప్రదేశాలు చూసి వారందరూ హరిద్వార్, ఋషికేశ్ బయలు దేరారు. బృందావనంలో సంజన వాళ్ల నాన్న గారు కాలుజారి పడిపోయారు. ఆయన కాలు బెణికింది. ఆ సమయంలో విశాల్ ఎంతో చొరవ చూపించి ఆయనకు సేవలు చేశాడు. అదిచూసి మనసులోనే ఆనందపడింది సంజన తల్లి. 'నిజంగా ఇతనికి పెద్దవాళ్లంటే చాలా గౌరవం. తన తాత, మామ్మలకు ఏ మాత్రం ఇబ్బంది కలగకుండా అతనే స్వయంగా దగ్గరుండి వాళ్ల బాగోగులు చూసుకుంటున్నాడు, మా సంజన చాలా అదృష్టవంతురాలు. రేప్పొద్దున్న పెళ్లైన తర్వాత విశాల్ తన భార్యను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. 'పెళ్లిళ్లు స్వర్గంలో ఏనాడో జరిగి పోతాయంటారు. ఇప్పుడు ఈ ట్రిప్పు మన సంజన పెళ్లి కోసమే అన్నట్లుగా ఉంది. మామ్మగారితో పరిచయం, అది బంధుత్వంగా మారడం అంతా ఏదో కలలాగా ఉంది. అబ్బా వాళ్లిద్దరూ పక్క పక్కనే కూర్చుంటే ఎంత బావున్నారో. వాళ్లకు మన దిష్టే తగిలేలా ఉంది' అనుకుంది ఆమె. అదే విషయం భర్తతో ఎంతో ఆనందంగా చెప్పింది.

•••

హరిద్వార్ పవిత్ర గంగానదిలో స్నానం చేసిన వారందరూ అక్కడ ఉన్న మాయాదేవి గుడి, మానసాదేవిగుడి, వైష్ణోదేవిగుడి, పావన్‌ధామ్, విష్ణుఘాట్లు ఎంతో భక్తిశ్రద్ధలతో దర్శించుకున్నారు. అక్కడి ఆలయాలు దర్శనం చేసుకుంటున్నప్పుడు అందరికన్నా వెనకగా ఉన్న సంజన, విశాల్ చేయిచేయి పట్టుకుని ప్రదక్షిణలు చేస్తూ ఏ ఆటంకమూ లేకుండా తమ పెళ్లి జరిగేలా చూడ మని నిండు మనసుతో ఆ దేవుళ్లను ప్రార్థించారు.

అనుకోకుండా వాళ్ల బస్సు రిపేరైంది. ఇక ఋషికేశ్ బయల్దేరేది మర్నాడే. ఈలోపు దగ్గరలో ఉన్న మస్సూరి చూడదలుచుకున్నవారు వెళ్లి రావొచ్చునని గైడ్ చెప్పడంతో విశాల్, సంజన ఇద్దరూ క్యాబ్‌లో మస్సూరి బయలుదేరారు.

చుట్టూ పచ్చనిచెట్లు, పంట పొలాలు చూసి ఎంతో పరవశించిపోయారు వాళ్లిద్దరు. మస్సూ రిలో 'కెమ్టీ ఫాల్స్' దగ్గరకువెళ్లి ఆ జలపాతంలో తడిసి ముద్దయ్యారు. ఆమె తడిసిన అందాలను కన్నార్పకుండా చూస్తున్నాడు విశాల్. 'ఏమిటా చూపు? సిగ్గులేదు' కొంటెగా అడిగింది సంజన. 'సిగ్గెందుకు, ఇక జాగెందుకు' అంటూ సంజనను కొండచాటున గట్టిగా వాటేసుకున్నాడు. తడిసిన ఆమె ఎద పొంగులు అతణ్ణి మత్తెక్కించాయి. ఆ స్పర్శను తట్టుకోలేని సంజన మొదటిసారిగా తన 'కన్నెతీపి అధరామృతాన్ని అతనికి అందించింది. అతని పెదవులను తన పెదవులతో బంధిం చింది. ఆమె సన్నటి నడుముని మెత్తగా నొక్కుతూ, పొట్టమీద ముత్యంలా మెరుస్తున్న నీటి బిందు వుని నాలుకతో స్పృశించి నాభిమీద ముద్దు పెట్టాడు. ఒక్కసారిగా ఆమె నరాలు జివ్వుమ న్నాయి. పురుష స్పర్శకు పురివిప్పిన నెమలిలా ఏదో తెలియని పులకింతకు లోనైంది. మునివేళ్ల మీద పైకిలేచిన సంజన తేనెలూరే అధరాలను తన అధరాలతో మళ్లీ బంధించాడు. ఆ తీయని బాధ తట్టుకోలేక ఆమె అతన్ని ఇంకా గాఢంగా




మహిళల అలంకరణల్లో హైహీల్స్ కూడా ఒకటి. చాలామంది పొట్టిగా ఉన్న మహిళలు తాము పొడుగ్గా కనబడడం కోసం హైహీల్స్ వేసు కుంటారు. అయితే ఎత్తుగా ఉండే పాదరక్షల (హైహీల్స్) వాడే మహిళలలో దాంపత్య సుఖం మెరుగ్గా ఉందని కొన్ని అధ్యయనాలు వెల్లడిస్తు న్నాయి. హైహీల్స్ వేసుకుంటే అమ్మాయిల పొత్తి కడుపులో ఉండే, శృంగార కోరికలను ఉత్తేజపరిచే

## హీల్స్‌తో శృంగార పట్టు

కండరాలలో మార్పులు చోటు చేసుకుంటాయి. దాని వల్ల దాంపత్య సుఖం మెరుగుపడుతుందని ఈ అధ్యయనాలు తెలియజేస్తున్నాయి.

ఈ అంశంపై ఇటలీకి చెందిన డాక్టర్ మరియా సెరోట్టో పరిశోధనలు జరిపింది. ఆమె పరిశోధనల ప్రకారం హీల్స్ వాడడం వల్ల మహిళలకు ఎలాంటి అనారోగ్య సమస్యలూ తలెత్తవని ఆమె పేర్కొంది.



అంతేకాదు హీల్ వాడడం వల్ల నడుమునొప్పి, వెన్నునొప్పి వంటి సమస్యలు వస్తాయని కొందరు నిపుణులు పేర్కొంటున్న సమయంలో తన అధ్య యనంలో వేరే విధంగా ఆమె పేర్కొనడం గమనార్హం.

ఈ పరిశోధన కోసం ఆమె 66 మంది మహిళ లను ఎంచుకున్నారు. వారందరికీ 15 డిగ్రీల కోణంలో రెండు అంగుళాల ఎత్తుగల పాదరక్షలను వాడ మని చెప్పారు. హీల్స్ వాడిన మహిళలలో కండరాల పట్టు, సాధారణ పాదరక్షలు వాడే మహిళల్లో కంటే ఎక్కువగా ఉన్నట్టు గుర్తించారు. అంతేకాకుండా మహిళలకు వయస్సు మళ్లే కొద్దీ ఈ కండరాలు పట్టు కాస్త సడలి వదులుగా తయారవుతాయి. తద్వారా సెక్స్ అసంతృప్తి చోటు చేసుకుంటుందన్నారు. యోని కండరాల పట్టును కాపాడుకోవడానికి ప్రతిరోజూ వ్యాయామం చేయడం అవసరం అయితే వీటిని చేయడం అందరికీ వీలుపడదు. అందుచేత హీల్స్ వాడకం మంచిదని తద్వారా కండరాలు పట్టు సడలి పోకుండా ఉంటాయని ఆమె ఈ అధ్యయనంలో వెల్లడించారు. హీల్స్ వాడని వారితో పోలిస్తే, వేసు కునే వారిలో శృంగార జీవితం బాగుందని ఈ అధ్యయనం ద్వారా వెల్లడైంది.

తన ఎదకు హత్తుకుని రెచ్చగొట్టింది. అంతలో 'అరె.. ఆప్ లోగ్ ఆగే మత్ బడో' (మీరు ఇంక ముందుకు వెళ్లకండి ప్రమాదం..') కొండ చివరకు చేరుకున్న వాళ్లను ఉద్దేశిస్తూ ఎవరో హిందీలో అనడంతో సిగ్గుపడ్డారు ఇద్దరూ. ఒకరినుండి మరొకరు అసహనంగా విడివడ్డారు. ఆ చుట్టుపక్కల అందమైన ప్రదేశాలుచూసి సాయంత్రానికి తిరిగి హరిద్వార్ చేరుకున్నారు.

•••

హరిద్వార్ నుండి ఋషికేశ్ వెళ్తున్న దారంతా చిన్నచిన్న కాలువలు, పచ్చని చెట్లు, ఎత్తైన చెరకు తోటలతో ఎంతో అందంగా ఉంది. సంజన, విశాల్ పక్కపక్కనే కూర్చుని రమణీయమైన ప్రకృతి అందాలను ఆస్వాదిస్తున్నారు.

'అవును నిన్న ఆ ఫాల్స్ దగ్గర సిగ్గులేకుండా ఏంటా కొంటె వేషాలు. సమయానికి అతనెవరో వారించాడు. లేకపోతే ఏమయ్యేది?' విశాల్ కళ్లల్లోకి చూస్తూ అంది సంజన.

ఏమయ్యేది మరికాస్త ముందుకు వెళ్లేవాళ్లం. ఎంతైనా వయసులో ఉన్నవాళ్లం, ఏమంటావు' ఆమె నడుం మడతల్లోకి వేళ్లు పోనిస్తూ కితకితలు పెడుతూ అన్నాడు.




'ఇంకా ముందుకు వెళితే ప్రమాదం కాదూ' కొండకు చివరకు చేరిన దృశ్యాన్ని తల్చుకుంటూ అంది సంజన. నిజమే సంజనా అతనెవరోగానీ ఆపద్బాంధవుడిలా మనల్ని కాపాడాడు. లేకపోతే ఆ వేడిలో ఏం చేసేవాణ్నో నాకే తెలియదు. ఐ యామ్ రియల్లీ సారీ, ఇక ముందు అలా చెయ్యను' నవ్వుతూ అన్నాడు. చిలిపిగా అతని తొడగిల్లుతూ 'యూ నాటీ చెయ్యాల్సినవన్నీ చేసేసి, ఇంకేం చెయ్యనని ఇప్పుడు చెబుతావా' అనడంతో ఇద్దరూ ఆనందంగా నవ్వుకున్నారు. అందరితో పాటుగా ఋషికేశ్‌లో బస్సు దిగి అక్కడున్న త్రివేణిఘాట్, లక్ష్మణ్ ఝూలా, రామ్ ఝూలా, స్వర్గధామ్, భారత్‌మందిర్, గీతాభవన్, నీలకంఠ్ మాధవ గుడి ఇంకా ప్రపంచ ప్రసిద్ధి గాంచిన క్రియ యోగా ఆశ్రమం సందర్శించి, తిరిగి ఢిల్లీకి ప్రయాణమయ్యారు.

•••

బస్సులో వస్తున్నంత సేపూ సంజన ఎంతో ముభావంగా ఉండడం చూసి తట్టుకోలేక పోయాడు విశాల్ 'సంజనా, ఏమైంది.. ఇంతవరకు ఎంతో సంతోషంగా, హుషారుగా ఉన్నావు. ఒక్కసారిగా ఎందుకిలా మూగబోయిన వీణలా అయిపోయావు' తన చూపుడు వేలితో ఆమె చుబుకాన్ని పైకెత్తి అడిగాడు విశాల్.

అప్పటికే ఆమె కళ్లు వర్షిస్తున్నాయి. అది చూసి విచలితుడైన విశాల్ 'ఏంటిది నువ్వింకా ఎంతో ధైర్యవంతురాలివి అనుకున్నాను' ప్రేమగా రుమాలుతో ఆమె కన్నీరు తుడుస్తూ అన్నాడు.

'ఏమో విశాల్. మన కలయిక ఓ కలలాగ జరిగిపోయింది. ఎందుకో నిన్ను వదిలి వెళ్లాలంటే చాలా బాధగా ఉంది. నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాను. అందుకే నువ్వేం చేసినా కాదనలేదు. అమ్మా నాన్నా కూడా నాకు ఎటువంటి ఆంక్షలు పెట్టలేదు. మరి మనపెళ్లికి మీ అమ్మ నాన్నలు ఒప్పుకుంటారో లేదోనని భయంగా ఉంది' అతని భుజం మీద తలవాలుస్తూ అంది సంజన.

'పిచ్చి సంజనా, నీకా భయం అక్కర్లేదు. వాళ్లు ఎప్పుడూ నా ఇష్టం కాదనరు. పైగా మనకు మా తాతయ్య మామ్మల అండ ఉండనే ఉంది. నువ్వింకేం బెంగ పెట్టుకోకు, నేనున్నాను' ఆమెకు ధైర్యం చెప్పాడు విశాల్.

'ఏమో విశాల్... నువ్వు ఎన్నైనా చెప్పు. పెళ్లి కాని ఆడపిల్ల మనసులో ఎన్నెన్నో భయాలు, అనుమానాలు ఉంటాయి.'

ప్రేమంటే రెండు హృదయాల కలయిక మాత్రమే కాదు. ఒకరిపై మరొకరికి ఉండే నమ్మకం కూడా. నీ చేయి నాచేతిలో ఉన్నంతకాలం నీకేమీ ఇబ్బంది ఉండదు. నీ ఆనందమే నా ఆనందం. అలాగే నీ బాధలన్నీ నావి. నువ్వు ఎలా నడుచుకోమంటే అలా నడుచుకుంటాను. నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ చెయ్యను. నన్ను నమ్ము... ఐ మిస్ యు సంజనా' అంటూ ఆమె నుదుటిమీద ముద్దుపెడుతూ అన్నాడు విశాల్.

'థాంక్యూ విశాల్. ఇంక నాకు ఏ భయమూ లేదు. ఐ టూ మిస్ యు' అతని పెదవులను తన పెదవులతో మూస్తూ అంది సంజన.

•••

'అమ్మా సంజనా! ఆ భగవంతుడి దయవల్ల ఏ ఆటంకం లేకుండా మీ పెళ్లి జరిగిపోయింది. కోరుకున్న అమ్మాయితో పెళ్లి జరిగినందుకు విశాల్‌కూడా చాలా ఆనందంగా ఉన్నాడు. పెద్దదానిగా నాదోమాట. ప్రేమంటే ఒకరి గురించి మరొకరు ఆలోచించుకుంటూ, నీకు నేనున్నానన్న భరోసా కల్పించాలి. అలాగే భార్యాభర్తల మధ్య అపోహలకు, అపార్థాలకు పొరపాటున కూడా తావుండ కూడదు. ఆడదాని మనసు ఓ 'బావి' లాంటిది. దాని లోతు తెలుసుకోవాలని ప్రతి మగవాడు అనుకుంటాడు. అయితే ఆడదాని మనసు లోతు ఆడదానికే తెలుస్తుంది కాని ఏ మగాడు తెలుసుకోలేడు. అన్ని బావుల్లోని నీళ్ల రుచి ఒక్కలా ఉండవన్నట్లు ఆడవాళ్ల మనసులు కూడా ఒక్కలా ఉండవు. బావిలో ఊరేఊటని బట్టి ఆ నీళ్ల రుచులు మారతాయి. అలాగే ఆడదాని మనసు కూడాను. అటువంటి మనసు 'బావి'లో ప్రేమ, అనురాగం అనే ఊటలు ఊరాలి. ఒక్కసారి ఆడదాని మనసు 'లోతు'ని తెలుసుకున్న మగాడు ఇంక జీవితాంతం ఆమెతో సఖ్యతగానే ఉంటాడు. కాబట్టి ఇవాళరాత్రి నీ మనసు బావి లోతులను సిగ్గు పడకుండా ప్రేమానురాగపు ఊటలతో ఊరించి నా మనవడి మనసు గెలుచుకో, జాగ్రత్త' అని నవ వధువు సంజనకు చెప్పిన మామ్మ ముసిముసిగా నవ్వుకుంటూ తొలివలపు తలపులు పండించుకొమ్మంటూ ఆమెను శోభనం గదిలోకి పంపి మెల్లగా తలుపులు మూసింది.

•••

'ఏంటి సంజనా, అక్కడే ఆగిపోయావు' చొరవగా ఆమెచేతులు పట్టుకుని మంచం దగ్గరకు తీసుకువచ్చాడు విశాల్.

"... ... ..."

ఏంటి ఇదంతా సిగ్గే! అవును మా మామ్మేంటి నీకు గీతోపదేశం చేస్తోంది? నవ్వుతూ అడిగాడు విశాల్.

'... ... ...'

అదేమిటో నాకు చెప్పవా...! ఆమె తలను పైకెత్తుతూ మరోసారి అడిగాడు విశాల్.

'ఊటబావి' గురించి చెప్పారు కాస్త సిగ్గుగా నవ్వుతూ అంది సంజన.

ఊటబావా? ఆమె జఘనాలకేసి చూస్తూ అన్నాడు విశాల్.

'ఛ! మీవన్నీ పోకిరీ ఆలోచనలే! ఆవిడ చెప్పింది ఒకరినొకరు మనసులు లోతుగా అర్థం చేసుకోమని! ఎందుకు అంత ఆత్రుత!' అతన్ని మెల్లగా వాటేసుకుని రెచ్చగొడుతూ అడిగింది సంజన.

'మరి ఉండదా' ఆమెను పక్క మీదకు తోస్తూ అన్నాడు విశాల్.

'సరే అయితే.. అంటూ అతన్ని కవ్వించింది. సంజన అధరామృతాన్ని జుర్రుకుంటూ ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు విశాల్.

అప్పటికే ఆమె మనసుబావిలో ప్రేమానురాగపు ఊటలు ఊరి పొంగి పొరలుతున్నాయి.

నవ్య

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
# అర్టికేరియా సమస్యకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రపంచ వ్యాప్తంగా ఎంతోమంది ఎన్నో రకాల చర్మసమస్యలతో బాధపడుతుంటారు. అలాంటి వాటిలో అర్టికేరియా ఒకటి. దీనినే 'హీవ్స్' అని కూడా అంటారు. ఒక్కసారిగా ఉన్నట్లుండి చర్మంపై దద్దుర్లు ఏర్పడటం, వీటి వలన విపరీతమైన దురద వంటి లక్షణాలు కనిపిస్తాయి. అవి కొన్ని నిమిషాల నుండి కొన్ని గంటల వరకు కనబడి, తదుపరి పూర్తిగా కనిపించకుండా పోవడం వంటి లక్షణాలన్నీ అర్టికేరియా వ్యాధికి సంబంధించినవే. మరికొందరిలో ఇవి దీర్ఘకాలికంగా కొనసాగి, తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తాయి.

ఈ అర్టికేరియా సమస్య కొన్ని ఇతర చర్మసమస్యల మాదిరిగానే కనిపించడం వలన – కొన్నిసార్లు ఇది నిర్లక్ష్యానికి గురి అయి ప్రమాదకరంగా మారే అవకాశం ఉంటుంది. ఇతర వైద్యవిధానాల ద్వారా అర్టికేరియా వ్యాధిని కేవలం నియంత్రించవచ్చు. కానీ హోమియోపతి ట్రీట్‌మెంట్



ద్వారా ఈ వ్యాధి నుండి పూర్తిగా బయటపడే అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ అర్టికేరియా వ్యాధి పట్ల అవగాహన పెంచుకుని, దీనిని మొదట్లోనే గుర్తించి, వెంటనే సరైన చికిత్స అందించినట్లయితే ఈ వ్యాధి బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు. అర్టికేరియా సమస్య సాధారణంగా కనిపించే ఒక చర్మసమస్య. సుమారు 20% మంది ప్రజలు తమ జీవితకాలంలో ఏదో ఒక సందర్భంలో ఈ వ్యాధి బారిన పడటం జరుగుతుంది. ఏ వయస్సు వారినైనా ఇది ప్రభావితం చేస్తుంది. ఈ అర్టికేరియా ప్రభావం స్త్రీ, పురుషులలో సమాన స్థాయిలో ఉంటుంది.

**అర్టికేరియా 2 రకాలు: (1) అక్యూట్ అర్టికేరియా:** అర్టికేరియా వ్యాధి లక్షణాలు 6 వారాల కంటే తక్కువ రోజులు కనిపించినట్లయితే దానిని అక్యూట్ అర్టికేరియా అని అంటారు. ఇది అర్టికేరియా వ్యాధిని ప్రేరేపించే అంశాలు ఎదురైనప్పుడు కలుగుతుంది.

**(2) క్రానిక్ అర్టికేరియా:** అర్టికేరియా సమస్య 6 వారాలకు మించి కొనసాగినట్లయితే దానిని క్రానిక్ అర్టికేరియా అంటారు. ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాల పరంగా ఇంతవరకూ స్పష్టత లభించలేదు. కానీ శరీరంలో అంతర్లీనంగా ఉండే వివిధ ఆరోగ్య సమస్యలు – ముఖ్యంగా థైరాయిడ్, లూపస్ మొదలైన వాటి వలన అర్టికేరియా ఉత్పన్నమయ్యే అవకాశాలు ఉంటాయి.

**కారణాలు:** మన శరీరానికి సరిపడని పదార్థాలు – శరీరంలోకి ప్రవేశించినప్పుడు వాటికి ప్రతిస్పందనగా చర్మంలో శోథమును కలిగించే ప్రక్రియ ద్వారా కొన్ని కణాలు – హిస్టమిన్ మరియు ఇతర కెమికల్స్ రక్తప్రసరణలోకి విడుదల అవడం వలన అర్టికేరియా ఏర్పడుతుంది. ఇంతే కాకుండా కొన్ని ఆటోఇమ్యూన్ వ్యాధుల వలన కూడా అర్టికేరియా సమస్య ఉత్పన్నమవుతుంది.

**'అర్టికేరియా'ను ప్రేరేపించే అంశాలు:** నొప్పి నివారణ మందులు • కీటకాలు, పరాన్నజీవులు • ఇన్‌ఫెక్షన్‌లకు కారణమయ్యే 'బ్యాక్టీరియా' మరియు 'వైరస్'లు • అధిక ఒత్తిడి, సూర్యకాంతి, వ్యాయామం, గోకడం వంటి చర్యలు • మద్యపానం మరియు కొన్ని ఆహార పదార్థాలు • అధిక లేదా అల్ప ఉష్ణోగ్రతలకు గురికావడం • జంతుకేశాలు, పుప్పొడి రేణువులు వంటి అంశాలన్నీ అర్టికేరియాను ప్రేరేపిస్తాయి.

**లక్షణాలు:** చర్మంపై ఎరుపు లేదా చర్మపు రంగులో దద్దుర్లు ఏర్పడతాయి. • ఇవి విపరీతమైన దురదతో కూడి ఉంటాయి. • ఈ దద్దుర్లు నొప్పి లేదా మంటను కలిగి ఉంటాయి (Angioedema) • ఇవి కళ్ళ చుట్టూ, బుగ్గలపై, పాదాలు, చేతులు, పెదాలపై ఏర్పడతాయి. ముఖ్యంగా ఇవి గొంతులో ఏర్పడితే – ఈ వాపు వాయుద్వారాలకు అడ్డుగా మారే పరిస్థితి ఒక్కోసారి ప్రాణాంతకంగా మారవచ్చు. • ఈ దద్దుర్ల పరిమాణం పెరగటం–తరగటం మరియు వీటిని ప్రేరేపించే అంశాలకు గురి అయినప్పుడు, ఈ తేడా స్పష్టంగా కనిపించటం తదుపరి అదృశ్యమవటం జరుగుతుంటుంది. • ఈ దద్దుర్లపై ఒత్తిడి పడితే ఇవి తెల్లగా మారడం వంటి లక్షణాలను కూడా మనం గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** అక్యూట్ అర్టికేరియా నిర్ధారణకు సాధారణంగా ఎలాంటి వ్యాధి నిర్ధారణ పరీక్షల అవసరం ఉండదు. దీర్ఘకాలిక మరియు తరచూ పునరావృతమయ్యే అర్టికేరియాకు అవసరమయ్యే నిర్ధారణ పరీక్షలు: CBP, ESR, థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (TSH) మరియు యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీస్ ANA మొదలైనవి. • అర్టికేరియల్ వాస్క్యులైటిస్‌ను నిర్ధారించుకునేందుకై పంచ్ బయాప్సీ పరీక్షను కూడా చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కాన్‌స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి యొక్క శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి – తద్వారా ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'అర్టికేరియా' సమస్యను పూర్తిగా నయం చేయటం జరుగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో వ్యాధి రీత్యా, రోగి శరీర నిర్మాణం, వ్యక్తిగత మరియు మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించే చికిత్సతో 'అర్టికేరియా'ను పూర్తిగా నయం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in



**లొ**కేషన్ హీరోయిన్ నివాసముండే గుడిసెకు మారింది. అప్పటికే టైం ఏడయింది. పల్లెటూరు కాబట్టి పూర్తిగా చీకటిపడింది. వీధి లైట్లు కూడా లేని ఊరు కాబట్టి చిమ్మ చీకటి.

గుడిసె ముందు జనరేటర్ ఆన్‌చేసి ఫ్లడ్ లైట్లు వెలిగేసరికి, ఊరు ప్రజలు అందరు వచ్చి అక్కడే మట్టి కుప్పల మీద కూర్చున్నారు. వాళ్లంతా హాయిగా భోజనాలు చేసి మాంచి హరికథ వినడానికి వచ్చినట్టుగా వచ్చారు.

నేను నవీన్‌ను పక్కకు పిలిచి "శ్రావణిని కనుక్కో? ఆమె చేయగలదా, లేదంటే రేపు ప్లాన్ చేద్దాం!" అని చెప్పాను.

నవీన్ నా వైపు అదోలా చూసి, "రేపటితో ఇక్కడ షూటింగ్ అయిపోతుంది. ఈ సీన్ నైట్ సీన్. నువ్వేమో, సహజంగా ఉండాలంటావు. డే ఫర్ నైట్ చేయడానికి ఒప్పుకోవు. ఈ సీన్ ఇవ్వాళ చేయకపోతే, రేపు రాత్రికే చేయాల్సి వస్తుంది. దాంతో షెడ్యూల్ అంతా డిస్టర్బ్ అవుతుంది. రేపు సాయంత్రానికి ప్యాకప్ చెబితేనే... యూనిట్ వెళ్ళిపోతుంది. లేకపోతే అదనంగా మరో రోజుకు కాల్ షీట్ ఇవ్వాల్సి వస్తుంది. అయినా, నువ్వెందుకు అంత ఇదైపోతున్నావ్?" అంటూ మందలించాడు. ఆ సాహసం, నవీన్ మాత్రమే చేయగలడు.

నేను దోషిలా తల దించుకున్నాను.

"ఏంట్రా?" అన్నాడు అనునయంగా. జనరల్‌గా షూటింగ్ సమయంలో, ఇతరులు ఎవరైనా ఉన్నపుడు నన్ను 'రారా, పోరా' అని సంబోధించడు.

నేను 'ఏం లేదన్నట్టుగా' తలూపాను.

"సరే!" అంటూ, మెగాఫోన్‌లో 'కమాన్! కమాన్! హర్రియప్' అంటూ అరిచాడు.

మేము హీరోయిన్ నివాసముంటున్న గుడిసె కోసం నిజమైన గుడిసెనే ఎంచుకున్నాం. ఐదడుగుల ఎత్తున్న తలుపు, లోపల ఓ చిన్నగది, ఒక వంటిల్లు ఉన్నాయి. మొత్తం, ఇల్లంతా కలిపి యాభై గజాలు కూడా లేదు. అందులోనే షూట్ చేయడానికి కెమెరామెన్ చాలా కష్టపడ్డాడు. లాంతర్ల వెలుతురులో సీను జరుగుతున్నట్టు ఉండాలి కాబట్టి లైటింగ్ ఏర్పాటుచేయడానికి కూడా తల ప్రాణం తోకకొచ్చింది.

హీరోయిన్, హీరోను గుడిసె లోపలికి తీసుకొచ్చి అతనికి అద్భుతమైన శృంగారాన్ని పంచుతుంది. అప్పటివరకు ఆమె వేశ్యావృత్తిలో ఉండి ఎంతోమందికి శారీరక సుఖం పంచినా, ఇపుడు మాత్రం తన చిన్ననాటి స్నేహితుడు, ప్రియుడు అయిన హీరోకు తన తనువును మనస్ఫూర్తిగా అర్పిస్తుంది.

సహజత్వం కోసం, ఆ గుడిసెలోనే ఉన్న నులక మంచమే వాడాలనుకున్నాం. ఆ చిన్న మంచంలో ఇద్దరు పడుకోవడం చాలా కంజెస్టెడ్‌గా ఉండడంతో, శ్రావణి అందులో షూట్ చేయడానికి ఒప్పుకోదనుకున్నాను కానీ, శ్రావణి ఆ సీన్లో విశ్వరూపం చూపింది. తన తనువును ఒక పూజాపుష్పంలా హీరోకు అర్పించుకున్న అనుభూతి కలిగించింది.

ఆ రోజు ఉదయం కట్టుకున్న పింక్ చీరలో, క్లోజప్పులో, లాంతరు వెలుతురు ఇచ్చే లైట్ల బంగారు వెలుతురులో ఆమె శరీరం మెరిసిపోతోంది. ఆమె అందాన్ని ఆ సీనులో ఒడిసి పట్టాలని, వీలైనంత ఎక్స్‌పోజ్ చేయించాలని స్క్రిప్టు దశలోనే రాసుకున్నాను. అది చీప్ ఎక్స్‌పోజర్ కాదు. ఆమె వేశ్య పాత్ర వేస్తుంది కాబట్టి కనపడ్డప్పుడల్లా స్తనాలు, బొడ్డు, తొడలు కనిపించే కాస్ట్యూమ్స్ వాడలేదు మేము. నిజానికి, వేశ్యావృత్తిలో ఉన్న స్త్రీలు ప్రతీ క్షణం అంగాంగ ప్రదర్శన చేసుకుంటూ కనిపించరు. మామూలు గృహిణి కన్నా, ఇంకా ఎక్కువగానే, శరీరాన్ని జాగ్రత్తగా కప్పుకుంటారు. వృత్తిపరంగా మాత్రమే శరీరాన్ని అమ్ముకుంటారు. ప్రతీ పాత్రకు ఇంత ఎక్సర్‌సైజు చేశాం.



## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో గొప్ప సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. హత్యకు కారణమైన నయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. తన సినిమాలో హీరోగా కిరణ్‌ని సెలెక్ట్ చేస్తాడు డైరెక్టర్. పార్టీకి వెళ్ళిన కిరణ్, డ్రగ్స్ కేసులో ఇరుక్కుని జైలుపాలవుతాడు. ఆ బాధలో ఉన్న డైరెక్టర్‌ని శ్రావణి ఆకర్షిస్తుంది. ఆమే తన సినిమాలో హీరోయిన్‌గా ఫిక్స్ అయి, టెస్టులన్నీ చేసి హీరోయిన్‌గా తీసుకుంటాడు. లొకేషన్ల వేటలో నర్సాపూర్‌కి దగ్గరలో ఉన్న ప్రాంతాలన్నీ వెదుకుతారు. చివరికి రుస్తుంపేటలో షూటింగ్ చేయాలని ప్లాన్ చేసి ఏర్పాట్లు చేసుకుని షూటింగ్ మొదలుపెడతారు.

ఆ తర్వాత.....

హీరోయిన్‌బాడీని ఎక్స్‌పోజ్ చేయాలనుకున్న మాట నిజమేగానీ, అది శ్రావణిని చూడకముందు! ఎందుకో ఇప్పుడు శ్రావణి అందాలను ప్రపంచానికి చూపించాలని అనిపించడం లేదు. తను నాకు మాత్రమే సొంతం అన్న భావన కలుగుతోంది.

కానీ, ఇప్పుడు, ఇక్కడ వద్దంటే, శ్రావణిని ఎరోటిక్‌గా చూపించొద్దని అంటే నవ్వులపాలవుతాను. అందుకే నవీన్, కెమెరామెన్ ఆమెకు దుస్తులు ఎంతమేరకు తొలగించాలో చెప్తుంటే మనసులోనే విలవిలలాడాను కానీ బయటకు చెప్పలేని విచిత్ర పరిస్థితి.

ఆరోజు సీనులో, హీరోకు స్త్రీతో సంగమించడం అదే మొదటిసారి. కానీ, హీరోయిన్ ఆ విద్యలో అందె వేసిన చేయి. హీరో ఆమెను ఆబగా హత్తుకుంటాడు. అందిన చోటల్లా ఆమెను ముద్దుపెట్టుకుంటాడు. ఒంటిమీద బట్టలన్నీ పీకి పారేస్తాడు. అతని ఆత్రానికి ఆమె నవ్వుకుంటుంది.

“పిసికి పిసికి చంపేస్తావా ఏమిటి?” అని మురిపెంగా విసుక్కుంటుంది. అతని ఆవేశానికి అడ్డుకట్టవేసి మెల్లిగా, నింపాదిగా, నెమ్మదిగా శృంగారంలోకి దింపి, మజా చూపిస్తుంది. ఆ క్రమంలో తనూ ఉత్తేజితమవుతుంది. చిన్నప్పటి నుంచి తన కలల వల్లభుడు. అతనితో జీవితాంతం గడపాలని కోరుకుంది. కానీ, అది వీలుకాలేదు. ఇప్పుడు అతనితో కలిసే అవకాశం వచ్చింది. అందుకే, అతనికి తన శరీరాన్ని కానుకగా అర్పిస్తుంది.

హీరో ఒక పిరికిపంద. ఆమె తనని తాను ఒక పూజాపుష్పంగా సమర్పించుకుంటే అతను ఆమె చేతిలో డబ్బులు పెడతాడు.

హీరోయిన్ షాక్ తింటుంది. ఆమె గుండె వేయి వక్కలవుతుంది. తనను ఆ ఊరి దొర బలవంతంగా చెరిచినప్పుడు, నిస్సహాయంగా నిలబడ్డ హీరోను క్షమించగలిగింది కానీ, ఇప్పుడు, తన ప్రణయాన్నంతా తెలిపే విధంగా అతనికి అర్పించుకున్న తర్వాత, చేతిలో డబ్బులు పెట్టినప్పుడు మాత్రం అతన్ని క్షమించలేకపోతుంది. వెక్కివెక్కి ఏడుస్తుంది.

నేను ‘కట్’ చెప్పడం కూడా మరిచి చెమ్మగిల్లిన కళ్ళతో ఆమెనే చూస్తుండిపోయాను.

నవీన్ ‘కట్’ అని అరిచాడు. శ్రావణి ఇంకా ఏడుస్తూనే ఉండిపోయింది.

శ్రావణిలో ఒక గొప్ప లక్షణం ఉంది. తనకు ఎప్పుడు కావాలంటే అప్పుడు, గ్లిజరిన్ లేకుండానే కన్నీళ్ళు వస్తాయి. అందుకే, ‘కట్’ చెప్పిన తర్వాత కూడా కన్నీళ్ళు కారుతూనే ఉన్నాయి.

ఆమెను నా కౌగిలిలోకి తీసుకుని, కన్నీళ్ళు తుడిచి, ఓదార్చాలనే కోరిక బలంగా కలిగింది.

ఆ రోజు షూటింగ్ పూర్తయి, ప్యాకప్ అయ్యేసరికి రాత్రి పదకొండు అయింది. శ్రావణి, హీరో మేకప్ తీసేసి అన్నీ సర్దుకుని బయల్దేరేసరికి పన్నెండైంది. అంత రాత్రి వరకు ఒక్కసారైనా విసుక్కోకుండా, భోజనం లేటయినా, శ్రావణి ఓపికగా కూర్చుంది. మేము హోటల్‌కి చేరేసరికి ఒంటి గంట దాటింది. అప్పుడు భోజనం చేసి మళ్ళీ ఉదయం ఆరు గంటలకల్లా లొకేషన్‌కు బయల్దేరాం.

కారులో నా పక్క సీట్లో కూర్చుంది శ్రావణి. నులివెచ్చని తొలివెలుగు కిరణమొకటి ఆమె ముఖం మీద పడింది. ఆమె దీపశిఖలా వెలిగిపోయింది.

నా పక్కనే కూర్చున్న ఆమె ఒంటినుండి వీస్తున్న పరిమళానికి నేను ముగ్ధుణ్ణై పోయాను. పరవశించి పోయాను. ఆ మేని మెరుపు నాలోని విచక్షణా జ్ఞానాన్ని నశింపజేస్తోంది. ఒక్కసారి, ఒక్కసారి ఆమె ఒంటిని తాకాలన్న బలమైన కాంక్షను అతికష్టం మీద అణుచుకున్నాను.

“గుడ్ మార్నింగ్ సార్!” అంది షేక్‌హ్యాండ్ ఇస్తూ చిరునవ్వుతో. ఆమె ఆ ఒక్క నవ్వుతో, పుట్టుక

13

# సినీవాలి



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

తోనే వృద్ధులైన వేలాదిమంది యువకుల నీరస హృదయాలను రీఛార్జ్ చేయొచ్చు. నేనామె చేతిని అపురూపంగా, ఆప్యాయంగా అందుకున్నాను. నీలి రంగు చీరలో సౌందర్యం కుప్పలు కుప్పలుగా మూట కట్టినట్టు ఉంది. పొట్టి చేతుల జాకెట్టు, దానికితోడు జాకెట్ చేతులు డిజైనర్ ట్రాన్స్పరెంట్ క్లాత్‌తో కుట్టబడి ఉండడంతో చెయ్యంతా పచ్చటి బంగారంతో చేసి, దానికి సుగంధాలు పూసి నట్టుగా ఉంది. వీపుమీద ఆమె జాకెట్టు, పసిడి పళ్ళెం మీద రంగవల్లులు అద్దినట్టుగా, వింతశో భతో మెరిసిపోతోంది.

తను పూవిలుకాడి చేతిలోని పూబాణంలా ఉంది. ఆమె ఎక్కిన నా కారు పూలరథమయింది. నేను విరహాగ్నిలో రగిలి, కాలి బూడిదైన మన్మ థుడినైపోయాను.

మనసు, శరీరం నా వశం తప్పుతుందను కుంటున్న సమయంలో, నవీన్ వచ్చి ముందు సీట్లో కూర్చునేసరికి కారు కదిలింది.

ఇవాళ ఆమె అదే కలర్ డ్రెస్సులో నీళ్ళ ట్యాంకులో దిగి నీళ్ళలో ఆడుకుంటుంటే ముందు హీరో, తర్వాత విలన్ చూస్తారు. విలన్ ఆమెను లాక్కుపోయి, మానభంగం చేసే సీన్ షూట్ చేయాల్సి ఉందని నవీన్ చెప్పాడు. నవీన్ సాంకేతిక వివరాలు చెబు తుంటే శ్రావణి శ్రద్ధగా వినసాగింది. నేను మాత్రం మనసులో ఆ విలన్‌ను ముక్కలు ముక్క లుగా నరుకుతూ, ఏ కీలుకా కీలు విరిచేస్తున్నాను.

ఆ సీనుతో శ్రావణితో షెడ్యూల్ పూర్తవుతుంది.

సినిమా షూటింగ్ షెడ్యూల్ అంతా గందర గోళంగా ఉంటుంది. సినిమాలో ముందుగా వచ్చే సీన్లు వెనుక, వెనుక వచ్చే సీన్లు ముందు షూట్ చేస్తుంటారు. అందుకు అనేక కారణాలు ఉంటాయి. ముఖ్యంగా ఆర్టిస్టుల అవైలబిలిటీని బట్టి షూటింగ్ ఆర్డర్ నిర్ణయించబడుతుంది.

అసలైతే ఇవ్వాళ్టి సీన్ ముందుగానే షూట్ చేయాల్సి ఉంది. విలన్ హీరోయిన్‌ను రేప్ చేసిన తర్వాతనే ఆమె వేశ్యగా మారుతుంది. ఆమె వేశ్యగా మారిన తర్వాతే చాలాసీన్లు ఉంటాయి. అయితే విలన్ పాత్రధారి రెండు రోజుల కాల్‌షీట్ మాత్రమే తీసుకున్నాం. పేమెంట్ కూడా రెండు రోజుల కాల్ షీట్స్‌కు మాత్రమే ఇవ్వాల్సి ఉంటుంది. కరెక్టుగా ప్లాన్ చేసుకోకుండా విలన్ పాత్రధారి కాల్‌షీట్లు వారం పదిరోజుల పాటు తీసుకుని, ఔట్‌డోర్ లొకే షన్లో ఉంచితే, వారం పదిరోజుల కాల్‌షీట్లకు పేమెంట్, హోటల్ అకామడేషన్, కన్వీయెన్స్ వంటి ఖర్చులు అదనంగా పెట్టాల్సి వస్తుంది. అతనికి కూడా కాల్‌షీట్లు వేస్టవుతాయి.

ప్లానింగ్ ఎలా ఉంటుంది అంటే, మేము హైదరాబాద్‌కు నలభై, యాభై కిలోమీటర్ల దూరంలో ఉన్నాం కాబట్టి, విలన్ పాత్రధారిని కారులో ఇవాళ మార్నింగ్ పికప్ చేసుకోవాలని ముందుగానే తెలుసు కాబట్టి, కారును నిన్నటిరోజు రాత్రి హైద రాబాదుకు పంపాలి. లొకేషన్ నుండి ఖాళీ కారు పంపకుండా, నిన్నటితో కొంతమంది ప్యాడింగ్ ఆర్టి స్టుల షూటింగ్ పూర్తిచేసి, వాళ్ళను ఆ కారులో పంపించి, ఇవాళ విలన్ పాత్రధారిని పికప్ చేసు కునేట్టుగా అరేంజ్‌మెంట్ చేశాం.

ఇవన్నీ ఎందుకు చెప్పుకోవాలంటే, చాలామంది బయట ప్రపంచంలో ప్రజలు, సినిమా తీసి ప్రొడ్యూ సర్ల దగ్గర కోట్ల కొద్దీ నల్లధనం కట్టలు కట్టలుగా మూలుగుతుందనీ, షూటింగ్ సమయంలో వెయ్యి రూపాయల నోట్లు విసిరేస్తుంటారనే అపోహలో ఉంటారు. హైబడ్జెట్ సినిమాల్లో కూడా ఇంతే ప్లానింగ్ ఉంటుంది. లో బడ్జెట్ సినిమాలకు ఇంకా ఎక్కువ ప్లానింగ్ ఉంటుంది. చాలా టైట్ బడ్జెట్ మీద నడుస్తుంటాయి. ఒక్కరోజు ప్రొడక్షన్ కోసం అంటే యూనిట్‌కి తిండిపెట్టే కాంట్రాక్టరుకు కూడా డబ్బులు ఇవ్వలేని గడ్డు పరిస్థితి ఉంటుంది. రాత్రికి రాత్రి ప్రొడ్యూసర్, పెళ్ళాం పుస్తెలు తాకట్టుపెట్టి డబ్బులు తెచ్చిన సంఘటనలు కోకొల్లలు.

సినిమా రంగంలో ప్రొడ్యూసర్ అంత టెన్షన్ అనుభవించే వ్యక్తి మరొకడు ఉండడు. సినిమా నిర్మాణం ఎప్పుడూ అనుకున్న బడ్జెట్లో పూర్తికాదు. మొత్తం ప్రొడక్షన్ దశలో ఖర్చు ఒక కోటి అను కుంటే, సరిగ్గా ప్లాన్ చేసుకోకపోతే, ప్రొడ్యూసరుకు సినిమా నిర్మాణ వ్యయం మీద సరియైన అవ గాహన లేకపోతే, మేనేజర్లను గుడ్డిగా నమ్మితే, అతను సిన్సియర్ కాకపోతే, ఆ కోటి కాస్తా, సినిమా మధ్యలోకి వచ్చేసరికి, హరించుకు పోతుంది. కోటి రూపాయలుపెట్టి తీసిన సినిమాను మధ్యలో వది లేయలేక, వదిలేస్తే బంధువుల, స్నేహితుల సర్కి ల్స్‌లో నవ్వుల పాలవుతానేమోనని, అందినకాడికి అందిన చోటల్లా, ఎంత వడ్డీకైతే అంత వడ్డీకి, ఒక్కోసారి వంద రూపాయలకు ఇరవై రూపాయల వడ్డీకి కూడా డబ్బులు అప్పు చేస్తుంటారు.

**షెడ్యూల్ అయిపోయింది. ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు. ఆ రోజుతో శ్రావణి షూటింగ్ కూడా పూర్తి అయిపోయింది. మళ్లీ ఇక ఆమె కనిపించదనుకుంటే మనసంతా అదోలా అయిపోయింది డైరెక్టర్‌కి. బరువుగా, బాధగా అనిపించింది. విలవిలలాడి పోతున్నాడు. చెప్పాలి... తన హృదయవేదన ఆమెకి వినిపించాలి అని ఆరాటపడుతున్నాడు. అతడు మనసువిప్పి ఆమెతో మాట్లాడాడా? అందుకామె ఏమన్నది?**

ఇంతాచేసి, మరో యాభై లక్షల రూపాయలో, కోటి రూపాయలో అప్పుచేసి తెచ్చిపెట్టి పూర్తిచేసిన తర్వాత కూడా, రిలీజ్ చేసుకోలేని నిస్సహాయ స్థితిలో ఉంటారు చాలామంది.

నేను ఈ సినిమాకు ప్రొడ్యూసర్‌ని కాకపోయినా, డబ్బు ఖర్చంతా నా అజమాయిషీలోనే జరుగు తుంది కాబట్టి, ప్రతీపైసా సద్వినియోగపడాలని నా తాపత్రయం. అందుకే, ప్రతీ పైసాను ఆచి తూచి ఖర్చుపెడుతున్నాను. ప్రొడ్యూసర్ నన్ను లెక్క అడగకపోయినా, ఆయనకు చెప్పాల్సిన బాధ్యత నాపై ఉంది. దుబారా అయిన ప్రతీ రూపాయి మన అసమర్థతకు నిదర్శనం. అలా వేస్టయిన ప్రతీ రూపాయి నన్ను నిందిస్తున్నట్టుగా అన్పిస్తుంది నాకు.

నేను నా ఆలోచనల్లో మునిగిపోయి, శ్రావణి నా భుజం మీద తలవాల్చి నిద్రపోతున్న సంగతే గుర్తించలేదు. గుర్తించిన తర్వాత, ఆ దృశ్యం ఎంత కమ్మగా ఉందోననిపించింది. శ్రావణి మేని సుగంధం, కేశ సౌరభం, లేలేత చర్మ సౌందర్యం, బంగారు వన్నె శరీరం అన్నీ నన్ను అబ్బుర పరుస్తున్నాయి.

ఇంతలో కారు స్పీడ్ బ్రేకర్ దగ్గర ఎగిరిపడ డంతో శ్రావణి లేచి, సర్దుకుని కూర్చుంది.

"సారీ సార్! రాత్రి లేటయింది కదా, నిద్ర సరి పోలేదు" అంది అపాలజెటిక్‌గా.

శ్రావణికి నిద్రాభంగం కలిగించినందుకు, ఇంకా ఆమె తన తలను నా భుజం మీద నుండి తీసి వేయడానికి కారణమైనందుకు నాకైతే ఆ స్పీడ్ బ్రేకర్‌ను తన్నాలన్పించింది.

ఐదు నిమిషాల్లో లొకేషన్‌కు చేరుకున్నాం.



## ఎలాగైనా నటిస్తాను

హీరోయిన్లు తెరమీద చిట్టి పొట్టి డ్రెస్సులు కథ కోసమే వేసుకున్నామంటూ చిలక పలు కులు వల్లిస్తుంటారు. అలాంటి మాటలే రాధికా ఆప్టే చెబుతోంది. అసలు డ్రెస్సు వేసుకోకుండా నటించడానికి తనకెలాంటి అభ్యంతరం లేదం టోంది. కథలో తన పాత్ర అద్భుతంగా ఉంటే నగ్నంగా నటిస్తాను. నా పాత్ర ద్వారా సమా జానికి ఓ మంచి మెసేజ్ వెళుతుందంటే ఎలా నటించడానికైనా తాను సిద్ధమేనని స్పష్టం చేసింది. రాధిక తెలుగులో చేసింది తక్కువ సిని మాలే అయినా చాలా పద్ధతిగా కనిపించింది. అదే బాలీవుడ్‌లో తన విశ్వరూపం చూపించేస్తూ ఉంటుంది. రాధిక మాటలు ఎంత బోల్డ్‌గా ఉంటాయో చేతలు కూడా అలాగే ఉంటాయం టున్నారు బాలీవుడ్ జనాలు.

చెరకుతోటలో నుంచి, లేడిపిల్లలా గెంతుతూ రావడం మొదటి షాట్.

మానిటర్‌లో నుంచి చూస్తున్న నాకు, శ్రావణి నా వైపే చూస్తున్నట్టనిపించింది. తర్వాత నీళ్ళ ట్యాంకులో దిగుతుంది. పసిపిల్లలా మారిపోయి నీళ్ళల్లో ఆడుకుంటుంది. స్లో మోషన్లో తీసిన కొన్ని షాట్లలో, నీళ్ళు పైకి విరజిమ్ముతూ, ఆమెను అభిషేకం చేస్తున్నట్టుగా, ఆమె పైన పడతాయి. శ్రావణి తన్మయత్వంలో మునిగిపోతుంది. ఒకసారి నీళ్ళు ఫౌంటైన్‌లో కింది నుంచి, స్లోమోషన్‌లో పైకి లేచి ఆమె ఎదద్వయాన్ని, మెడను, కళ్ళను తడుపుతుంటే, ఆమె చూపించిన ఎక్స్‌ప్రెషన్స్ నా మనసులో ముద్రపడి పోయాయి.

హీరోతో, ఆమె మాట్లాడుతున్న ప్రేమ డైలాగులన్నీ, నాతోనే చెబుతున్నట్టనిపించింది.

లంచ్ టైం వరకు ఆ సీన్ షూటింగ్ పూర్తయింది. ఇంక 'ప్యాకప్' అని చెబుదామనేసరికి నవీన్ నన్ను ఆపి ఇంకో చిన్న సీన్ మిగిలి ఉందని చెప్పాడు.

'హీరో చూస్తుండగా, కావాలనే, శ్రావణి ఒక విటునితో కలిసి వెళ్ళడం, తర్వాత డబ్బుల కోసం ఆ విటునితో గొడవపడి అతడి బట్టలు చింపి డబ్బులు లాక్కోవడం, అప్పుడే హీరోను చూసినట్టుగా అతని దగ్గరకొచ్చి, 'నీకు భార్య దొరికిందా? దొరకక పోతే రాత్రికి రా. కన్సెషన్ కూడా ఇస్తా'నని చెప్పి ఏడుస్తూ వెళ్ళిపోయే సీన్ చేయాల్సి ఉందని' చెప్పాడు.

నేను శ్రావణి వైపు చూశాను.

తను 'ఓకే సార్ చేసేద్దాం. కాస్ట్యూమ్ ఛేంజ్ చేయాలి కదా!" అంది.

## సినీవాలి
## కూపన్ నెం.11 విజేత

**గొట్టాపు దుర్గారావు**
**ఏలూరు**

కాస్ట్యూమ్స్‌తో పాటు, మేకప్ కూడా పూర్తిగా మార్చాల్సి ఉంది. ఇప్పటి సీన్లో పదహారేళ్ళ పడుచుగా నటించిన శ్రావణి ఇప్పుడు ఇరవై ఐదేళ్ళ ప్రౌఢగా, వేశ్యావృత్తిలో నలిగిపోయిన స్త్రీగా రూపాంతరం చెందాలి.

శ్రావణి ఏ మాత్రం సంకోచించకుండా, అభ్యంతరం చెప్పకుండా 'ఓకే' అనేసింది. అదే ఆమె ప్రొఫెషనలిజంకు నిదర్శనం.

ఎందుకంటే, ముందు ఈ మేకప్ తీసేయాలి. తర్వాత ఇంకో మేకప్ వేసుకోవడానికి కనీసం గంటపైనే సమయం పడుతుంది.

శ్రావణి ఓకే అన్నా మిగిలిన టెక్నీషియన్లు మాత్రం ఏడుపు ముఖం పెట్టుకున్నారు. వాళ్ళంతా, ఇంటికి వెళ్ళే మూడ్‌లోకి వచ్చేశారు. నవీన్ వాళ్ళను సముదాయించి, ఒప్పించాడు.

శ్రావణిని, నా మదిలో, ఆరోజు ఒక అద్భుత సౌందర్యరాశిగా ముద్రించుకున్నాను. ఇప్పుడు... వేశ్యగా, పాథెటిక్ సీన్‌లో చూడలేను. విడిపోయే ముందు నా మనసులో ఆమె అందమైన ముఖమే ఉండాలి.

అందుకే, నవీన్‌ను డైరెక్ట్ చేయమని చెప్పాను. నవీన్ ఆ సీన్ షూట్ చేసుకుని వచ్చేసరికి సాయంత్రం అయింది.

ఆ షెడ్యూలుకు "ప్యాకప్" చెప్పాను.

అందరూ ఎవరి వెహికల్స్‌లో వాళ్ళు హైదరాబాద్‌కి పయనమయ్యారు.

నేను, శ్రావణి, నవీన్ మిగిలిపోయాం.

శ్రావణి, వేశ్య మేకప్ తీసేసి, పొద్దున్న బయల్దేరినప్పుడు ఎలా ఉందో అలా, నవనవోన్మేష సుమబాలలా తయారైంది.

ఆ రోజుతో ఆమె షూటింగ్ అయిపోయింది. ఇక మళ్ళీ కనిపించదనుకుంటే మనసంతా విరహ సముద్రంలో లంగరు వేసినంత బరువుగా, బాధగా ఉంది.

ఎవరో నా హృదయంలోని ఒక ముక్కను కోసి తీసుకుపోతున్నంతగా, నా హృదయం రోదిస్తోంది.

ఇంతలో, జూబ్లీ బస్టాండ్ రావడంతో, నవీన్ దిగిపోయాడు. వాళ్ళమ్మకు ఆరోగ్యం బాగోలేదని ఫోన్ రావడంతో, షూటింగ్ మధ్యలో వెళ్ళడం కుదరక, చివరిరోజున వెళ్తానని... నాలుగు రోజుల క్రితమే చెప్పాడు.

'అమ్మకు నమస్కారం చెప్పు. హెల్త్ ఎలా ఉందో ఫోన్ చెయ్యి. తొందరగా వచ్చేయ్"మని నవీన్‌కు చెప్పాను.

కారులో, నేనూ శ్రావణి మిగిలాం.

ఒక ఇబ్బందికరమైన నిశ్శబ్దం, తెరలు తెరలుగా, కారంతా నిండిపోయింది. నా మనసులో నిండిపోయిన బాధ బరువుతో కారు, హైదరాబాద్ సిటీ పీక్ అవర్ ట్రాఫిక్‌లో మెల్లిగా కదులుతోంది.

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -13 (11-1-2017)

మా ప్రశ్న: ఏ చౌరస్తాలో డైరెక్టర్‌ని శ్రావణి ముద్దు పెట్టుకుంది?

మీ జవాబు-----------------------------------------------------------

చిరునామా-----------------------------------------------------------

--------------------------------------------------------------------

---------------------------పిన్------------------ఫోన్‌నెం.--------------------

**ఈ కూపన్‌ను 10 జనవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

ప్యారడైజ్ సర్కిల్ దగ్గర, ఎప్పటిలాగే, ట్రాఫిక్ జాం, కార్లు ఎంతకూ కదలడం లేదు. బంపర్ టూ బంపర్ ట్రాఫిక్ అంటే అదే.

"ఈ ట్రాఫిక్ జాం ఒక జీవితకాలం పాటు ఉంటే బాగుణ్ణనిపిస్తోంది" అంది శ్రావణి నా వంకే చూస్తూ. నాకు ఆ మాటలు, ముందు అర్థం కాలేదు. ఆమెను బ్లాంక్‌గా చూశాను.

"రేపటి నుంచి నిన్ను కలవననే భావనే నాకు రంపపు కోతలా ఉంది. ప్రాణం పోతుందేమోనని పిస్తోంది" అంది శ్రావణి.

నాకు ప్రపంచం స్తంభించినట్లనిపించింది.

"ఊ... నిజంగానా?" అన్నట్లు ఆమెను చూశాను.

"నిజం, నిజం. వెయ్యిసార్లు నిజం. నువ్వులేని జీవితం శూన్యంగా తోస్తోంది. ఈరోజు రాకూడదని ప్రతీ రోజూ మొక్కుకున్నాను. నువ్వు నా వంక చూస్తావేమోనని, నా మనసు అర్థం చేసుకుని, ఒక్కమాటైనా చెబుతావేమోనని ఇన్నిరోజులూ ఎదురు చూశాను. మనం విడిపోయే సమయం వచ్చేసరికి కూడా, నువ్వేం మాట్లాడకపోతే, ఇంక నేనే సిద్ధమయ్యాను. ఆడదాన్ని, అందులోనూ సినిమాదాన్ని, నా మాటలు నమ్ముతావో లేదోనని సంకోచించాను. కానీ ఈ క్షణం గడిచిపోతే, ఇక మళ్ళీ ఈ క్షణం రాదు. మళ్ళీ మనం కలవం. అందుకే, ధైర్యం చేస్తున్నాను." అంది కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా.

నేను రెండు చేతులతో తన ముఖాన్ని నా దోసిట్లోకి తీసుకుని, "ప్రియా! నా జీవితాన్ని నీ పాదాలచెంత..." అని అంటుండగానే శ్రావణి నా పెదాలను మూసింది, తన పెదాలతో.

నడి బజారులో, ప్యారడైజ్ చౌరస్తాలో, శ్రావణి నన్ను ముద్దు పెట్టుకుంది.

ఆ క్షణం ప్యారడైజ్ చౌరస్తా అంతా పారిజాత పూలవనంలా తోచింది.

'నాకే గనుక పవర్స్ ఉంటే, హైదరాబాదుకు వచ్చిన టూరిస్టులంతా చూసే విధంగా, ఈ ప్యారడైజ్ సర్కిల్‌ను మా ప్రేమ చిహ్నంగా ప్రకటించి, ప్రేమికుల దినం రోజు తప్పక సందర్శించాలని ఉత్తర్వులను జారీ చేస్తాను' అని మనసులో అనుకున్నాను.

గాల్లో తేలిపోతున్నట్టుగా, అసలు హైదరాబాదు రోడ్ల మీద ఒక్క వాహనం కూడా లేనట్టుగా, ప్రధాన మంత్రి పయనించే టైంలో రోడ్లన్నీ ఖాళీగా ఉన్నట్టుగా, కారులో ఇంటికి చేరుకున్నాం.

శ్రావణి మొట్టమొదటిసారిగా నా ఇంటిని పావనం చేసింది.

ఈ అపార్ట్‌మెంట్; అపార్ట్‌మెంటులో వాడిన ఇటుకలు, సిమెంటు; అపార్ట్‌మెంటు కట్టిన బిల్డరు; ఫ్లాట్ యజమాని, నేనూ ఏ జన్మలో ఎంత పుణ్యం చేసుకున్నామో, శ్రావణి నా ఇంట్లోకి తన పాదం మోపింది.

మొట్టమొదటిసారిగా శ్రావణి నా ఇంట్లోకి అడుగుపెట్టినప్పుడు ఎన్నో చేయాలనుకున్నాను. కానీ ఏం చేయలేక స్తబ్ధుగా నిల్చుండిపోయాను.

కేవలం నా గుండెను ఆమె పాదాల ముందు పరచి, నా హృదయ సామ్రాజ్యంలోకి ఆహ్వానించాను.

ఆ క్షణంలో, నాకో పాట గుర్తొచ్చింది.

"రహదారుల్లో పూలు పూయిస్తా..."

తను ఈవేళ నా ఇంటికొస్తుందని తెలిస్తే, నేను కూడా రహదారుల్లో పూలు పూయించి, ఆ రహదారుల గుండా శ్రావణిని నా ఇంట్లోకి ఆహ్వానించేవాణ్ణి.

ఏదైనా చేయాలని, నేను హడావుడి పడుతుంటే, శ్రావణి నన్ను వారించింది.




నా చెయ్యి పట్టుకుని సోఫాలో కూర్చోబెట్టి, తను నా పక్కన కూర్చుంది.

నా గుండె వందమైళ్ళ వేగంతో కొట్టుకో సాగింది. శ్రావణి అంత దగ్గరగా ఉంటే, ఆ సాన్నిహిత్యాన్ని భరించే శక్తి నాకు లేదనిపించింది.

ఆమె కళ్ళల్లోకి చూడలేక తలొంచుకున్నాను.

తను, నా తలెత్తి, "ఏంటయ్యా?" అని అడిగింది అనునయంగా.

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

శ్రావణి నా కళ్ళను ముద్దుపెట్టుకుంది. నా కంటి కొసన, కిందికి దూకాలా వద్దా అని సంకోచిస్తున్న కన్నీటి చుక్కను తన నాలుకతో అద్దింది.

నేను చలించిపోయాను. ఆమె గుండెల మీద నా తల ఆన్చి సేద తీరాను.

"నిన్ను చూసిన వెంటనే నీలో నాకు ఏం నచ్చిందో తెలుసా?" అని అడిగింది.

నేను తలెత్తి, ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాను.

"నీ కళ్ళు! నీ కళ్ళల్లో అంతులేని అగాధాలు కన్పించాయి. ఏదో తెలియని విషాద సందేశం పంపుతున్నట్టుగా అనిపించాయి. ఆరోజు నుంచి ఆ కళ్ళే నన్ను వెంటాడుతున్నాయి. ఇందాక 'ప్యాకప్' చెప్పినప్పుడు కూడా నీ కళ్ళల్లో చెప్పలేనంత బాధ గోచరించింది. ఆ బాధ నా గురించే అయితే బాగుణ్ణనుకున్నాను. ప్యారడైజ్ సర్కిల్లో కారు ఆగినప్పుడు అది నిజమేనని అనిపించింది. కానీ, నువ్వు ఎప్పటికీ, నోరుతెరిచి చెప్పవని నేనే ధైర్యం చేశాను" అంది.

"శ్రావణి! నిజమే, నేను చెప్పలేకపోయాను. నువ్వు వదిలి పోతున్నావనే ఊహే నా గుండెను రంపపు కోత కోస్తున్నా, మౌనంగానే భరించాను. కానీ, నువ్వంటే నాకు ప్రాణం. ఈ పది, పదిహేను రోజుల్లో నిన్ను తలవని క్షణం లేదు. నిన్ను మరిచిన క్షణం లేదు" అన్నాను.

శ్రావణి నన్ను తన గుండెలకు హత్తుకుంది. ఆ తర్వాత, ఇద్దరిలో, ఎవరు ముందు కదిలామో తెలియదు కానీ, మరుక్షణంలో ఇద్దరం ఒకరి కౌగిలిలో మరొకరం ఉన్నాం.

ఉదయం నీలిరంగు చీర కట్టుకున్నప్పుడు ఎన్ని అందాలు చూపిందో, విప్పి పడేసినప్పుడు అంతకన్నా ఎన్నో రెట్ల అందాలు కనువిందు చేశాయి. జీవితంలో ఏనాడు అనుభవించని అలౌకిక ఆనందాన్ని అనుభవించాను. అది కేవలం శారీరకమైన కామతృష్ణ కాదు. జీవితానికో సంపూర్ణత ను ప్రసాదించిన సంగమం అది.

తను నా పక్కన పడుకుని ఉన్న దృశ్యం అద్భుతంగా ఉంది.

ఆ అనుభూతిని శాశ్వతం చేసుకోవాలని నిర్ణయించు కున్నాను. సాధారణంగా, నేను అంతర్ముఖుణ్ణి. ఇంట్రావర్ట్‌ని! అంతులేని ఆలోచనలను నాలో నేనే అణుచుకుంటాను. వాటిని షేర్ చేసుకునేంత ఆత్మీయత, దగ్గరితనం ఎవరితోనూ లేదు నాకు.

అందుకే, నా ఆత్మీయ సర్కిల్‌లో నేనొక్కడినే! ఒంటరిని. నా అంతర్మథనం నాదే. నన్ను ఓదార్చే మనిషి లేడు. నా బాధ తీర్చుకోవడానికి, ఓదార్చడానికి కావాల్సిన భుజమే లేదు.

కానీ, ఆ క్షణంలోనే నాలో అనూహ్యమైన మార్పు వచ్చింది.

శ్రావణి వైపు తిరిగాను. అదే క్షణంలో తనూ నా వైపు తిరిగింది. నా ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుంది. ఇద్దరం నవ్వుకున్నాం. పిచ్చిపిచ్చిగా నవ్వాం.

తెల్లవారుజామున నాలుగ్గంటలవరకు మాట్లాడుకుంటూనే ఉన్నాం. ఏం మాట్లాడుకున్నామో ఇద్దరికీ గుర్తు లేదు.

అలసిపోవడం, సొలసి పోవడం, అలాగే నిద్రపోవడంలో అంత ఆనందముంటుందని తెల్లారి ఎనిమిది గంటలకు లేచేవరకూ తెలియలేదు. నేనైతే, ఫుల్లీ రీచార్జ్‌డ్.

నాలో, ఏదో కొత్త ఉత్సాహం, ప్రపంచాన్ని జయించినంత సంతోషం.

శ్రావణి కూడా అప్పుడే నిద్రలేచి, పురివిప్పిన నెమలిలా, మంచం మీద ఒళ్ళు విరుచుకుంది. ఒంటిమీద నూలుపోగు కూడా లేకుండా ఉండడం చూసుకుని గతుక్కుమని బెడ్‌షీట్‌ను కప్పుకుంది.

***(ఇంకావుంది)***




# 117 ఉత్తమ కథలు



**శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథలు**
ధర: 50 రూపాయలు
పేజీలు: 120

ఉత్తమ సాహిత్యానికి జన్మస్థానం సమాజ జీవితమే! దాని గమ్యస్థానమూ అదే! ఆ సత్యాన్ని ఆకళించుకుని తెలుగునాట దీపధారులైన రచయితలు ఎందరో మనల్ని ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళేందుకు గొప్ప కథా సంపద సృష్టించారు. చరిత్ర ఎప్పుడూ ఇంధనరూపంలో వర్తమానానికి వెలుగులు అందిస్తుంది. ఆ ఇంధనాన్ని ఈ తరానికి పంచి ఇచ్చే పనికి పూనుకుంది అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరుజిల్లా శాఖ. 'కథా స్రవంతి' పేరిట మూడున్నర దశాబ్దాలుగా చేస్తున్న కృషికి కొనసాగింపుగా ఈ సిరీస్‌లో మరో పదకొండు పుస్తకాలు విడుదల చేసింది. సమకాలీన సామాజిక సమస్యల్ని సవిమర్శనాత్మకంగా వాస్తవదృష్టితో కళ్ళకు కట్టిన రచయితల కథలివి. వారిలో కథాగ్రేసరుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఎనభై ఆరేళ్ళ క్రితం రాసిన 75 కథల్లోంచి ఎంపిక చేసిన ఏడు భిన్నమైన కథల పుస్తకం ఇందులో ఒకటి.

పట్టువదలని విక్రమార్కుడిలా పిఠాపురం రాజావారి కోటలో ప్రవేశించిన అత్తరు వ్యాపారి కథ 'గులాబీ అత్తరు', నోరుకట్టుకుని కూడబెట్టిన డబ్బుతో జరీచీరకొని భార్య సంతోషాన్ని ఆస్వాదించే కోర్టు గుమాస్తా యాజులు కథ 'పుల్లంపేట జరీచీర', అత్తాకోడళ్ళ మధ్య నలిగిపోతూ సాంసారిక మాధుర్యం చవిచూసే భర్త కథ 'ముళ్ళచెట్టూ కమ్మనిపువ్వూనూ'. చక్కని భాష నేర్చుకోవడానికి దోహదం చేసే కథలివి.

కథ, కవిత, విమర్శ రంగాలలో పేరొందిన సాహితీ త్రిముఖుడు, అగ్రశ్రేణి రచయిత, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత పాపినేని శివశంకర్. పరాయీకరణ, అశాంతి, అలజడి, ఆందోళన, అభద్రతలను ప్రముఖంగా తన కథల్లో చర్చకుపెట్టే ఎంపిక చేసిన ఆయన పది కథల పుస్తకం ఇది. ఇందులో 'చివరిపిచ్చుక' కథ రెండు చేతుల జీవి ఆగడాలకు మచ్చుతునక. 'సమస్తాన్నీ ధ్వంసం చేసే మనిషి చివరకు తానే ధ్వంసమగుగాక! ఇది ఈ చివరి పిచ్చుక శాపం, పిచ్చుక విసిరిన బ్రహ్మాస్త్రం' అనే వాక్యాలు జీవ వైవిధ్య స్ఫూర్తినీ, లోక హితాన్నీ చాటిచెబుతాయి. ఉన్నఊరు కన్నతల్లి అనే స్థానికతను చాటిచెప్పే కథ 'ఒక్క వాన కోసం'. అమెరికా నుండి వచ్చిన మనవడు, తాత జీవితంలోంచి సందేశం వెతుక్కోవడం ఈ కథ సారాంశం. 'చింతలతోపు' కథలో కిట్టమూర్తి మానసిక సంఘర్షణ కూడా ఇలాంటిదే! సామాజిక సంఘర్షణలకు, ఆర్తి, ఆవేదనలకూ ప్రతిరూపమై, ఆచరణాత్మక జ్ఞానాన్ని పెంచే కథలు ఇవన్నీ.



**ఎ.ఎన్.జగన్నాథశర్మ కథలు**
ధర: 50 రూపాయలు
పేజీలు: 112

కథా నిపుణుడు ఎ.ఎన్.జగన్నాథశర్మ పద్నాలుగు కథల సంపుటి మరోటి. స్కూలు పుస్తకాలు కొనేందుకు యాభై రూపాయల కోసం బొటనవేలును రంపానికి బలిచ్చిన కర్రలమిల్లులో కార్మికుడైన తండ్రిని గుర్తుకుతెచ్చుకునే కొడుకు కథ 'పేగు కాలినవాసన', నాలుగు డబ్బులకోసం బ్రహ్మచారి తాపం చల్లార్చిన పేద ఇల్లాలికథ 'తెగిపడిన పావురంరెక్క', లేమిని కావడి కుండల్లా పంచుకున్న దంపతుల కథ 'చుక్కెదురు', అర్ధరాత్రి ఆదమరపు నిద్రలో ముద్దిచ్చివెళ్ళే నాన్న, కొండల్లో తుపాకీతూటాలకు బలైన కొడుకు జ్ఞాపకాలు, ధనిక కామాంధుల పీచమణిచేందుకు పులిగా మారిన టీచరు రాంబాబు... ఈ పాత్రలన్నీ వ్యవస్థ వైఫల్యం కారణంగా పుట్టు కొచ్చినవేనని చాటి చెబుతారు జగన్నాథశర్మ.



**డా.పాపినేని శివశంకర్ కథలు**
ధర: 50 రూపాయలు
పేజీలు: 112

## ఈ తరం కోసం కథాస్రవంతి

ఇక జగమెరిగిన రచయిత అంపశయ్య నవీన్ రాసిన పది మనోవిశ్లేషణాత్మక కథలు, దగాపడ్డ సీమరైతు కడగండ్లను అత్యంత వాస్తవికంగా అక్షరబద్ధం చేసిన రచయిత సింగమనేని నారాయణ రాసిన 11 కథలు, పూసపాటి కృష్ణంరాజు 12 కథలు, శ్రీపతి కథలు 9, బోయ జంగయ్య కథలు 12, స్త్రీవాద, తాత్విక రచయిత్రి వసుంధరాదేవి కథలు 10, ముదిగంటి సుజాతారెడ్డి కథలు 10, అబ్బూరి ఛాయాదేవి 12 కథలను 'కథాస్రవంతి' పేరిట ఈ తరంవారి కోసం ప్రచురించింది అరసం.

తెలుగునాట నూటనాలుగేళ్ళ కథా చరిత్ర ఓ మహాసాగరం. అందులోంచి 117 ఆణిముత్యాల్లాంటి కథలు ఏర్చికూర్చింది అరసం. ఈ తరం యువత శ్రమలేకుండా చదువుకోవడానికి వీలుగా వెలువడిన 11 పుస్తకాల మాలిక ఇది.

**-రామ్మోహన్**

**ప్రచురణ:** అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరుజిల్లా శాఖ
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు



### ఎర్రడబ్బా కథలు

కొమ్మోజి మాణిక్యరావు
ధర: 100 రూపాయలు
పేజీలు: 112
ప్రతులకు: రచయిత, 11-15-7/1, రామిరెడ్డిపేట, నరసరావుపేట, గుంటూరు జిల్లా.

జీవితం నుండి పుట్టిన కథలు ఇవన్నీ. తపాలా శాఖలో తన జీవితానుభవాలను 30 వినోదాత్మక కథలుగా మలిచి ఒక పొత్తంగా అందించారు రచయిత. ఎంతో హాస్యాన్ని అందించే కథలు ఇవన్నీ.



### మట్టిమనిషి

పుప్పల నరసింహం కథలు
ధర: 300 రూపాయలు
పేజీలు: 392
ప్రతులకు: అన్ని పుస్తక దుకాణాలు

వెట్టిచాకిరితో అణగారిపోయిన, చాలీచాలని కూలి జీతంతో పూటగడిపే డెబ్భయ్యవ దశకంనాటి తెలంగాణ ప్రజల దారుణ పరిస్థితుల్ని రూపుగట్టిన కథలివి. హైదరాబాద్, రంగారెడ్డి మాండలికంలో గ్రామీణ జీవితాల్ని గ్రంథస్థం చేసిన కథలు. ఐతే 'దండాసి', 'నా రక్తమే నా రిక్షాకు పెట్రోలు' వంటి ఉత్తరాంధ్ర కథలూ ఉన్నాయి.

## స్వీకారాలు

### త్రిశక్తం

సంక్షిప్త భగవద్గీతాసారం
ఆంగ్ల రచన: డా.చంద్రారెడ్డి గవ్వ
అనువాదం: డా.వడ్డేపల్లి కృష్ణ
ధర: భక్తులకు ఉచితం, పేజీలు: 100
ప్రతులకు: రచయిత, 1-5-963, చైతన్యపురి, హైదరాబాద్-60, సెల్: 92465 41699.

### తెలుగు వైభవం

బాలల బుర్రకథ
రచన: డా.వడ్డేపల్లి కృష్ణ
ధర: 60 రూపాయలు, పేజీలు: 28
ప్రతులకు: రచయిత, 1-5-963, చైతన్యపురి, హైదరాబాద్-60, సెల్: 92465 41699.

అమ్మ పాలు అమృతంతో సమానం. దానికి ప్రత్యామ్నాయం లేదు. అమ్మపాలతోనే బిడ్డకు తొలి రుచి తెలుస్తుంది. అవే ఆ బిడ్డ పాలిట సంజీవని అవుతాయి. అమ్మ కడుపులోంచి బయటకు వచ్చిన తరువాత శారీరకంగా బిడ్డ పలు ఇబ్బందులకు గురవుతుంది. అప్పుడే అమ్మపాలు బిడ్డకు శ్రీరామరక్షగా నిలుస్తాయి. పలురకాల ఆరోగ్య సమస్యలను సమర్థంగా ఎదుర్కొనే శక్తి ఒక్క అమ్మ పాలకి మాత్రమే ఉంది. సృష్టిలో ఏ వస్తువుకైనా ఖరీదు కట్టే నవాబులు ఉండవచ్చేమో కానీ, అమ్మ పాలకు ఖరీదు కట్టేవారు లేరు అంటే అతిశయోక్తి కాదేమో! అయితే ఈ అమృతాన్ని కొందరు పిల్లలు పొందలేకపోతున్నారు. కొన్ని సంవత్సరాల క్రితం వరకూ కొందరు పిల్లలకు అమ్మ పాల రుచే తెలిసేది కాదు. అలాంటివారికి కూడా అమ్మ పాల రుచి తెలియజేయడానికే వెలిశాయి 'మదర్ మిల్క్ బ్యాంక్' 'డోనర్ మిల్క్ బ్యాంక్'లు. పేర్లు ఏవైనా వీటి లక్ష్యం ఒక్కటే! అమ్మ పాలు అందని పిల్లలకు వాటిని అందించడం. దేశవ్యాప్తంగా ఇలాంటి బ్యాంకులు చాలానే ఉన్నాయి. అసలు వీటి అవసరం ఎవరికి ఎంత ఉంటుంది? అన్న వివరాలు...

# అమృతాన్ని పంచుతున్న అమ్మలు

### తల్లి పాల గురించి

అప్పుడే పుట్టిన బిడ్డకు 150 మిల్లీలీటర్ల పాలు అవసరమవుతాయి. అయితే చంటి పిల్లలు గరిష్ఠంగా 300 మిల్లీలీటర్ల పాలు మాత్రమే తాగుతారు.

ఆరోగ్యవంతమైన తల్లుల్లో రోజుకు 600 నుంచి 700 మిల్లీలీటర్ల పాలు ఉత్పత్తి అవుతాయి.

తల్లి నుంచి సేకరించిన పాలను 63 డిగ్రీల ఫారిన్ హీట్ లోపు ఉష్ణోగ్రత వద్ద నిల్వ చేసినట్టయితే 90 రోజుల వరకూ ఆ పాలు నిల్వ ఉంటాయి. ఆ పాలను పాశ్చరైజ్ (pasteurize) చేసినట్టయితే ఆరునెలల వరకూ నిల్వ ఉండే అవకాశం ఉంది.

తల్లుల నుంచి సేకరించిన పాలను విడివిడిగా నిల్వ చేయవలసిన అవసరం ఉండదు. అన్నింటిని కలిపే నిల్వ చేయవచ్చు.

ఒక తల్లి తన బిడ్డకు సరిపడా పాలు ఇచ్చాక ఇంకా మరొక బిడ్డ కడుపు నింపే అవకాశం కూడా ఉంటుంది.

### ఎవరికి అవసరం?

సాధారణంగా శిశువు జన్మించిన కొద్ది గంటల్లోనే తల్లికి పాలు పడతాయి. కొందరికి నెలలు గడిచినా పాలు పడే అవకాశం ఉండదు. మరి కొందరు తల్లులకు ప్రసవం కాగానే తీవ్రమైన అనారోగ్యం సంభవిస్తే వైద్యుల సలహా మేరకు ఆ బిడ్డకు వేరే పాలు అవసరం అవుతాయి.

మరికొందరి దగ్గర బిడ్డకు సరిపోయే పాలు ఉండకపోవచ్చు. అలాంటప్పుడు పోత పాల మీద ఆధారపడడం కన్నా పైన చెప్పుకున్న మదర్ మిల్క్ బ్యాంక్‌ల మీద ఆధారపడవచ్చని నిపుణులు సూచిస్తున్నారు. అలాగే ప్రీమెచ్యూర్ బేబీస్ అంటే నెలలు నిండకుండానే పుట్టిన పిల్లలకు తల్లి పాలు మాత్రమే ఇవ్వాల్సి ఉంటుంది. అలాంటి సందర్భాలలో తల్లి దగ్గర పాలు లేనప్పుడు పిల్లలకు మదర్ మిల్క్ బ్యాంకులనుంచి, డోనర్ మిల్క్ బ్యాంకుల నుంచి సేకరించిన పాలు అందించాల్సి ఉంటుందని వారు చెబుతున్నారు.

### శిశుమరణాలు ఎక్కువే

మిగతా దేశాలతో పోల్చుకుంటే శిశు మరణాల శాతం మన దేశంలో కొద్దిగా ఎక్కువగానే ఉందన్న విషయం అధ్యయనాలు చెబుతున్నాయి. తక్కువ బరువుతో పుట్టడం, నెలలు నిండకుండానే జన్మించడం, పుట్టిన వెంటనే డయేరియా వంటి సమస్యలు శిశువుల మరణాలకు ఎక్కువ కారణమవుతున్నాయని పరిశోధకులు అంటున్నారు.

పై మూడు సమస్యల నుంచి శిశువులను కాపాడాలంటే తల్లిపాలు ఒక్కటే శరణ్యమని వారు అభిప్రాయపడుతున్నారు. శిశువుకు పాలు ఇచ్చే అలవాటు గత కొన్ని సంవత్సరాలుగా తగ్గుతూ వస్తోందని, దీన్ని ప్రోత్సహించాల్సిన అవసరం ఉందని చెబుతున్నారు. అప్పుడే శిశు మరణాలను కొంత వరకైనా అడ్డుకునే అవకాశం ఉందన్నది వారి అభిప్రాయం.

### తల్లికి మేలు

పుట్టగానే బిడ్డను కోల్పోయిన మహిళలు తమ పాలు దానం చేయడానికి సంకోచిస్తుంటారు. మరోసారి బిడ్డకు జన్మనిచ్చినప్పుడు పాలు రావేమోనన్నది కొందరి నమ్మకం. ఇది కేవలం అపనమ్మకమే అంటున్నారు నిపుణులు. ముఖ్యంగా పురిట్లోనే బిడ్డను కోల్పోయిన తల్లులు తమ పాలు దానం చేయడమే మంచిదని చెబుతున్నారు. పాలు రొమ్ములోనే ఉండిపోతే అవి కణుతులుగా మారే ప్రమాదం ఉంది. అలా కాకుండా తల్లి తన పాలను డొనేట్ చేయగలిగితే ఈ కణుతుల నుంచి ఇతరత్రా ఆరోగ్య సమస్యల నుంచి కూడా తప్పించుకోవచ్చు.

ముఖ్యంగా అలాంటి తల్లులకు మానసిక ప్రశాంతత, ఆనందం కలుగుతుంది అంటున్నారు మానసిక నిపుణులు. బిడ్డను కోల్పోయిన తల్లి తీవ్రమైన నిరాశా, నిస్పృహలకు గురవుతుందనీ అలాంటి సందర్భంలో పాలు డొనేట్ చేయగలిగితే మానసిక సంతృప్తి పొందవచ్చని వారు అంటున్నారు. యునిసెఫ్ లెక్కల ప్రకారం భారతదేశంలో అప్పుడే జన్మించిన పిల్లలు 40 శాతం మంది మాత్రమే తల్లి పాలు తాగగలుగుతున్నారు. 25 శాతం మంది ఆరునెలల వరకూ తల్లిపాలు పొందుతున్నారు.

### మన దేశంలో మొట్టమొదటిసారి

మిగతా దేశాలతో పోల్చుకుంటే మన దేశంలో తల్లిపాలు అందక చనిపోతున్న శిశువుల సంఖ్య అధికంగా ఉందన్న విషయం ఓ అధ్యయనంలో వెల్లడైంది.

తల్లి పాలు అందక చనిపోతున్న శిశు మరణాలు నివారించడానికి మొట్టమొదటిసారి ముంబయిలో 'మదర్ మిల్క్ బ్యాంక్'ను 1989లో ఏర్పాటు చేశారు. ఆ తరువాత దేశమంతా ఇలాంటి బ్యాంకులు ఏర్పాటయ్యాయి. ఒక్క తమిళనాడు రాష్ట్రంలోనే మదర్ మిల్క్ బ్యాంకులు పదుల సంఖ్యలో ఉన్నాయి. తెలుగు రాష్ట్రాలలో కొన్ని స్వచ్ఛంద సంస్థల వారు మదర్ మిల్క్‌ను సేకరించి పసిపిల్లలకు అందిస్తున్నారు. దేశవ్యాప్తంగా సుమారు 300 మదర్ మిల్క్ బ్యాంకులు ఉన్నాయి. అయితే వీటి ద్వారా సేకరించిన పాలు అందరి పిల్లలకూ సరిపోవడం లేదనీ, విదేశాల మాదిరిగా మరిన్ని మిల్క్ బ్యాంకులు ఏర్పాటు కావలసిన అవసరం ఉందని ముంబాయి వైద్యులు చెబుతున్నారు. మదర్ మిల్క్ బ్యాంకుల ద్వారా సేకరించిన పాలతో దేశవ్యాప్తంగా సుమారు 60 లక్షల మంది పిల్లలకు తల్లిపాల కొరత తీర్చగలిగినట్టు గణాంకాలు తెలియజేస్తున్నాయి.

### ఈ సూచనలు పాటించాల్సిందే!

పాలను డొనేట్ చేసే తల్లులు కచ్చితంగా ఆరోగ్యవంతులై ఉండాలని వైద్యులు సూచిస్తున్నారు. కొన్ని రకాల ఆరోగ్యసమస్యలు తల్లిపాల ద్వారా శిశువుకు వచ్చే అవకాశం ఉన్నందున తన పాలను డొనేట్ చేసే స్త్రీ ముందు కొన్ని పరీక్షలు తప్పనిసరిగా చేయించుకోవాలని వారు చెబుతున్నారు. చెస్ట్ ఎక్సరే, హెపటైటిస్ పరీక్ష, హెచ్ఐవి పరీక్షలు తప్పనిసరి అని వారు అంటున్నారు.

-దేవి

## ఎంతోమంది తల్లులకు ఆదర్శం

తల్లిపాలు దానం చేయకుండా వృథా చేసేవాళ్ళకు న్యూయార్క్‌కు చెందిన వెండీ క్రుజ్ చాన్ ఆదర్శం. సాధారణంగా బిడ్డను కోల్పోయిన తల్లి నిరాశా నిస్పృహలకు లోనవుతుంది. తనలో స్రవించే పాలను వృథాగా పారబోయడమో లేదా మందులతో వాటికి అడ్డుకట్ట వేయడమో చేస్తారుతప్ప వాటిని డొనేట్ చేసి పిల్లల ప్రాణాలను రక్షించాలన్న ఆలోచన చాలా తక్కువమందికి వస్తుంది. ఇలాంటి ఆలోచనతోనే కొన్ని నెలల పాటు తన పాలతో ఎంతోమంది పసిపాపలను కాపాడిన వెండీ క్రుజ్ చాన్ అనుభవాలు ఆమె మాటల్లోనే...

'నెలలు నిండిన తరువాత పుట్టిన నా బిడ్డ ఎక్కువసేపు బతకలేదు. రకరకాల ఆరోగ్య సమస్యలతో వెంటనే కన్నుమూశాడు. ఆ దుఃఖం తట్టుకోవడం నాకూ నా భర్తకూ చాలా కష్టమనిపించింది. ప్రసవం అయిన వారం రోజుల తరువాత ఇంటికి వచ్చేశాను. ఇంటికి వచ్చిన రెండు మూడు రోజులకి పాలు కారడం మొదలైంది. పాలను పారబోయడం కన్నా తల్లిపాలు కరవైన బిడ్డలకు అందించాలన్న ఆలోచన అప్పుడే కలిగింది. నా ఆలోచనను నా భర్త కూడా సమర్థించాడు. అప్పుడే సోషల్ మీడియా ద్వారా తల్లిపాలు కరవైన పిల్లల గురించి తెలుసుకున్నాను. వారిలో నా స్నేహితుల పిల్లలు కూడా ఉన్నారు. అలా ఆరుగురు పిల్లలకు నా పాలను అందించాను. వారికే కాకుండా మిగతా వారికీ అందించాను. ఇప్పటివరకూ సుమారు అరవై లీటర్ల పాలను పిల్లలకు ఇచ్చాను. నా పాలు ఇస్తున్నందుకు నేను ఏమీ చార్జ్ చేయను. కేవలం పిల్లల ఫోటోను మాత్రం అడిగి తీసుకుంటాను. ఆ పిల్లల్లో నా కొడుకును చూసుకుంటాను. మరోసారి గర్భం దాల్చడానికి సిద్ధమవుతున్నాను. నేను పాలు అందిస్తున్న పిల్లలు కూడా కొద్దిగా పెద్దగా అయ్యారు. ఇక వారికి నా అవసరం ఉండదని అనుకుంటున్నాను. తల్లులకు నేను ఇచ్చే సలహా ఒక్కటే, తమ పిల్లలకే కాకుండా మిగతా పిల్లలకు కూడా తమ పాలు అందించి తల్లులు కావచ్చు. అలా చూసుకుంటే ఇప్పటికి నాకు చాలా మంది పిల్లలు ఉన్నట్టే లెక్క! పాలను డొనేట్ చేయడంలో ఉన్న సంతృప్తి మాటలకు అందనిది. అది ఎవరికి వారు అనుభవించాల్సిందే!






# వచ్చార్రోయ్!

**రోడ్డుకి అడ్డంగా కార్లు ఆగి ఉండటం రాజశేఖర్‌కి చిరాకు రప్పించింది. రెండుకార్లు ఆగి ఉన్నాయి. కుడివైపు ఒకటి, ఎడమవైపు ఒకటి. రెండింటి మధ్య నుంచి తప్పించుకుపోయే వీలులేదు. కార్లు ఎలా ఆపారంటే ఒక కారు పక్కన ఉంటుంది. రెండో కారు ఎదురుగా అడ్డంగా ఉంటుంది. దాంతో సందు తిరిగి వచ్చే వారు లోపలకు వస్తారు కానీ ఎటూ పోలేరు.**

'వెధవలు రోడ్డుకి అడ్డంగా కార్లు ఆపుతారు. సెన్స్ లేదు' విసుక్కుని హారన్ కొట్టాడు రాజశేఖర్.

ఇంతలో కార్లలోంచి నలుగురు మనుషులు దిగారు.

వాళ్ల చేతుల్లో ఆయుధాలు చూడగానే అతడికి విషయం అర్థమైపోయింది. వెంటనే మొబైల్ 'ఆన్' చేశాడు. కానీ అతడికి ఫోనుచేసే అవకాశం లభించలేదు. వాళ్లల్లో ఒకడు డ్రైవర్ కిటికీ అద్దం బద్దలు కొట్టాడు.

•••

సంఘటన జరిగిన స్థలంలోకి ఎవరూ రాకుండా పోలీసులు అడ్డుకట్టారు.

'ఆఫీసు నుంచి రాత్రి పదకొండు గంటలకు బయలుదేరాడు. ఉదయం నాలుగు గంటలకు పాలవ్యాన్ వాళ్లు రోడ్డుకి అడ్డంగా కారు ఉందని ఆగి, దిగి చూశారు. డ్రైవర్ సీటులో శవం చూసి మాకు ఫోన్ చేశారు' చెప్పాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

ఆగి ఉన్న కారుని పరిశీలించటం ప్రారంభించాడు శరత్. దొరికిన వేలిముద్రలు తీసుకున్నాడు.

శవం డ్రైవర్ సీటులో ఉంది. సీటు బెల్టు అలాగే ఉంది.

మరోవైపు నుంచి తలుపుతీసి కారు లోపల పరిశీలించటం ప్రారంభించాడు.

అద్దం ముక్కలు పడి ఉన్న విధానం గమనించాడు. శరీరంపైన గాయాలు పరిశీలించాడు.

ఇంతలో అతడిదృష్టి డ్రైవర్‌సీటుకింద ఉన్న మొబైల్ ఫోన్‌పై పడింది. జాగ్రత్తగా దాన్నితీసి చూశాడు. ఎలాంటి లాక్‌లేదు. అది వీడియో మోడ్‌లో ఉంది. రికార్డు చేసే స్థలం అయిపోయిన తరువాత ఆటోమాటిక్‌గా ఆగిపోయింది!

'జరగబోయేది గ్రహించి సెల్‌లో రికార్డు చేయటం ఆరంభించాడన్నమాట. కానీ వాళ్లు కొట్టే దెబ్బల తాకిడికి సెల్ కింద పడిపోయి ఉంటుంది' విజయ్‌కి వివరించాడు శరత్.

'ఏం రికార్డయింది?' అడిగాడు విజయ్.

'అది చూడటానికే పిలిచాను. ఇదే సాక్ష్యం అవుతుంది' అని అసిస్టెంట్ రామువైపు తిరిగాడు శరత్. 'రామూ, వివరాలు సేకరించావా?'

'ఎస్ బాస్... మృతుడి పేరు రాజశేఖర్. వ్యాపారి. బాగానే సంపాదిస్తున్నాడు. ఇంకా పెళ్లి కాలేదు. సంవత్సరం క్రితం తండ్రి పోయినప్పటి నుంచీ వ్యాపారం అతనే చూస్తున్నాడు. బాగానే నడుస్తోంది'.

'హత్యకు కారణం ఏమైనా తెలిసిందా?'

'బాస్... అడిగిన వాళ్లంతా ఏమీ తెలియదంటున్నారు. వ్యాపారంలో కూడా ఎవరితోనూ విరోధాలు లేవు. మంచివాడనే అంటున్నారు' వీడియో ఆరంభమవటంతో మాటలు ఆపాడు రాము.

తెరపై చీకటిగా కనిపిస్తోంది. ఆకారాలు అస్పష్టంగా ఉన్నాయి. హడావిడిలో సెల్‌ను సరైన స్థలంలో పెట్టినట్టు లేదు.

జరిగింది ఊహించే వీలునిస్తోంది. కానీ స్పష్టంగా తెలియడం లేదు.

వీడియో ఎనలిస్ట్ వీణకు ఫోన్ చేశాడు శరత్. ఆమె చెప్పింది విన్నాక 'గుడ్' అని ఫోన్ పెట్టేశాడు.

'సరికొత్త సాఫ్ట్‌వేర్ వచ్చిందట. దాని ఆధారంగా వీడియోలో అస్పష్టంగా ఉన్న వస్తువుల ఆకారాలను స్పష్టం చేయవచ్చుట. వీణకు పంపించి చూస్తాను' చెప్పాడు శరత్.

'ఎలాంటి ఆధారాలు దొరకటం లేదు. నగరంలో పెద్ద వ్యాపారి హత్య జరిగింది. పోలీసులు ఏమీ చేయటం లేదని విమర్శలు వెల్లువెత్తుతున్నాయి' చెప్పాడు విజయ్.

**నగరంలో ఓ వ్యాపారి కారులో వెళుతుండగా హత్యకు గురయ్యాడు. సంఘటనా స్థలాన్ని పరిశీలించాడు డిటెక్టివ్ శరత్. హతుడి శరీరంపై సీటుబెల్టు అలాగే ఉంది. కారును క్షుణ్ణంగా పరిశీలించాడు. దొరికిన వేలిముద్రలు తీసుకున్నాడు. డ్రైవింగ్ సీటుకింద సెల్‌ఫోన్ ఉంది. శరత్ దృష్టి దానిమీద పడింది. దాన్ని వీడియో అనలిస్టుకు పంపించాడు. శరత్‌కు అందులో ఏవైనా స్పష్టమైన ఆధారాలు లభించాయా? ఈ కేసు ఎలా పరిష్కారమైంది?**

విజయ్ మాటలు విననట్టే రామువైపు తిరిగాడు శరత్. 'రామూ... వ్యాపారంలో ఎలాంటి సమస్యలు లేవు. ఇంట్లో గొడవలు లేవు. ఏమైనా సంబంధాలున్నాయేమో చూడు. ఆఫీసులోగానీ స్నేహితులతో కానీ ఏవైనా అక్రమ సంబంధాలు లాంటివి హత్యకు దారితీసి ఉండవచ్చు'.

'బాస్... ఆ కోణంలో కూడా పరిశోధన ప్రారంభించాం. త్వరలో ఏదో ఒకటి తేలుతుంది' అన్నాడు రాము.

ఇంతలో రాము అసిస్టెంట్ ఓ ఫైలు తెచ్చి ఇచ్చాడు. దాన్ని శరత్‌కి అందించి, 'బాస్... రాజశేఖర్ కాల్ డేటా, బ్యాంకు లావాదేవీలు ఇంకా ఇతర వివరాలు ఇందులో ఉన్నాయి' చెప్పాడు రాము.

వాటిని పరిశీలించటంలో మునిగిపోయాడు శరత్.

•••

'చాలా మంచివారండి. ఆయనతో ఎవరికీ ఎలాంటి సమస్యా లేదు' రాజశేఖర్ సెక్రటరీ రమ చెప్పింది.

'ఎవరినైనా బాధించటం, నొప్పించటం, జీతం కట్ చెయ్యటం, లీవు ఇవ్వకపోవటం.... ఇలాంటివి ఏమైనా ఉన్నాయా?'

'లేదండి. చాలా అండర్‌స్టాండింగ్ ఉన్న వ్యక్తి మా బాసు' చెప్పింది రమ.

ఇంకా ఆఫీసులో ఇతర స్టాఫ్‌ను ప్రశ్నించాడు శరత్. ఎలాంటి ఆధారాలు లభించలేదు. ఆలోచిస్తూ ఆఫీసు వదిలి వెళుతున్న శరత్‌కు వీణ నుంచి ఫోను వచ్చింది.

•••

'ఇది చూడు...' చూపించింది వీణ.

ఒక అస్పష్టమైన ఆకారం తెరపై కనిపిస్తోంది. అంతలో హఠాత్తుగా ఆ వ్యక్తి కళ్లు కనిపించాయి. అంతే...

'ఇంతకన్నా మరేమీ తెలియదా?' అడిగాడు శరత్ నిరాశగా.

'సారీ.. లైటింగ్ సరిగ్గా లేదు. నిజానికి లైటు ఏ మాత్రం ఉన్నా వ్యక్తి ముఖం స్పష్టంగా కనిపించేది. కానీ.. ఇంతకన్నా ఇంకా బాగా చూపించడం కుదరదు' అంది వీణ.

మరోసారి వీడియో చూడటం మొదలుపెట్టాడు శరత్.

'ఎంతచూసినా అంతే' అంది వీణ నవ్వుతూ.

వీడియో చూస్తున్న శరత్ హఠాత్తుగా వీణవైపు తిరిగాడు.

'వీణా.. ఇది చూడు' అన్నాడు.

వీణకు శరత్ ఏం చూడమంటున్నాడో అర్థం కావటం లేదు.

మళ్లీ చూపించాడు శరత్. వీణకు అర్థం కాలేదు.

'నేను వందసార్లు చూశాను. నాకు కనబడనిది నీకేం కనిపిస్తోంది?' అడిగింది. ఓపికగా వివరించాడు శరత్.



'ఇటు చూడు. అతడు వీడియో ఆన్‌చేసి పెట్టాడు. కారు తలుపులు విరగ్గొట్టటం తెలుస్తోంది. కానీ సెల్ కదులుతోంది అదురుకు. దాంతో అతడు పెట్టిన కోణం మారు తోంది'.

'అవును. అందుకనే కదా ఏదీ సరిగ్గా రికార్డు కాలేదు'.

'ఇప్పుడు చూడు...' అంటూ ఊపిరి బిగబట్టాడు శరత్.

వీణ ఏకాగ్రతతో చూడసాగింది.

'ఇదిగో.. ఇప్పుడు' అరిచాడు శరత్.

వీణకు అర్థం కాలేదు. 'ఏమైంది?' అడిగింది.

మళ్లీ రివైండ్ చేసి స్లోమోషన్‌లో చూపించాడు శరత్.

కెమేరా అదురుతోంది. దాడి చేస్తున్నవాడు రాజశేఖర్‌ని లాగాడు. కానీ సీటుబెల్టు ఉంది. ఇప్పుడు కెమేరా కదిలి పడబోతోంది' ఆపాడు శరత్. ఇంకా నెమ్మదిగా దృశ్యాన్ని కదపసాగాడు.

'ఇప్పుడు చూడు. కెమేరా కింద పడేముందు ఎగిరినట్టుంది. ఆ సెకనులో వందవ వంతు సమయంలో వెనుక ఉన్నవారు కనిపిస్తున్నారు' ఆపాడు శరత్.

'ఓ మైగాడ్' అంది వీణ. 'నేనెలా మిస్ అయ్యాను?' అంది.

'ఆ సెకనులో వందవ వంతు సమయంలో వెనుక కారు నంబరును కెమేరా రికార్డుచేసింది. నువ్వు ఆ నంబరు కనుక్కుని చెప్పాలి' అన్నాడు శరత్.

'నేను మనుషులపై దృష్టి కేంద్రీకరించాను' సంజాయిషీ ఇస్తున్నట్టు చెప్పింది వీణ.

'డిటెక్టివ్ పని అంటే కనబడేది చూడటమే కాదు. కనబడకుండా దాక్కున్నదాన్ని వెతికి వెలికి తీయడం' అన్నాడు శరత్.

•••

తలుపు తెరుచుకుంది. ఓ నడివయసు వ్యక్తి తలుపు తీశాడు. 'ఏం కావాలి?' అడిగాడు శరత్‌ని.

'సుందరరామయ్య ఇల్లు ఇదేనా?'

'నేనే సుందరరామయ్య. ఏం కావాలి?'

కారు నంబరు చెప్పాడు శరత్. 'ఈ కారు మీదేనా?'

'అవును'

'ఇరవై రెండవతేదీ రాత్రి మీ కారును మీరే నడిపారా?'

ఆయన బుర్రగోక్కున్నాడు. 'నేను ఆఫీసుపని మీద వారమంతా టూర్‌కి వెళ్లాను. ఏమే, అశోక్ ఏమన్నా కారు బైటకు తీశాడా?'

'ఆ... ఏదో పార్టీకి వెళ్లాలని తీశాడు' లోపల నుంచి సమాధానం వినిపించింది.

'ఎందుకు? ఏమైంది?' అడిగాడాయన.

'అశోక్‌ని పిలుస్తారా?' అడిగాడు శరత్.

'వాడు హాస్టల్‌కి వెళ్లిపోయాడు నిన్ననే'.

•••

'నిన్నటిదాకా ఉండాలండీ.... సెలవులు కూడా లేవు. ఎటు వెళ్తున్నాడో చెప్పలేదు. నిన్న ఇంటినుంచి ఫోను వచ్చింది. ఫోన్ రాగానే వెళ్లిపోయాడు' చెప్పాడు అశోక్ రూమ్‌మేట్.

'అతనికి ప్రాణస్నేహితులు ఎవరు?'

'ప్రాణ్, ప్రకాశ్, శ్రీహాస్'

'వాళ్ల రూమ్ నంబర్లు చెప్పు' అడిగాడు శరత్.

•••

'విజయ్... నలుగురు యువకులు. పొద్దున్నే బయలుదేరారు. వాళ్ల ఫోటోలు పంపుతున్నాను. రైళ్ల, బస్సులు, హైవేలలో పెట్రోలింగ్ వాళ్లకి కబురుపంపు. వీళ్లల్లో ప్రకాశ్‌కి కారు ఉంది. కారు నంబరు కూడా వాట్సప్‌లో పంపాను. వీళ్లు దొరికితే రాజశేఖర్ హత్యకేసు క్లోజ్ అయినట్టే' చెప్పాడు శరత్.

'వీళ్లకీ రాజశేఖర్‌కీ సంబంధం ఏమిటి?'

'అదే తెలుసుకునే ప్రయత్నంలో ఉన్నాను' చెప్పాడు శరత్.

•••

'వాళ్లకీ, రాజశేఖర్‌కీ ఎలాంటి సంబంధం లేదు బాస్. వాళ్ల తల్లిదండ్రుల ఉద్యోగపరంగా కానీ, సంబంధాల పరంగా కానీ రాజశేఖర్‌కి వీళ్లకి ఎక్కడా కలవటం లేదు. ఆ నలుగురూ దొరికితేగానీ మనకు కారణం తెలిసేట్టు లేదు'.

రాము మాటలు 'పూర్తవుతుంటే శరత్‌కు ఫోన్ వచ్చింది. ఫోనులో మాట్లాడి రామువైపు తిరిగాడు శరత్. 'చలో రాము' అన్నాడు లేస్తూ.

•••

ఊరు అవతల ఉన్న రిసార్టు అది. యువతీ యువకులు రహస్యంగా కలవటానికి, ఇతరులు తాగటానికి వస్తారు ఆ రిసార్టుకి.

రిసెప్షన్ కౌంటర్‌కి వెళ్లాడు విజయ్. 'రూమ్ నంబరు 25' అన్నాడు శరత్‌తో.

ముగ్గురూ గది వెతుకుతూ వెళ్లారు. తలుపు కొట్టేలోగా తలుపు తెరుచుకుంది.

షార్ట్స్‌లో ఓ యువకుడు తలుపుతెరచి బైటకు రాబోయాడు. బైట ఉన్న వీళ్లనిచూసి భయంతో కేకపెట్టాడు. 'వచ్చార్రోయ్' అని తలుపు మూయబోయాడు.

శరత్ తలుపుకి కాలు అడ్డుపెట్టాడు. లోపలి నుంచి ఒకడు పెద్ద సుత్తి పట్టుకుని పరుగెత్తి వచ్చాడు. శరత్ పక్కకు జరిగి వాడిచేయి పట్టి మెలి తిప్పాడు.

విజయ్ తుపాకీ తీసి 'హ్యాండ్సప్... ఎవరూ కదలవద్దు' అన్నాడు.

•••

'నలుగురు యువకులూ క్లాస్‌మేట్స్. ఈ మధ్యనే విడుదలైన ఓ సినిమా చూశారు. సినిమాలో ఇలాగే నలుగురూ నేరంచేసి తప్పించుకుంటారు. తామూ అలా చేస్తే ఎలా ఉంటుందనుకున్నారు. పథకం వేశారు. రోడ్డుకు అడ్డంగా కార్లు ఆపారు. ఆవైపు వచ్చే తొలికారులో ఉన్న వారిని బెదిరించటమో, కొట్టటమో చేసి థ్రిల్ పొందుదామనుకున్నారు. థ్రిల్ ఎక్కువైంది. రాజశేఖర్ మరణించాడు. అయితే, తమకూ అతడికీ సంబంధం లేదు కాబట్టి తమ నేరం ఎవరూ గుర్తించలేరనుకున్నారు. అశోక్‌వాళ్ల నాన్న ఫోన్ చేయగానే బెదిరారు. కానీ ఎటు పారిపోతారు?' నేరం చేసినవాడు ఎలాగోలా పట్టుబడి తీరతాడు' కేసు వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**

**ఒక్క నిమిషం మొత్తం బ్లాంక్‌గా అయ్యాడతను. అసలేమీ అర్థం కావటం లేదు.**
**శరీరమంతా చచ్చుబడిపోయినట్టైంది. కింద కూలబడిపోయాడు. 'ఇది నిజమేనా? ఒకవేళ ఫేక్ కాల్ అయి ఉండచ్చేమో. కానీ ఎవరైనా సరదాకి ఇలాంటి ఫోన్లు చేస్తారా?"**
**ఊపిరి ఆడనట్లుగా ఉంది.**

కళ్ళకు గంతలుకట్టి, గాలి, వెలుతురు లేక చాలీచాలని గదిలో పడేసినట్లుగా ఉంది.

చెప్పలేనంత బరువు గుండెల మీద ఉన్నట్లుంది.

గొంతుకకేదో అడ్డం పడుతోంది.

ఏదైనా చేయగలిగితే బాగుణ్ణు. కానీ ఏం చేయగలడు తను?

చనిపోకపోతే ఏదైనా చేయటానికి ప్రయత్నించవచ్చు. కానీ అప్పటికే పోయారంటున్నారు.

అసలేం జరిగిందో తెలుసుకోవటానికీ, వెంటనే వెళ్ళటానికి కూడా వీల్లేనంత దూరం.

నిస్సహాయ పరిస్థితి.

ఇదివరకు ఒకసారి తల్లిదండ్రులు యాక్సిడెంట్‌లో చనిపోయారని తెలిసినప్పుడు ఈ బాధ అవగతమే తనకి. అప్పుడు ఓదార్చటానికి అక్క ఉంది. ఇప్పుడు ఎవరున్నారు? ఎవరూ లేరు. తాను ఒంటరి, ఈ ప్రపంచంలో తనకి ఎవరూ లేరు.

"అమ్మా!" మోకాళ్ళమీద కూర్చుని జుట్టు పీక్కుంటూ గట్టిగా ఏడ్చాడు.

తెల్లవారుజాము మూడవుతోంది. మళ్ళీ ఇండియన్ అసోసియేషన్ వాళ్ళు ఫోన్ చేస్తారేమో అని ఫోన్ వంకే చూస్తున్నాడు. వాళ్ళు ఏదో ఫోన్‌కార్డ్ నుంచి చేసినట్లున్నారు. ఆ నంబర్‌కి డయల్ చేస్తే ఇన్‌వాలీడ్ నంబర్ అని వస్తోంది.

ఫోన్ వంకే చూస్తున్నాడు.

హర్షకి ఫోన్ చేస్తే...?

చేతులు వణుకుతున్నాయి. రోజూ చేసే నంబరే అయినా కళ్ళు మసకబారుతున్నాయి. చేతులు పట్టుతప్పుతున్నాయి. బలం లేనట్లుగా ఉంది.

'హర్ష నంబర్ దొరకదేమిటి? పొరబాటున డిలీట్ అయిందా?"

రెండు మూడు సార్లు వెతికాక కనబడింది నంబర్.

రింగ్ అవుతోంది.

"వాట్సప్ అక్కీ? ఈ టైమ్‌లో చేశావు?" నిద్రమత్తు తెలుస్తోంది హర్ష గొంతులో. మాట తడబడుతోంది అక్షయ్‌కి.

"హర్షా! ఇప్పుడే యుఎస్ నుంచి ఫోన్ వచ్చింది. అక్కావాళ్ళు యాక్సిడెంట్‌లో పోయారంటున్నారు" చెప్పాడు.

"ఏంటీ?" షాక్‌తిన్నాడు హర్ష. దెబ్బకి నిద్రంతా తేలిపోయిందతనికి.

"నేనిప్పుడే బయల్దేరతాను. అక్కీ, బీ స్ట్రాంగ్" చెప్పాడు హర్ష.



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

5

- కంఠంనేని స్వప్న



గబగబా బట్టలు మార్చుకుని, ఇంట్లో తన దగ్గర ఉన్న క్యాష్, ఒక జత బట్టలు సర్దుకుని, ఇల్లు లాక్‌చేసి బయల్దేరాడు హర్ష.

'ఎందుకిలా జరుగుతోంది? అక్షయ్ పేరెంట్స్ ఇలాగే అకస్మాత్తుగా రోడ్ యాక్సిడెంట్‌లో పోయారు. ఇప్పుడతని అక్క కుటుంబం. కొందరి జీవితాలు చూస్తుంటే శాపగ్రస్తులేమో అనిపిస్తుంది. హెరిడిటరీ అనేది జీన్స్‌వల్ల మాత్రమేనా? కొన్ని కుటుంబాల్లో రెండు, మూడు జనరేషన్స్ ఒకే రకమైన చావుకి గురవటం వింటూనే ఉంటాం. ఇంకొన్ని కుటుంబాల్లో సూసైడ్స్ వారసత్వ లక్షణాలేమో అనిపిస్తాయి. గురుదత్, అతని కొడుకు; ఉదయ్ కిరణ్, అతని అన్న... ఇలా ఎన్ని వినట్లేదు? తనకి తెలిసిన ఒక ఫ్రెండ్ కుటుంబంలో అతని తండ్రికి, చెల్లెలికి కిడ్నీ డిసీజ్. ఆస్తులన్నీ కరిగించుకుని వైద్యం చేయిస్తుండగా తేలింది, అతని మూడేళ్ళ కొడుకుకి కూడా అదే వ్యాధి అని.

ఎలా తట్టుకుంటాడు అక్షయ్? అతనికి ఇంకెవరున్నారు? వాళ్ళొసార్తని ఎంతో సంతోషంతో ఉన్నాడు.

దారి పొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాడు హర్ష.

అతని ఇంటి నుంచి అక్షయ్ అపార్ట్‌మెంట్‌కి డ్రైవ్ టైమ్ అరగంటపైనే.

అయినా కార్ వేగంగా పోనివ్వటంతో పావు గంటలో అక్షయ్ ఉండే అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్ ముందున్నాడు.

కార్ పార్క్‌చేసి గబగబా అతని అపార్ట్‌మెంట్ బెల్ కొట్టాడు.

అతి ప్రయత్నం మీద లేచి తలుపు తీశాడు అక్షయ్.

నిస్సత్తువగా ఉన్నాడతను.

ఒక్క పూటకే చాలా కుంగిపోయినట్లు కనిపిస్తున్నాడు.

అసలేం జరిగింది అడిగాడు హర్ష.

తనకి వచ్చిన ఫోన్ గురించి చెప్పాడు అక్షయ్. "అంతకు మించి ఏ వివరాలు లేవు. ఎవరికి కాల్ చేయాలో కూడా తెలీట్లేదు".

"నువ్వు చాలా నీరసంగా ఉన్నావు. కాసేపు రెస్ట్ తీసుకో. ఫోన్ వస్తే నేను మాట్లాడతాను" అన్నాడు హర్ష.

సోఫాలో వెనక్కి వాలి కూర్చున్నాడు అక్షయ్.

నిద్ర, మెలకువ కాని పరిస్థితిలో ఉన్నాడతను.

ఇంట్లో అక్క, బావ, అక్క కూతురు నైరా తిరుగుతున్నట్లు కల. నిజమని భ్రమ కలగజేసే కల. నైరా పసిపిల్లలా ఉంది. అక్క తనకి అందిస్తోంది. తను నైరాని ఎత్తుకుని ఎగరేస్తున్నాడు. ఆమె కిలకిలా నవ్వుతోంది. అక్క ఏవేవో కబుర్లు చెప్తోంది.

సడన్‌గా మెలకువొచ్చింది.

చాలా ఫ్రెష్‌గా ఉందతనికి. ఒక రకమైన ప్రశాంతత మనసంతా ఆవరించుకుంది.

అప్పుడే ఫోన్‌లో మాట్లాడుతూ కనబడ్డాడు హర్ష.

కొద్ది సెకండ్లలో వాస్తవంలోకి వచ్చాడు అక్షయ్. తల మీదెవరో గట్టిగా కొట్టి రియాలిటీలోకి తీసుకొచ్చినట్లుగా ఉంది.

"సారీ అక్కీ! యాక్సిడెంట్‌లో పోయారట. వాళ్ళ ఫ్రెండ్స్ అన్ని ఫార్మాలిటీస్ పూర్తిచేసి బాడీస్‌ని ఇండియా పంపించే ప్రయత్నంలో ఉన్నారు" బాధగా చెప్పాడు హర్ష.

"హర్షా! ఏదో సాధించాలని ఎంతో స్ట్రగుల్ అవుతాం. చచ్చేట్లు కష్టపడి చదువుతాం. ఫ్యూచర్‌లో సుఖంగా ఉండాలని అందరూ ఉన్నప్పుడు గ్రాంటెడ్‌గా తీసుకుని పరుగులు తీస్తుంటాం. సడన్‌గా ఒకరోజు ఎవరూ మిగలరు. అప్పుడు అర్థమవుతుంది.

ఆ తర్వాత మనం ఏం చేసినా వృథానే! మన విజయాలు చూసి సంతోషించే వాళ్ళుండరు. అసలు ఇప్పుడు నా ఉనికికి అర్థం ఏముంది? నాకీ ప్రపంచంలో ఎవరూ మిగలలేదు. నేను ఎంత సక్సెస్‌ఫుల్ అయినా, ఎన్ని డబ్బులు సంపాదించినా ఏమి లాభం? వాళ్ళుండి ఉంటే నాకీ ప్రపంచంతో పని ఉండేది కాదు. వాళ్ళు లేనప్పుడు ప్రపంచాన్ని మాత్రం ఏమి చేసుకుంటాను? నాకెవరూ లేరంటే చాటా డిప్రెసింగ్‌గా ఉంది" తల కిందకి వాల్చుకుని నేలనే చూస్తూ అన్నాడు

## జరిగిన కథ

అదో మల్టీ నేషనల్ కంపెనీ! రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. అదే ఆఫీసులో కొత్తగా చేరిన సీమ, అక్షయ్ స్నేహితురాలని తెలిసి ఉడికిపోయింది కావ్య. రాజేష్ ప్రపోజల్‌కి కావ్య అంగీకరించక పోవడంతో ఆమెపై పనిభారం పెంచాడు. ఫైనాన్స్ టీమ్‌లో పనిచేసే మానస బిల్డింగ్‌పైనుంచి దూకి చనిపోయిందనే వార్త సంచలనం అయింది. అక్షయ్ వాళ్ళ అక్కాబావ యుఎస్ నుంచి వస్తున్నారని తెలిసి ఎంతో సంతోషిస్తాడు. ఇంతలో వాళ్లు యాక్సిడెంట్‌లో చనిపోయారనే వార్త అతణ్ణి అతలాకుతలం చేస్తుంది.

**ఆ తర్వాత...**

అక్షయ్.

"ఎవరూ లేరంటావేమిటి అక్కీ? నైరా బాధ్యత నీదే కదా! తనని జాగ్రత్తగా పెంచి పెద్ద చేయాలి."

చివ్వున తలెత్తాడు అక్షయ్.

ఫోన్‌లో ఆ విషయం వినేసరికి తనకి బుర్ర పని చేయలేదు. నిజమే కదూ...వాళ్లు పాప గురించి ఏమీ చెప్పలేదు.

"నైరా... నైరా బాగానే ఉందా?" ఆశగా అడిగాడు అక్షయ్.

"ఆ టైమ్‌లో తను వాళ్లతో లేదట. జ్వరంగా ఉండేసరికి నానీతో వదిలి వెళ్ళారట. షి ఈజ్ ఫైన్! తనకేమీ కాలేదు" చెప్పాడు హర్ష.

'కొంతలో కొంత నయం. తన అనబడేవాళ్లు ఒకళ్లైనా మిగిలారు. జీవితంలో కొద్దిగా వెలుగు కనబడుతోంది అనుకున్నాడు అక్షయ్.

'ఒక్కతే ఎలా ఉందో అక్కడ. తల్లిదండ్రులు ఇకరారు అనే వాస్తవాన్ని ఎలా తట్టుకుంటుందో ఆ చిన్నబుర్ర' బాధగా అనుకున్నాడు.

"అక్కీ! నువ్వు ధైర్యంగా ఉంటేనే పాప బాగుంటుంది. తనకి వాళ్లు లేరనే తేడా తెలీకుండా, ఎటువంటి లోటు రాకుండా పెంచాలి' చెప్తున్నాడు హర్ష.

అప్పటికే ఆఫీస్ గ్రూప్‌లో మెసేజ్ చేసినట్లున్నాడతడు.

ఒక్కొక్కరుగా వస్తున్నారు.

"వి ఆర్ వెరీసారీ అక్షయ్" చెప్తూనే తలా ఒక పని చేతిలోకి తీసుకున్నారు.

సీమ కిచెన్‌లోకి వెళ్ళి టీ కలుపుతోంది.

సుధీర్ తెలిసిన ఫ్రెండ్స్‌కి ఫోన్స్, ఈ-మెయిల్స్ చేస్తూ అమెరికా నుంచి ఇండియాకి డెడ్ బాడీస్‌ని పంపే విధానం గురించి తెలుసుకుంటున్నాడు.

కావ్య అక్కడే సోఫాలో కదలకుండా కూర్చుంది.

**భవిష్యత్తులో సుఖంగా ఉండాలని, ఏదో సాధించాలని పరుగులు తీస్తుంటాం. ఏదో ఒకరోజున ఎవరూ మిగలరు. మన విజయాలు చూసి సంతోషించే వాళ్లుండరు. అసలిప్పుడు నా ఉనికికి అర్థం ఏముంది? ఎంత డబ్బు సంపాదించినా ఏం లాభం? చాలా డిప్రెసింగ్‌గా ఉంది అంటూ బాధగా నేలచూపులు చూస్తున్నాడు అక్షయ్. ఇంతలో నైరా గుర్తొచ్చింది. నైరా ఎలా ఉంది? అడిగాడు హర్షని. నైరా ఎవరు? అక్షయ్‌కి, నైరాకి ఉన్న బంధమేమిటి?**

కాసేపటికి అక్షయ్ తలెత్తి చూశాడు. ఆమె పెద్దపెద్ద కళ్ళల్లో నీళ్ళు నిండి ఉన్నాయి. అక్షయ్ బాధని చూసి తట్టుకోలేకపోతున్నట్లుంది.

అతను తనని చూడగానే కళ్ళు దించేసుకుంది.

బుగ్గల మీదుగా జారుతున్నాయి కన్నీళ్ళు.

పక్కనే ఉన్న హర్షని తట్టి కావ్యని చూడమన్నట్లుగా సైగ చేశాడు అక్షయ్.

హర్ష ఆమెని మాటల్లో పెట్టే ప్రయత్నంలో పడ్డాడు.

ఇంతలో ఫోన్ పెట్టేసి సుధీర్ చెప్పటం మొదలెట్టాడు.

'ఫ్యునరల్ సర్వీసెస్‌ని నియమించారట. వాళ్ళే మొత్తం అన్ని ఏర్పాట్లూ చూసుకుంటారు. పేపర్ వర్క్, బాడీస్‌ని శవపేటికల్లో ప్యాక్ చేయించి పంపుతారట. డెడ్ బాడీస్‌ని తీసుకెళ్ళటం దగ్గర నుంచీ అవి వాసనరాకుండా, కుళ్ళిపోకుండా సుగంధ లేపనాలు పూసి, శవపేటికలో భద్రపరచటం, డాక్యుమెంట్లు నింపటం, ఎయిర్‌పోర్ట్‌కి చేర్చటం వరకే వారి బాధ్యత. ఇక్కడ నుంచి మనమే చూసుకోవాలి".

"ఇదంతా పెద్ద ప్రహసనం అట. గమ్యస్థానం ఏ దేశంలో ఉంది? అక్కడ ఎటువంటి కంటెయినర్లని పర్మిట్ చేస్తారు? రిసీవింగ్ కంట్రీలో అవసరమయ్యే కాన్సులేట్ పేపర్ వర్క్ నింపటం, ఫ్లయిట్ టికెట్ బుక్ చేయటం వీటన్నింటి గురించీ వాళ్ళ దగ్గర అన్ని వివరాలు ఉంటాయి. స్థానికంగా ఉన్న అమెరికన్ కాన్సులేట్‌కి వెళ్ళి అప్లికేషన్ నింపి ఇవ్వాలి. ఎవరైతే ఈ అప్లికేషన్ నింపుతున్నారో వాళ్ళ పాస్‌పోర్ట్, వీసా, ఐడీకార్డ్ కూడా కాన్సులేట్‌లో ఇవ్వాల్సి ఉంటుంది. ఇవికాక డెత్ సర్టిఫికెట్, చనిపోయిన వాళ్ళకి ఎటువంటి అంటువ్యాధులు లేవని డాక్టర్ ఇచ్చిన సర్టిఫికెట్, ఫ్లయిట్ వివరాలు, చనిపోయిన వారి పాస్‌పోర్టులు కూడా జతచేయాలి. ఈ పనులన్నీ తమతో అయ్యేవి కావని వాళ్ళ స్నేహితులే ఫ్యునరల్ సర్వీసెస్‌ని నియమించుకున్నారట. వీటికి చాలా ఖర్చవుతుందట కానీ ఇన్సూరెన్స్‌లో 'రీపేట్రియేషన్ ఆఫ్ రిమైన్స్' క్లాజ్ ఉంటే ఇవన్నీ అందులో కవర్ అయిపోతాయట".

"అయితే అరైవల్ ఎయిర్‌పోర్ట్‌లోనే హెల్త్ ఆఫీసర్‌కి 48 గంటల ముందు బాడీస్ వస్తున్నాయని తెలియబరచాలి. బాడీస్ ఇండియా చేరుకోవటానికి కనీసం ఇంకో రెండురోజులు పడుతుంది.

"పాప అమెరికన్ సిటిజన్ కాబట్టి ఇండియాకి పంపటానికి ఇంకేదో ప్రొసెస్ పాటించాల్సి ఉంటుందట. అదృష్టవశాత్తూ నీ పేరు గార్డియన్‌గా వాళ్ళు రాసి ఉంచటంతో ఇండియా పంపే అవకాశాలున్నాయి. లేకపోతే ఆ స్టేట్ కస్టడీలోకి వెళ్ళిపోయేది పాప. ఎవరో ఒకరు దత్తత చేసుకునేవారు అక్కడే! కోర్టులో పిటీషన్ వేశారట మీ బావ ఫ్రెండ్స్. అది తేలటానికి కాస్త సమయం పట్టవచ్చు' నెమ్మదిగా ముగించాడు సుధీర్.

అంతా విన్న అక్షయ్, తల రెండు చేతుల్లో పెట్టుకుని కూర్చున్నాడు.

చాలా దిగులుగా ఉందతనికి.

ఏమీ చేయలేని నిస్సహాయ పరిస్థితి.

'నైరా తన దగ్గరకి రావటం కూడా ప్రశ్నార్థకమే!'

తల్లిదండ్రులు చనిపోయి నాలుగేళ్ళ పాప ఒంటరిగా ఎవరూలేని దేశంలో ఉండటం, ఆమెని తన వద్దకి పంపటానికి ఇంకెవరో కోర్టుకి వెళ్ళటం... తను తప్ప నైరాకి ఎవరూ లేరు. బావ వైపు దూరపు బంధువులే తప్ప ఆయనకీ ఎవరూ లేరు. నైరాని తన వాళ్ళ వద్దకు చేర్చే ప్రయత్నం జరుగుతున్నందుకు... మానవత్వం మిగిలి ఉందని సంతోషించాలో, తన వద్దకి పంపుతారో, లేదో తెలీని స్థితి తల్చుకుని బాధపడాలో అర్థం కావటం లేదు అక్షయ్‌కి.

'ఒకవేళ పంపకపోతే ఏదో ఒకటిచేసి తనే అమెరికాకి మూవ్ అయిపోవాలి. నైరా తన దగ్గరే ఉంటుంది' గట్టిగా నిర్ణయించుకున్నాడు.

"తల్లిదండ్రులులేని పిల్లలు ఏమైపోతారసలు?" అతని ఆలోచనలు ఎక్కడెక్కడికో వెళ్ళిపోతున్నాయి.

ఇంట్లో అమ్మ పదిసార్లు బ్రతిమాలి పెడితే కానీ తినకుండా మారాం చేసే పిల్లలు కొత్త మనుషుల వద్ద దిక్కులేకుండా ఉండాల్సి రావటం ఏమిటీ?

నిజంగా దేవుడనేవాడు ఉంటే అటువంటి పరిస్థితి ఏ పిల్లలకీ రాకూడదు. పిల్లలకనే ఏముంది? తను మాత్రం ఏం తప్పు చేశాడు. చదువుకునే వయసులో తల్లిదండ్రులు పోవటం, కాస్త అన్నీ సెటిల్ అవుతున్నాయి... ఆ డిప్రెషన్ నుంచి తేరుకుంటున్నా ననుకునేసరికి ఈ దెబ్బ.

ఇక జీవితమంతా నైరా గురించి సడన్‌గా ఏ వార్త వినాల్సి వస్తుందోనని భయపడటమేనా?

దెబ్బ మీద దెబ్బ.

'నేనేం పాపం చేశాను' అంటే వితండవాదం చేసేవాళ్ళు 'పూర్వజన్మలో చేసిన పాపఫలం' అంటారు. ఏ తప్పుకి ఏమి శిక్ష పడుతుందో తెలీనప్పుడు ఏమి లాభం?

## నయన దెయ్యం కాదట!



'డోరా'లో దయ్యం పాత్రను నయనతార పోషిస్తోందని అందరూ అనుకున్నారు. కానీ అది నిజం కాదట! ఈ సినిమాలో తాను దయ్యం కాననీ, ఓ కారు దయ్యం పాత్ర చేస్తోందని నయన చెప్పింది. ఈ కాన్సెప్ట్ నచ్చే సినిమా చేస్తున్నట్టు కూడా సెలవిస్తోంది. దక్షిణాదిలో ఓ కారు దయ్యం పాత్ర పోషించడం ఇదే మొదటిసారి అని కోలీవుడ్ జనాలు అంటున్నారు. కానీ తెలుగులో కూడా రెండు మూడు దశాబ్దాల క్రితం కారుని దయ్యం ఆవహించి కథ మొత్తం నడిపించిన సినిమా వచ్చిందని టాలీవుడ్ జనాలు చెబుతున్నారు. కాకపోతే తెలుగు సినిమాకీ, తమిళ సినిమాకీ తేడా ఉండవచ్చంటున్నారు. ఈ సినిమా తెలుగులో కూడా విడుదల కాబోతోంది.

అతనికి తల పగిలిపోతున్నట్టుగా ఉంది.

కళ్ళు తిరుగుతున్నట్లుగా, తెములుతున్నట్లుగా ఉంది.

అందరూ వెళ్ళిపోతే కాసేపు కళ్ళు మూసుకుని ఆలోచించుకోవాలని ఉంది.

ఒక్కొక్కరు "ధైర్యంగా ఉండు", "ఏం చేస్తాం, దేవుడి నిర్ణయం అలా ఉంది" "మంచివాళ్ళని దేవుడు త్వరగా తీసుకెళ్తాడట".

ఇదివరకు తల్లిదండ్రులు పోయినప్పుడు విన్నవి, ఎన్నో సినిమాల్లో చూసిన డైలాగులే రిపీట్ అవుతున్నాయి.

అప్పుడప్పుడూ సొమ్మసిల్లి పోయేంత నిద్ర వస్తోందతనికి.

కళ్ళు మూసుకుపోతున్నాయి.

నిద్ర, మెలకువ రాని స్థితిలో ఉన్న కాసేపు అతనికి ప్రశాంతంగా ఉంటోంది.

ఇంతలో ఎవరో తట్టి లేపి పరామర్శిస్తున్నారు.

లేచిన ప్రతిసారీ అతనికా వార్త అప్పుడే విన్నట్లుగా షాక్‌కు గురయినట్లుగా ఉంటోంది.

"ఇంకా ఎన్నాళ్ళిలా బ్రతకాలి" అనిపిస్తోంది.

హెచ్‌ఆర్ పార్ట్‌నర్, మేనేజర్ వచ్చారు.

మనుషుల్ని, మనస్తత్వాల్ని బాగా అధ్యయనం చేసిన వాళ్ళు కాబట్టేమో వాళ్ళ మాట తీరు మృదువుగా, చల్లగా అనిపిస్తోంది.

"బాధపడొద్దని అందరం చెప్తాం కానీ, బాధ పడాలి. మనసులో బాధంతా కరిగిపోనివ్వాలి. అప్పుడే నీకంటూ స్పష్టత వస్తుంది. వేరే పనుల మీద దృష్టి పెట్టటం వల్ల తాత్కాలికంగా బాధ తగ్గినట్లున్నా, మళ్ళీ ఏదో ఒకరోజు మనసులో దాచుకున్న బాధ ఉప్పెనలా పైకొస్తుంది. ఇప్పుడున్న సపోర్ట్ అప్పుడుండక పోవచ్చు. ఇట్స్ ఓకే టు గ్రీవ్" చెప్తున్నారు.

"రెండు వారాలు బీరీవ్‌మెంట్ లీవ్ తీసుకో వచ్చు. ఆ తర్వాత కూడా నీ అవసరాన్ని బట్టి నీ ఇతర టీమ్ మెంబర్స్, మేనేజర్‌తో మాట్లాడి మేము మేనేజ్ చేస్తాం".

"యుఎస్‌లో అక్కడి బ్రాంచెస్ ద్వారా కానీ, అక్కడెవరైనా మన టీమ్ మెంబర్స్ ద్వారా అయినా నీకు ఎటువంటి అవసరం ఉన్నా సందేహించకుండా మాకు చెప్పు. వి ఆర్ జస్ట్ ఎ ఫోన్ కాల్ ఎవే".

సమర్థులైన ఉద్యోగులనీ, టాప్ టాలెంట్‌నీ రీటెయిన్ చేయటానికి హెచ్‌ఆర్ డిపార్ట్‌మెంట్ రకరకాల స్ట్రాటజీలు కనిపెడుతూ ఉంటుంది. వాళ్ళకి సౌకర్యవంతంగా ఉండే వాతావరణాన్ని కల్పించటమూ, ఏదైనా వ్యక్తిగత సమస్యలు ఉన్నప్పుడు వాటికి పరిష్కారాలు సూచించటమూ, సహాయ పడటమూ చేస్తుంటారు.

కొన్ని కంపెనీల్లో ప్రత్యేకంగా కౌన్సెలింగ్ టీమ్స్ ఉంటాయి. ఉద్యోగరీత్యా, వ్యక్తిగతంగా లేదా సామాజికంగా ఏమైనా ఒడిదుడుకులు ఎదుర్కొంటున్నప్పుడు ఆ నంబర్‌కి కాల్‌చేస్తే వారు సమస్యని వింటారు. కౌన్సెలింగ్ సెషన్స్ నిర్వహిస్తారు. కావలసిన సపోర్ట్ అందిస్తారు. అంతేకాక కౌన్సెలింగ్ తీసుకుంటున్న వ్యక్తి వివరాలు అత్యంత గోప్యంగా ఉంచుతారు. ఒక వ్యక్తి బ్రేక్ డౌన్ అవకుండా అవసరమైన సపోర్ట్ సిస్టమ్‌ని అందించడానికి కావలసిన అన్ని ఏర్పాట్లు చేస్తారు. బలహీనంగా ఉన్న సందర్భాల్లో ఈ రకమైన అండని ఇవ్వటం వలన అది ఒక కంపెనీ అని, అక్కడ మనం ఉద్యోగస్థులం మాత్రమే అనే విషయాన్ని మర్చిపోతాం. ఇదే మన కుటుంబం అనిపిస్తుంది. బయట కంపెనీల నుంచి ఏమైనా ఆఫర్లు వచ్చినా వెళ్ళిపోవటానికి సంకోచిస్తాయి. కంపెనీకి నష్టం వాటిల్లే పనులేవీ చేయకుండా ఉంటాము. ఉద్యోగుల విశ్వాసాన్ని చూరగొనే ప్రయత్నంలో ఇవన్నీ భాగాలే.

మరికొన్ని కంపెనీల్లో కాన్సియర్జ్ సర్వీస్ డెస్క్(concierge service desk)లు ఉంటాయి. బిల్స్ కట్టటంలాంటి పనుల వల్ల ఉద్యోగుల సమయం వృథా అవకుండా చూస్తారు. వాళ్ళే ఆ




నా చిన్నప్పుడు-
మొదటిసారి అమ్మమ్మ వాళ్ళింట్లో చూసాను
ఎక్కా బుడ్డి దీపాన్ని; కందిలినీ!

రోజంతా పక్కపక్కనే తల్లీబిడ్డల్లా-
చూడముచ్చటగా ఉండే ఆ దీపకాంతలు-
రాత్రిళ్ళు మాత్రం తప్పని ఎడబాటుతో
ఎక్కెక్కి వెలిగేవి!

## కందిలి

అలనాటి ఆ అపురూప దీపశిఖలంటే
నాకిప్పటికీ అంతులేని మైమరపే!
పేదవాడి సెంటులాంటి ఆ దీపికల-
గ్యాసునూనె పలకరింత నాకిప్పటికీ పులకరింతే!

సందెవేళయిందంటే సాయబానులో కూర్చొని-
కందిలి, ఎక్కా గాజు బుగ్గలను
ఒడుపుగా పట్టుకుని ఓపిగ్గా అవలీలగా శుభ్రం చేసే
మా అమ్మమ్మ తలపు ఓ మనసైన అబ్బురమే!

మా యింట్లోనయితే-
కరెంటు పోయినప్పుడే కాదు
కరెంటు బిల్లు కట్టలేకపోయినప్పుడే
తెలిసింది నాకు కందిలి అందాలు!

ఇంటెనక కరివేపాకు చెట్టుకింద
కరిమబ్బుల్లా ముసురుకున్న
కందిలి బుగ్గ మసిని
పాలనురగ సొగసుతో
పారదర్శకంగా మెరిపించాక-

కందిలి ఆకుపచ్చ అద్దకం ఫ్రేములో
మధ్యన వేలాడే-
నాజూకు ఇనుప చిమ్మీల తొడుగులో
అమ్మ ఒడుపుగా ఒదిగించే కందిలి గాజు బుగ్గ
హరిత హారానికి చందమామను తొడుగుతున్నట్టుగా-
ఓ అద్భుతంలా తోచేది!

అమ్మ దినచర్యగా చేసే ఆ పనిని
అదేపనిగా-
బుగ్గన చేతితో ఇంతేసి కళ్ళతో
ఆశ్చర్యంగా సంభ్రమంగా అవలోకించడం
నాకో ఆకుపచ్చని జ్ఞాపకం!
అలవాటులేని పనేమో!
హఠాత్తుగా గాజుబుగ్గ పదునైన అంచు
చేసిన గాయంతో-
పాలరాతిలాంటి అమ్మచేతులు
సర్రున చిందే రక్తంతో



మోదుగుపూల ధారలు చిమ్మేవి!

అప్పుడు అమ్మ 'అమ్మా' అంటూ-
చేసిన ఆర్తనాదం-
పరలోకంలో ఉన్న వాళ్ళమ్మకు తప్పక వినిపించే ఉంటుంది!

సాయంకాలానికల్లా ఆ రాత్రి వెలుగులు పంచడానికి
అందంగా ముస్తాబైన కందిలి-
రాత్రి చీకటిని ఒళ్ళంతా పులుముకొని
మరునాటి పొద్దుటికల్లా మసిబారి
వసివాడి పోయేది!

కానీ, మళ్ళీ అమ్మ చేతుల్లో
తెల్ల కాలువ కాంతులతో విచ్చుకుని-
జాబిలి వెలుగులు ఇల్లంతా రువ్వుతూ-
ముద్దబంతి ముగ్ధత్వంతో
'వెన్నెల ఇంతి'లా-

మా ఇంటి మధ్య 'వసారా'లో
కళకళలాడుతూ-
దర్జాగా ఒదిగి కూర్చుని
ఒయ్యారాలొలకబోసేది
అందాల కందిలి!

-డాక్టర్ వాణీ దేవులపల్లి
సెల్: 98669 62414

పనులు చేసి పెడతారు.

ఇంకొన్ని కంపెనీల్లో అన్నిరకాల మెడికల్ ఫెసిలిటీస్ ఉంటాయి. కన్సల్టింగ్ డాక్టర్లుంటారు. గైనిక్, ఆర్థో, న్యూట్రిషనిస్ట్, ఫిజియో థెరపిస్ట్ - ఇలా రకరకాల వారుండే టైమ్, రోజుని ఉద్యోగులకి పబ్లిష్ చేస్తారు. టైమింగ్స్‌ని బట్టి ఆఫీస్‌లో ఖాళీగా ఉన్న సమయంలో ఉచితంగా చూపించుకుని రావచ్చు. ఫార్మసీ కూడా ఆఫీసులో ఉంటుంది.

ఇంటి వద్ద లంచ్‌కి బాక్స్‌లో ఏం పెట్టుకోవాలో అనే టెన్షన్ గానీ, సాయంత్రం లేటైతే ఇంటికెళ్ళి వండుకునే పని కానీ లేకుండా ఇరవై నాలుగు గంటలూ ఫ్రీ ఫుడ్ అందించే కంపెనీలున్నాయి.

పిల్లల్ని ఒకరి దగ్గర వదిలి రావటం కానీ, వాళ్ళెలా ఉన్నారో అనే ఆందోళన కానీ పడకుండా డే కేర్ ఫెసిలిటీస్ కల్పిస్తారు. కొన్ని కంపెనీల్లో, పిల్లల్ని కాంపస్‌లోనే డే కేర్‌లో ఉంచటం వల్ల వాళ్ళు సేఫ్‌గా ఉన్నారనే, నిశ్చింత, మధ్యలో వెళ్ళి చూసుకురాగలిగే వీలు ఉంటుంది.

విడిచిన బట్టల మూట తెచ్చి ఆఫీస్‌లో వేస్తే,

పరిస్థితి.

ప్రతిసారీ అక్క ఫోన్ చేసినప్పుడు "నువ్వు నాకు తమ్ముడివి కాదురా. కొడుకువి" అనేది. తను మాత్రం ఎమోషనల్ అవకుండా ఏదో ఒక జోక్‌వేసి, టాపిక్ మార్చి నవ్వించేవాడు. ఒక్కసారి అక్కతో చెప్తే బాగుండేదేమో! 'అక్కా! నాకు అమ్మ కంటే కూడా నువ్వంటేనే ఎక్కువ ఇష్టం" అని చెప్పనంత మాత్రాన ఆమెకు తెలీదా?

చనిపోయే టైమ్‌లో ఎంత బాధ అనుభవించి ఉంటుందో. పాప గురించీ, తన గురించీ ఆలోచించి ఉంటుంది అప్పుడు కూడా. ఎన్నో సార్లు తనని అమెరికాకి ఆఫీస్ పనిమీదో, విజిట్‌కో రమ్మనేది. తనకే అవకాశం వచ్చినా ఇండియా వదిలి వెళ్ళాలనిపించలేదు. వెళ్ళుంటే బాగుండేదేమో. ఆ టైమ్‌లో నైరా, తను కూడా వాళ్ళతో ఉండి అందరూ ఒకేసారి పోయుంటే హాయిగా ఉండేది. తమ కోసం బాధ పడటానికి ఎవరూ మిగిలేవారు కాదు.

కానీ హర్ష, సీమలాంటి స్నేహితులు.... కావ్య? వాళ్ళకి పెద్ద షాక్ అయ్యుండేది.




వాళ్ళే లాండ్రీ చేయించే కంపెనీలు కూడా ఉన్నాయంటే మనం నమ్మక తప్పదు.

వీటన్నిటికి మూలం ఒకటే.

తమ దగ్గర పనిచేసే ఉద్యోగులకి అన్ని సదుపాయాలు కల్పించటం వల్ల వారి ఉత్పాదకతను పెంచటం, సమయం వృథా కాకుండా చూడటం, తద్వారా ఆ వ్యక్తి విశ్వాసం చూరగొనటం.

ఎవరెవరో వస్తున్నారు. వెళ్తున్నారు.

మధ్యాహ్నానికి కొద్దిగా ఖాళీ అయింది.

అక్షయ్‌ని తినమని కాసేపు సీమ, హర్ష బలవంతం చేసి హాల్లో మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

అక్షయ్ లోపల బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పడుకున్నాడు.

ఒక చేయి తల కింద పెట్టుకుని బోర్లా పడుకుని ఉన్నాడు.

ఎదురుగా అక్క వచ్చినప్పుడు ఉండటానికి సర్దిపెట్టిన రెండో బెడ్‌రూమ్ కనబడుతోంది. అంతా అనుకున్నట్లుగా జరిగితే ఇంకొక్క రోజు తర్వాత ఇల్లంతా సందడిగా, కళకళలాడుతూ ఉండేది.

అంతా చీకటిగా, వెలితిగా అనిపిస్తోంది.

ఒంటరితనం భరించలేనట్లుగా ఉంది. అదే సమయంలో మనుషులెవ్వరూ తనకి కనపడకపోతే బాగుండనిపిస్తోంది. చాలా విచిత్రమైన

జీవితంలో ఏమీ మిగలనట్లు అంతా ఖాళీగా అనిపిస్తోంది. ఇంకా ఎన్ని రోజులు డిప్రెషన్‌లో బతకాలి?

ప్రతి సంవత్సరం అక్క తన బర్త్‌డేకి ఏదో ఒక గిఫ్ట్ ఇచ్చి సర్‌ప్రైజ్ చేసేది. ఒకసారి షూస్, మరోసారి బుక్స్, లేటెస్ట్ మోడల్ ఫోన్, కిండిల్, ఎక్స్‌బాక్స్... ఇలా ఏదో ఒకటి, తనకి ఆ వస్తువు అవసరమనో, ఇష్టమనో ఆమెకెలా తెలిసేదో తనకి ఎప్పుడూ మిస్టరీనే.

వచ్చే నెల తన బర్త్‌డే. అక్కఫోన్‌తో ఆ రోజు మొదలవదు. తనని సర్‌ప్రైజ్ చేసి సంతోషించటానికి ఆమె ఉండదు. ఇక మిగిలిన రోజులన్నీ శూన్యంగా అనిపిస్తున్నాయి.

ప్రతి సంవత్సరం రాఖీ పోస్ట్‌లో పంపేది. ఒక్కసారి మాత్రం ఎందుకో లేట్ అయింది. ఆరోజు అందరూ రాఖీలు కట్టుకుని తిరుగుతుంటే తనకెందుకో ఉక్రోషంగా అనిపించింది. అక్క తనని మర్చిపోయిందనిపించింది. మర్నాడు కొరియర్ అందుకునే వరకు పోస్టల్ డిలే అని తనకి తట్టలేదు.

ఇక ప్రతి రాఖీ రోజు తన చేయి ఖాళీగానే ఉంటుంది.

"ఒక్కొక్కరికీ రాఖీ సిస్టర్స్ అంతమంది ఉంటారు. నీకు ఒక్కరన్నా కట్టి చావరేమిటిరా? సరిగ్గా మాట్లాడవా? లేకపోతే అందంగా ఉన్నావని కట్టరా?" అనేది. ఇద్దరూ నవ్వుకునే వాళ్ళు.

"ఎన్ని జోక్స్, ఎన్ని రహస్యాలు ఇద్దరూ పంచుకునేవాళ్ళు. తల్లిదండ్రుల గురించీ, చిన్నప్పటి సంగతులూ అన్నీ మాట్లాడుకునేవారు. ఒకరినొకరు ఓదార్చుకునేవారు. ఇప్పుడు ఇంకెవరితో మాట్లాడగలడు తను ఆ సంగతులు?

చిన్నప్పుడు ట్యూషన్ మాస్టర్ చాలా బయాస్డ్‌గా ఉండేవాడు. తను ఎంత బాగా చదివినా ఏదో ఒక వంక పెట్టి స్కేల్‌తో చేయి మీద వాతలు తేలేట్టు కొట్టేవాడు. తను వెళ్ళనని ఏడిస్తే తల్లిదండ్రులు వినేవాళ్ళు కాదు.

ఇంటికి దగ్గర్లోనే ట్యూషన్. అక్క వచ్చి ఇంటికి తీసుకెళ్ళేది తనని. చేయి పట్టుకుని నడుస్తూ, ఎగురుతూ బోలెడు కబుర్లు చెప్పుకుంటూ ఇంటికెళ్ళేవాడు.

ఆరోజు తనని పికప్ చేసుకోవటానికి వచ్చినప్పుడు అక్క తనని సర్ కొట్టటం చూసింది. అంతే! సర్ చేతిలో స్కేల్ లాక్కుని టపటపా ఆయన్ని నాలుగు వాయించి తనని తీసుకుని బయటికి పరిగెత్తింది. సర్ షాక్ నుంచి తేరుకునేలోపు తామిద్దరూ ఇంటి బయటున్నారు.

అలాగే పరిగెత్తుకుంటూ వెళ్ళి కాలనీలో ఉన్న స్పోర్ట్స్ గ్రౌండ్‌లో కూర్చుని చాలాసేపు నవ్వుకున్నారు, సర్ మొహం గుర్తొచ్చి.

"టీచర్లు అందరూ మంచివాళ్ళేమీ కాదురా!" అంది ఆరోజు ఆలోచిస్తూ.

కాసేపయ్యాక భయం మొదలైంది.

సర్ ఇంటికి ఫోన్ చేసి చెప్తే, తల్లిదండ్రులు తమని తిడతారేమో అని ఇంటికెళ్ళకుండా చీకటయ్యే వరకూ అక్కడే ఉన్నారు.

ఎంతకీ ఇంటికి చేరకపోయేసరికి తమ తల్లిదండ్రులు భయపడి ఊరంతా వెతికి, అక్కడి కొచ్చి తీసుకెళ్ళారు.

ఆరోజు అక్క తెగేసి చెప్పింది తల్లితో. "వాడినిక ఆ ట్యూషన్‌కి పంపొద్దు".

"నువ్వు చెప్తావా చదువు? మేమిద్దరం ఆఫీస్‌కి వెళ్తే మీతో హోమ్‌వర్క్‌లు ఎవరు చేయిస్తారు?" అరిచింది.

"మేమే చేసుకుంటాం" మొండికేసింది అక్క.

ఆ రోజు నుంచీ తనకి ట్యూషన్ అవసరం కలగలేదు. తనే స్కూల్లో శ్రద్ధగా వినేవాడు. ఎప్పుడూ స్కూల్ ఎగ్గొట్టటం చేసేవాడు కాదు. ఏ రకంగా చూసినా అక్కే తనకి గురువు, ఇన్‌స్పిరేషన్!

"అక్కా, ఐ మిస్ యూ" దిండులో తల పెట్టుకుని వెక్కివెక్కి ఏడవసాగాడు.

సౌమ్మసిల్లి ఎప్పటికో నిద్రపోయాడు.

సాయంత్రం ఏడవుతోంది.

హర్ష నిద్ర లేపుతుంటే మెలకువొచ్చింది.

"ఫ్యునరల్ సర్వీసెస్ వాళ్లు, వాళ్ల పలుకుబడి, ఎక్స్‌పీరియన్స్ అంతా వాడినట్టున్నారు. ఎల్లుండి పొద్దుటికి బాడీస్ ఇండియా చేరుకుంటాయట" చెప్తున్నాడు హర్ష.

బ్లాంక్‌గా చూశాడు అక్షయ్.

హర్ష తన ఇంట్లో ఎందుకున్నాడో అర్థం కాలేదు. ఒక్కక్షణం తర్వాత చెళ్ళున కొట్టినట్లు అంతా జ్ఞాపకం వచ్చింది. నిన్న ఇదే టైమ్‌కి తనెంతో

సంతోషంగా ఉన్నాడు. ఒక్కరోజులో మొత్తం చెల్లాచెదురైపోయింది.

బయట సన్నగా వర్షం పడుతున్న శబ్దం.

చీకటి అలముకుంది.

దిగులుగా, బెంగగా ఉంది అక్షయ్‌కి.

"నైరాని ఇండియా పంపే విషయం కూడా రెండు రోజుల్లో తెలిసిపోతుందట" చెప్పాడు హర్ష.

మెల్లగా లేచి హాల్లోకి వచ్చాడు.

కావ్య పెద్ద కారియర్‌లో డిన్నర్ తీసుకొచ్చిన ట్లుంది.

సీమ, ఆమె ఇద్దరూ కలిసి ప్లేట్స్‌లో వడ్డిస్తు న్నారు.

బలవంతం మీద కొద్దిగా తిని, హాల్లోకి వచ్చి కూర్చున్నాడు.

ఏమి మాట్లాడుకోవాలో తెలీక టీవీ ఆన్ చేశారు.

అసెంబ్లీలో బూతులు తిట్టుకోవటం, భార్యని చంపిన భర్త, భర్తని బండరాయితో మోదిన భార్య, అర్థం కాని గ్రాంథిక భాషలో అర్థం పర్థం లేని రాజకీయ విశ్లేషణలూ వస్తున్నాయి.

ప్రస్తుతం ఉన్న పరిస్థితిలో వాళ్లకి ఏ ప్రోగ్రాం అయినా తలనొప్పి తెప్పించేట్టే ఉంది.

టీవీ కట్టేశారు.

కాసేపు భరించలేని నిశ్శబ్దం.

"అక్షయ్, అక్క గురించి ఏదైనా మాట్లాడు. మొత్తం బాధంతా దిగమింగుకోకు. మాతో షేర్ చేసుకో!" అంది సీమ.

అక్షయ్ తలెత్తి చూసి మళ్ళీ వాల్చేశాడు.

హర్ష చెప్పటం మొదలెట్టాడు.

"అక్షయ్‌కి తల్లిదండ్రులు పోయాక దాదాపు రెండు నెలల తర్వాత అనుకుంటా, అక్క యుఎస్ వెళ్ళిపోయింది. అక్షయ్ హాస్టల్‌కి వచ్చేశాడు. ఐఐటి సెకండియర్‌లో ఉన్నామప్పుడు. అక్క నాతో కూడా రెగ్యులర్‌గా కాంటాక్ట్‌లో ఉండేది. వీడిని బాగా చూసుకోమని చెప్పుండేది. ఒకసారి వీడికి చిన్న యాక్సిడెంట్ అయి కాలు విరిగింది. వీడేమో చెప్పొద్దంటాడు. హాస్టల్‌లో ఫోన్‌కి దొరక్క పోతుంటే ఏదో డౌట్ వచ్చినట్లుంది. నాకు ఫోన్ చేసి నిజం చెప్పమని నిలదీసింది. వీడు చెప్ప నివ్వలేదు. తర్వాత ఒక రోజంతా ఫోన్లు లేవు. 'పోనీలే, నమ్మినట్లుంది' అనుకున్నాము. రెండో రోజుకి ఇండియాలో దిగింది. మొత్తం నయ మయ్యేవరకు ఉండి హాస్టల్‌లో దింపి వెళ్ళింది".

"యూ ఆర్ వెరీ లక్కీ అక్షయ్" అంది సీమ.

కావ్య కళ్ళు పెద్దవి చేసి చూస్తోంది.

"ఐవాజ్ లక్కీ. ఇప్పుడు లేదుగా" అన్నాడు అక్షయ్.

"తను నాకోసం ఎంతో చేసింది. నాకు మాత్రం ఏమీ చేయటానికి ఛాన్స్ ఇవ్వకుండా వెళ్ళి పోయింది".

రెండు చేతుల్లో మొహం దాచుకున్నాడు అక్షయ్.

ఏడుస్తున్నాడనటానికి నిదర్శనంగా అతని భుజాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

"మొత్తం భారం తీరేలా ఏడవనీ... తొంద రగా బాధ నుంచి బయటికొస్తాడు" సైగ చేసింది సీమ.

హర్ష బాధగా చూస్తున్నాడు.

ఇంతలో కావ్య పెద్దపెట్టున ఏడుపు మొదలు పెట్టింది. అతని బాధ చూసి తట్టుకోలేక పోతుం దామె.

అక్షయ్‌తో సహా అందరూ బిత్తరపోయి చూశారామెని.

•••

అక్షయ్, హర్ష మరికొందరితో కలిసి శంషా బాద్ ఎయిర్‌పోర్ట్ చేరుకున్నారు.

ఫార్మాలిటీస్ పూర్తిచేసి కాస్కెట్స్ రిసీవ్ చేసు కున్నారు.

ఎలక్ట్రిక్ క్రిమేషన్‌కి అన్ని ఏర్పాట్లూ చేశారు అప్పటికే!

కాస్కెట్స్ ఓపెన్ చేసి ఇద్దరినీ ఆఖరుసారి చూసుకున్నాడు అక్షయ్.

ప్రశాంతంగా, నిద్రపోతున్నట్లుగా ఉన్నారు ఇద్దరూ.

చావు అంత భయంకరమైనది కాదేమో అని పిస్తోంది వాళ్ళని చూస్తుంటే!

అక్కచేయి చేతిలోకి తీసుకుని ప్రామిస్ చేస్తున్నట్లుగా చెప్పాడు అక్షయ్.

"నైరా నా బాధ్యత! ఐ విల్ టేక్ కేర్ ఆఫ్ హర్ అక్కా!"

**(ఇంకావుంది)**

# మనమీదేనర్రోయ్!

సరసి










- రాజశుక

# రాహుల్ చేతిలో సరికొత్త అస్త్రం

**నోట్ల రద్దు వ్యవహారాన్ని అడ్డు పెట్టుకుని కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు ఓ నాయకుడుగా ఎదుగుతున్నారు. మోదీ ఇమేజ్‌ని దెబ్బతీయడానికి తనకు సరైన అవకాశం అందివచ్చిందని ఆయన భావిస్తున్నారు.**

కొద్ది కాలం క్రితం వరకూ ఇది నిజంగా ఊహించని విషయం. కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీ కూడా బాగా మాట్లాడతారని, ఆయన కూడా ఓ రాజకీయ నాయకుడుగా ఎదుగుతారని ఎవరూ ఊహించను కూడా ఊహించి ఉండరు. కానీ, ఆ రోజు వచ్చేసినట్టు కనిపిస్తోంది. ఆయన మాటలు, చేతలు చూసి జనం ఆయనను గత దశాబ్ద కాలంగా పట్టించుకోలేదు. నవ్వుకుని పక్కన పెట్టేసేవారు. కొన్ని కీలక అంశాలపై ఆయనకు అవగాహన ఉన్నట్టు అనిపించేది కాదు. జాతీయ సమస్యలపై కూడా అవగాహన లేకుండా, సమన్వయం లేకుండా ఆయన ప్రసంగాలు, ప్రకటనలు చేసేవారు. ఓ సరైన నాయకుడుగా ఆయన తనను తాను నిరూపించుకునే ప్రయత్నం కూడా చేయలేదు. అంతేకాదు, నాయకత్వ బాధ్యతలను భుజాలకెత్తుకోవడానికి ఏనాడూ ముందుకు రాలేదు. అటువంటిది, ఆయనలో ఒక్కసారిగా మార్పు వచ్చేసినట్టు కనిపిస్తోంది. ఇందుకు పెద్ద నోట్లు రద్దు చేస్తూ ప్రధాని నరేంద్ర మోదీ తీసుకున్న చర్య చాలావరకు దోహదం చేసిందనుకోవాలి. మోదీపై ఆయన చేస్తున్న ఆరోపణలు, వాదనలు, విమర్శల్లో ఇంకా పస లేకపోవచ్చు కానీ, జనం ఆయన మాటలు, వ్యాఖ్యలు, ప్రసంగాలపై దృష్టి పెట్టడం మాత్రం మొదలైంది. గుజరాత్‌లో మోదీకి కంచుకోటలాంటి మెహసానాలో ఆయన ప్రధానికి సవాళ్లు విసరడం ఆయన దూకుడుకు, ధైర్యానికి అద్దం పడుతోంది. రాహుల్ గాంధీ సభలకు ఏనాడూ రానంత భారీ సంఖ్యలో జనం వచ్చారు. దాంతో ఆయన విజృంభించి, మోదీ ప్రతిష్ఠపై దాడి చేశారు. విమర్శలకు, ఆరోపణలకు అతీతంగా 'మిస్టర్ క్లీన్'గా మోదీకి ఉన్న ఇమేజ్ మీద ఆయన అనూహ్యంగా మాటల తూటాలు సంధించారు.

ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్, కాన్పూర్ వంటి ప్రాంతాల్లో బహిరంగ సభల్లో మాట్లాడుతూ, మోదీని ఎదుర్కోవడంలో మరో అడుగు ముందుకేశారు. ప్రధాని తన ప్రసంగాలను, విమర్శలను, ఆరోపణలను ఎద్దేవా చేయడాన్ని, వెటకారంగా మాట్లాడడాన్ని ఆయన లెక్క చేయలేదు. ప్రతిపక్షాలు, ప్రత్యర్థుల విమర్శలకు, ప్రశ్నలకు సమాధానం ఇవ్వాల్సిన మోదీ వాటిని ఎద్దేవా చేయడమేమిటని ఆయన ప్రశ్నించారు. ముందు సమాధానం చెప్పి ఆ తరువాత ఎద్దేవా చేయాలని కూడా సవాలు చేశారు. రాహుల్ కన్నా ముందు ఢిల్లీ ముఖ్యమంత్రి అరవింద్ కేజ్రీవాల్ అనేక పర్యాయాలు మోదీపై దాడులు చేశారు. అయితే మోదీ ఢిల్లీ ముఖ్యమంత్రి వ్యాఖ్యలను కూడా ఇదే పద్ధతిలో తీసి పారేశారు. కానీ, రాహుల్ అక్కడితో వదిలిపెట్టలేదు. ప్రముఖ న్యాయవాది ప్రశాంత్ భూషణ్ 'కామన్ కాజ్' అనే ఎన్జీవో తరఫున ప్రధానిపై వేసిన పిటిషన్‌లోని మాటలను కూడా రాహుల్ అందిపుచ్చు కున్నారు. 2013లో సహారా గ్రూప్ నుంచి పలువురు ముఖ్యమంత్రులు, మంత్రులు, సీనియర్ అధికారులు లంచాలు తీసుకున్నారని 'కామన్ కాజ్' పిటిషన్ వేసింది. ఆ ఎన్జీవోకు ప్రశాంత్ భూషణ్ న్యాయవాది. గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉండగా 2013లో నరేంద్ర మోదీకి నలభై కోట్ల రూపాయల మేరకు ముడుపులు ముట్టినట్టు, సహారా, బిర్లా డైరీలను ఉటంకిస్తూ ఆయన ప్రచారం ప్రారంభించారు. ఈ ప్రచారంలోని నిజానిజాలు ఎలా ఉన్నా ప్రజలు, మీడియా దీని మీద దృష్టి పెట్టడం మొదలైపోయింది. ఈ ఆరోపణలను రాహుల్ తనకు వీలుగా ఉపయోగించుకుంటూ మోదీపై ధ్వజమెత్తుతున్నారు. మోదీ వీటిని పెద్దగా పట్టించుకోవడం లేదు. తన విమర్శలను మోదీ పట్టించుకునే వరకూ రాహుల్ ఆయనని వదిలిపెట్టదలచుకోలేదు. ముున్ముందు తాను బయటపెట్టే విషయాలు మోదీ జీవితంలో భూకంపం సృష్టించబోతున్నాయంటూ ఆయన హెచ్చరించారు.

## 'భూకంపం' ఖాయం

రాహుల్ ఇక్కడితో మోదీని వదిలిపెట్టరని కాంగ్రెస్ వర్గాలు కూడా చెబుతున్నాయి. "ప్రస్తుతానికి ఆయన ప్రశాంత్ భూషణ్ పిటిషన్‌లోని మాటల్నే చెబుతున్నారు. కానీ, కొత్త సంవత్సరంలో ఆయన అనేక విషయాలు బయటపెట్టబోతున్నారు. సరిగ్గా పార్లమెంట్ సమావేశాల ప్రారంభానికి ముందు, ఆయన వీటిని బయటపెడతారు. రాహుల్ అన్నట్టు ఇవన్నీ 'భూకంపం' సృష్టించబోతున్నాయి" అని కాంగ్రెస్ ప్రతినిధి ఒకరు వ్యాఖ్యానించారు. మోదీ ప్రధాన ప్రత్యర్థిగా రంగంలో నిలబడాలని రాహుల్ భావిస్తున్నారు. 2006 ప్రాంతంలో మోదీ కూడా ఇలాగే సోనియా ప్రత్యర్థిగా రంగంలోకి దిగారు. సోనియా ప్రధాన ప్రత్యర్థిగా ఆయన రాజకీయాల్లో స్థిరపడగలిగారు.

ఇప్పుడు అదే పాత్రను రాహుల్ పోషిస్తున్నారు. వాస్తవాలతో సంబంధం లేకుండా ఆయన మోదీ మీద విరుచుకుపడుతున్నారు. నోట్ల రద్దు మీద ప్రజల్లో వెల్లువెత్తే వ్యతిరేకత మీద రాహుల్ ఆధార పడుతున్నారు. నోట్ల రద్దును ప్రజలు వ్యతిరేకిస్తేనే మోదీ ప్రజాకర్షణ తగ్గి తన ప్రజాకర్షణ పెరుగుతుందని ఆయన భావిస్తున్నారు. దేశంలో బ్యాంకులు, ఏటీఎంల ముందు క్యూలలో నిలబడుతున్నవారంతా తనకు భవిష్యత్తులో మద్దతు ఇస్తారని ఆయన ఆశలు పెట్టుకున్నారు.

మోదీని విమర్శించడంలో ఆయన సరికొత్త పదజాలం ఎంచుకుంటున్నారు. 'మోదీ పేదలను ఘోరంగా వంచించారు' అని ఆయన మెహసానాలో ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ వ్యాఖ్యానించారు. "ఇంతవరకూ ఎంత మంది నల్ల ధనస్వాముల్ని జైల్లో పెట్టారు మోదీజీ" అని ఆయన ఓ సభలో ప్రశ్నించారు. "94 శాతం ఉన్న నల్లధనాన్ని లక్ష్యంగా చేసుకోవాల్సింది పోయి, ఆరు శాతం నిజాయతీపరులను లక్ష్యంగా చేసుకుంటున్నారు" అని కూడా రాహుల్ విమర్శించారు. "బ్యాంకులు లక్షల కోట్ల రూపాయల్ని సంపన్నులకు రుణాలుగా ఇస్తున్నాయి. అందులో ఒక్క పైసా కూడా తిరిగి రావడం లేదు" అని ఆయన వ్యాఖ్యానించారు. బ్యాంకుల రుణాల గురించి ఆయన మాట్లాడడం ప్రజలకు ఆనందంగానే ఉండొచ్చు కానీ, ఈ రుణాలన్నీ మోదీ అధికారంలోకి రాక ముందే, అంటే తన పార్టీ అధికారంలో ఉన్నప్పుడే మంజూరయ్యాయన్న సంగతిని ఆయన ఎక్కడా ప్రస్తావించడం లేదు.

ఏతావతా ఆయన చేస్తున్న విమర్శలు, వ్యాఖ్యలకు మోదీ తప్పనిసరిగా జవాబు ఇవ్వాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆయన చేస్తున్న ఆరోపణల్లో కొన్ని పాతవే కావచ్చు. మరికొన్ని చర్విత చర్వణాలే కావచ్చు. కానీ, అవి దేశ రాజకీయ రంగంలో చర్చనీయాంశాలయ్యాయి. పత్రికలు, సమాచార సాధనాల్లో ప్రముఖ వార్తలయ్యాయి. రాహుల్ చేస్తున్న ఆరోపణల్లో ఎంత వరకూ నిజం ఉందన్నది దర్యాప్తు సంస్థలు, న్యాయ స్థానాలే నిగ్గు తేల్చాలి. న్యాయస్థానాలు ప్రశాంత్ భూషణ్ పిటిషన్‌ను విచారణకు తీసుకోవడం మీద కూడా ఇదంతా కొంత వరకూ ఆధారపడి ఉంది. కానీ, రాజకీయాల్లో మాత్రం ఆరోపణలు, విమర్శలకు ఉన్నంత ప్రాధాన్యం, వాటికి ఉన్నంత విలువ తీర్పులకు, విచారణలకు ఉండదు. ఒక అబద్ధాన్ని పది సార్లు వల్లిస్తే అది ప్రజల మనసుల్లో నాటుకు పోతుందనే సంగతి రాజకీయ నాయకులకు బాగా తెలుసు. రాహుల్ గాంధీ కూడా ఇదే విషయాన్ని బాగా ఒంటబట్టించుకున్నట్టు కనిపిస్తోంది.



## అసత్య ప్రచారాలు?

రాహుల్ తండ్రి రాజీవ్ గాంధీకి కూడా మొదట్లో 'మిస్టర్ క్లీన్' ఇమేజ్ ఉండేది. అయితే, వీపీ సింగ్ నాయకత్వంలోని రాజీవ్ ప్రత్యర్థులు ఈ ఇమేజ్ పైపై ముసుగు మాత్రమేనని ప్రజలను నమ్మించగలిగారు. బోఫోర్స్ కుంభకోణంలో కీలక పాత్ర పోషించిన వారి పేర్లన్నీ తన జేబులో ఉన్నాయంటూ రాజీవ్‌పై వీపీ సింగ్ ధ్వజం ఎత్తారు. 'గల్లీ గల్లీ మే షోర్ హై, రాజీవ్ గాంధీ చోర్ హై' అనే నినాదాన్ని సృష్టించి ఊరూరా ప్రచారం చేయడంతో రాజీవ్‌పై జనానికి మనసు విరిగిపోయింది. రాహుల్ గాంధీ బావ రాబర్ట్ వాద్రాపై కూడా యూపీఏ హయాంలో ఇలాగే ప్రచారం జరిగింది. కానీ బీజేపీ అధికారంలోకి వచ్చి మూడేళ్లు కాబోతున్నా ఇంత వరకూ వద్రా కేసులో మాత్రం ఒక్క అడుగు కూడా ముందుకు పడలేదు. వాద్రా మీద ఒక్క ఆరోపణా రుజువు కానప్పటికీ, ఆయనపై ఎటువంటి విచారణా జరగనప్పటికీ, ఆయనకు శిక్ష పడనప్పటికీ, ఆయన అవినీతిపరుడనే అపఖ్యాతి మాత్రం కొనసాగుతూనే ఉంది. రాజకీయాల్లో ప్రచారానికి ఉన్నంత విలువ, వాస్తవాలకు ఉండదనడానికి ఇవే నిదర్శనం. అబద్ధాలను, అర్ధ సత్యాలను జనం నమ్మడం ముఖ్యం. జనంతో నమ్మించడం ముఖ్యం. ఆ తరువాత అవే నిజాలుగా స్థిరపడిపోతాయి. రాహుల్ గాంధీ కూడా అదే చేశారు.

**మోదీ రద్దుచేసిన పెద్దనోట్ల పథకం రాహుల్‌కు బాగా కలిసివచ్చినట్టుంది. ఆయన మాట్లాడటం ప్రారంభించారు. పెద్దగా పట్టించుకోని జనం ఇప్పుడు ఆయన ప్రసంగాలపై దృష్టి కేంద్రీకరించడం ప్రారంభించారు. మోదీపై ఆయన అనూహ్యంగా మాటల తూటాలు సంధించారు. సమాధానం చెప్పకుండా మోదీ ఎద్దేవా చేయడాన్ని కూడా రాహుల్ పట్టించుకోవడం లేదు. ఇక రాహుల్ పరిస్థితిలో మరింత మార్పు రాబోతోందా?**

నిజానికి 2014 ఎన్నికల సమయంలో కూడా రాహుల్ ఓటర్ల మీద ఎటువంటి ప్రభావం కలిగించలేకపోయారు. ఆయన ఏం మాట్లాడినా జనం నవ్వేవారు. ఆయన సభలకు జనం ఎక్కువగా వచ్చేవారు కూడా కాదు. ఆయన మాటలు జాతీయ స్థాయి జోకులుగా మారిపోయాయి. ఆయనను పప్పూ అని, అమూల్ బాయ్ అని పిలిచేవారు. ట్విట్టర్ వంటి సోషల్ మీడియా నెట్‌వర్క్‌లలో ఆయన గురించి రకరకాలుగా ప్రచారం జరిగిపోయింది. ఆయనను ఎవరూ సీరియస్‌గా తీసుకోలేదు. ఆయన రాజకీయాల్లో అడుగుపెట్టినప్పుడే మోదీ ప్రవేశం కూడా జరిగింది. మోదీ అప్పటికే గొప్ప వక్తగా గుర్తింపు పొందారు. ఆయన మాటల్ని జనం నమ్మడం ప్రారంభించారు. ఆయన మాటలు, చేతలకు విలువనిచ్చారు. దాదాపు మూడేళ్లుగా అదే కొనసాగుతోంది. ఆయన తిరుగులేని ప్రధాని అనీ, శాశ్వత ప్రధాని అనీ ప్రజలు నమ్మడం వరకూ వెళ్లింది. అటువంటి వ్యక్తిని ఎదుర్కోవడం ఇటీవలి వరకూ రాహుల్‌కు ఎంతో కష్టమైపోయింది. కానీ, ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి.



ఇందుకు కారణం ఏమిటనేది తేలికగానే ఊహించవచ్చు. మోదీ ప్రభుత్వం ప్రకటించిన పెద్ద నోట్ల రద్దు పథకం అందుకు చాలా వరకూ దోహదం చేసింది. దీనివల్ల సాధారణ ప్రజానీకానికి ఎదురవుతున్న కష్టనష్టాలు జనం మోదీ గురించి పునరాలోచన చేయడానికి అవకాశం కల్పించాయి. రాహుల్ ప్రస్తుతానికి మోదీ స్థాయికి ఎదిగి ఉండకపోవచ్చు. ఇద్దరి మధ్య భారీగా అంతరం కొనసాగుతూనే ఉంది. ఇద్దరూ భిన్న మార్గాల్లోనే ప్రయాణిస్తున్నారు. ఏదో ఒక రోజున తను ముందుకు వెళ్లలేకపోతానా అని రాహుల్ ఆశగా ఎదురు చూస్తున్నారు. అయితే, ఇందుకు ఎంతో శ్రమ అవసరమవుతుంది. ఎంతో వివేకం, ఎన్నో రాజకీయ యుక్తులు అవసరమవుతాయి. అంతకు మించి ఎంతో అదృష్టం కూడా తోడు కావాల్సి ఉంటుంది. అంతవరకూ బీజేపీ ఆయన మాటలను జోకులుగానే తీసుకోవచ్చు. కానీ, ఒక విషయంలో మాత్రం ఎద్దేవాలు, వెటకారాలను పక్కన పెట్టి అప్రమత్తంగానే ఉండాలి. మహాత్మా గాంధీ అన్నట్టు, 'నిన్ను నీ ప్రత్యర్థులు మొదట నిర్లక్ష్యం చేస్తారు, తరువాత నవ్వుతారు, తరువాత నీతో పోరాడతారు, చివరికి నువ్వే గెలుస్తావు.' బీజేపీ నాయకులు ఈ సూక్తిని గుర్తుంచుకోవడం మంచిది.

# థర్డ్ లింక్

-వి.వి.కూర్మారావు

**సమయం సుమారు మధ్యాహ్నం 1.30. రాజమండ్రి రైల్వే స్టేషన్ చాలా కోలాహలంగా ఉంది. విశాఖపట్నం చేర వలసిన సింహాద్రి ఎక్స్‌ప్రెస్ నిండు గర్భిణీలా ప్రయాణికులతో కిటకిటలాడుతూ పట్టాలపై నిలిచింది. జనరల్ బోగీలో కాలుమోపడానికి కూడా చోటు కరువైంది. పెళ్లిళ్ల సీజన్, వరుస సెలవులు, దగ్గరలో ఉన్న పండుగలు, వెరసి రైళ్లన్నీ విపరీతమైన రద్దీతో, నడుస్తున్నాయి. ఆ రద్దీలోనే సమోసాల అరుపులు, జాంపళ్ళబుట్టల సందళ్ళు, తినుబండారాల రణగొణ ధ్వనులు. కాఫీ, టీ అరుపులతో క్యాన్లు తోసుకు వెళుతూ నైపుణ్యంతో వ్యాపారం సాగిస్తున్నారు కొందరు.**



'ఆ పెద్దావిడ అలా నిలబడి ప్రయాణిస్తుంటే, కాస్త సర్దుకొని ఆమెకు సీటు ఇవ్వొచ్చుగా' ఒకాయన సీటు చివరన కూర్చున్న యువకుడితో అన్నాడు.

'మీరు నాకు సలహా ఇచ్చే బదులు, మీరే కొంచెం సర్దుకోవచ్చుగా' యువకుడి జవాబు.

'సీటు చివర్లో కూర్చున్నావు కనుక నీకు చెప్పాను, నేను మధ్యలో కూర్చున్నాను' తనని తను సమర్థించుకున్నాడు ఆసామి.

'ఏం చేయాలో నాకు తెలుసు, మీరు చెప్పవలసిన పని లేదు' పెడసరంగా అన్నాడు యువకుడు.

ఇంతలో ఇంకొక వ్యక్తి తనసీటు ఖాళీ చేసి ఆ డెబ్బైఏళ్ళు పైబడిన ముసలావిడకు చోటిచ్చాడు. ముసలావిడ కృతజ్ఞతతో ఆ పెద్దమనిషి వంక చూసి కూర్చుంది.

"ఏంటయ్యా, నా సీటులో కూర్చున్నావు, నేను బాత్‌రూమ్‌కని లేచివెళ్ళాను, లేవయ్యా' గదమాయించాడు ఓ నలభైఏళ్ల వ్యక్తి.

'నీ సీటు అని రాసి ఉందా? ఏమిటి నీ దబాయింపు. నేను లేవను' మొండికేశాడు కూర్చున్న వ్యక్తి.

'ఏం తమాషాగా ఉందా?' 'నువ్వే తమాషా చేస్తున్నావు' మాటకు మాట.

'ఊరుకోండయ్యా. కాస్త సర్దుకు కూర్చోండి' పక్కనున్న వారి వారింపులు.

ఇంతలో 'ఆపండి, ఆపండి, ఎవరైనా చైన్ లాగి పుణ్యం కట్టుకోండి. నేను దిగే లోపే రైలు కదిలిపోయింది' ఆపసోపాలు పడుతూ యలమంచిలి స్టేషన్‌లో ఓ యాభైఏళ్ళ వ్యక్తి రెండు మూడు సంచులతో జనంలోంచి తోసుకుంటూ ముందుకు వస్తున్నాడు. ఎవరూ అతని అరుపులకు స్పందించడం లేదు.

'ఎవరైనా చైన్ లాగి ఆపండి' మళ్లీ గొంతు పెంచి తలుపు వైపు తోసుకు వెళ్ళాడు.

ఒక్క కుదుపుతో ట్రైన్ ఆగింది. ఒక్క ఉదుటున ఆ ఏభై ఏళ్ళవ్యక్తి దిగి మాయమై పోయాడు.

ట్రైన్ వెంటనే కదలలేదు. చాలా సేపు అక్కడే ఆగిపోయింది.

"ఎవరు, ఎవరు చైన్ లాగింది? అరుపులాంటి కేకలతో బోగీలోకి ప్రవేశించాడు రైల్వే అధికారి. ఎవరూ మాట్లాడలేదు.

'మిమ్మల్నే అడుగుతున్నాను, చెప్పండి. ఎవరు చైన్ లాగింది?' బోగీలో ఆ చివరనుంచి ఈ చివరి వరకూ అందర్నీ ప్రశ్నిస్తూ స్వైరవిహారం చేస్తున్నాడు ఆ రైల్వే ఉద్యోగి. ప్రయాణికులెవరూ స్పందించలేదు.

'ఏం పరిహాసంగా ఉందా? మీలో ఎవరు చైన్‌లాగారో చెప్పే వరకూ ఈ ట్రైన్ కదలదు' ఆ బెదిరింపులకు జడిసి ఒకాయన 'ఇదుగో ఇతనేనండి చైన్ లాగింది' అంటూ ఓ ముప్పైఏళ్ల వ్యక్తిని చూపించాడు. ఆ వ్యక్తి అయోమయంగా చూశాడు. చెమట్లు పడుతున్నాయి.

'మీ పేరు?' అడిగాడు అధికారి.

'అర్జునరావు'

'చైన్ ఎందుకు లాగావు?'

'పాపం ఒకాయన ఈ జనంలో చిక్కుకొని బైటకు రాలేక ఇబ్బంది పడుతుంటేను...' నసిగాడు అర్జునరావు.

'అంత జాలి, కనికరం ఉన్నవాడివి తర్వాతి పరిణామాల గురించి ఆలోచించలేదా?'

'అంటే' అర్థం కాలేదు అర్జునరావుకి.

'ఫైన్ కట్టాలయ్యా, వెయ్యి రూపాయలు తియ్యి'.

బిక్కమొహంవేసి చూశాడు. మొహంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు.

'తియ్యవయ్యా, ఆలస్యం చెయ్యకు, ట్రైన్ ఆగిపోయింది' తొందర చేశాడు రైల్వే అధికారి.

అర్జునరావు బతిమాలాడు. తప్పు అయిపోయింది క్షమించమన్నాడు. చుట్టూ చూశాడు. తనకు అనుకూలంగా ఎవరైనా వత్తాసు పలుకుతారేమోనని ఆశగా చూశాడు. అందరూ మౌనం వహించారు. జరుగుతున్న తంతు చూస్తూ ఆనందిస్తున్నారు.

'ఏదో అయనకి సహాయం చేద్దామనుకున్నా.

మళ్లీ ఇటువంటి పనికి పూనుకోను' ఏడుపు మొహంతో చెప్పాడు అర్జునరావు.

'వీల్లేదు, ఫైన్ కట్టాల్సిందే' తొందరగా సెటిల్ చేసుకోవయ్యా, ట్రైన్ ఆగిపోయింది. జనంలోంచి ఒక ఉచిత సలహా వచ్చిపడింది.

చేసేది లేక జేబులోంచి నలిగిపోయిన రెండు అయిదు వందలనోట్లు తీసి సమర్పించుకున్నాడు. 'జాలి కూడా ఖరీదైపోయింది ఈ సమాజంలో' మనసులో అనుకున్నాడు.

మరో పదినిమిషాల్లో రైలు కదిలింది. అర్జునరావు మనసులో అలజడి రేగింది. ఎవరికీ పట్టని పని తానెందుకు చేశాడు? మంచికిపోతే ఇంతకు మించి ఫలితం రాదా?' ఆలోచనలతో అర్జునరావు ఆఖరిమజిలీ చేరుకుని విశాఖపట్నంలో ట్రైన్ దిగాడు.

•••

విశాఖపట్నంలో ఓ ప్రైవేట్ కంపెనీలో కంప్యూటర్ ఆపరేటర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు అర్జునరావు. బి.కాం పాసై కంప్యూటర్ కోర్స్ చేసిన అర్జునరావుకి గవర్నమెంటు నౌకరీ దొరకడం దుర్లభమైంది. అర్జునరావు తండ్రి కూడా ప్రైవేటు ఉద్యోగం చేసి తనయుడికి ప్రభుత్వ ఉద్యోగం రావాలని తెగ తాపత్రయపడ్డాడు. కాని ఫలితం శూన్యం. ఏడాది క్రితమే అర్జునరావుకి విశాఖపట్నం కాపురస్తురాలు సుభద్రతో వివాహం జరిపించాడు తండ్రి. సుభద్రది సామాన్య కుటుంబ నేపథ్యం. అట్టే చదువుకోక పోయినా, ఇల్లు చక్కదిద్దుకోగలదు. అనుకూలవతి. ఈ మధ్యే కొడుకు పుట్టాడు. భార్య, తల్లిదండ్రులతో కలిసి న్యూకాలనీలో తండ్రి సంపాదించిన ఇంట్లోనే ఉంటున్నాడు.

చిన్ననాటి మిత్రుడు రవి పెళ్లికి రాజమండ్రి వెళ్లి వచ్చాడు అర్జునరావు. రవి బి.టెక్ చదివి హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నాడు. వివాహానికి రాజమండ్రి రమ్మని మిత్రుడికి ఫోన్‌చేసి శుభలేఖ పంపించాడు. సుభద్రను కూడా తీసుకు వెళ్లాలని అర్జునరావు నిశ్చయించుకున్నాడు గానీ బోలెడు డబ్బు ఖర్చు, మీరొక్కరే వెళ్లిరండని సాగనంపింది సుభద్ర.

•••

"ఏమండీ వచ్చారా? మీ కోసమే చూస్తున్నాను. ఇంట్లో సరుకులు, కూరగాయలు, పిల్లవాడికి పాల డబ్బా అన్నీ కావాలి. వేగంగా బజారుకెళ్లి తీసుకు రండి" హుకుం జారీ చేసింది ఇల్లాలు.

'జేబులో చిల్లిగవ్వ లేదు. ఉన్నదంతా రైల్వే వాళ్లకే సమర్పించాడు, ఇప్పుడెలా?' ఆలోచనలో పడ్డాడు అర్జునరావు.

'నా దగ్గర డబ్బులేదు. ప్రస్తుతానికి సర్దుకో. రేపు చూద్దాంలే" గొణిగాడు.

"అలా అంటే ఎలా, పిల్లాడు పాలకి ఏడుస్తున్నాడు. వాయిదా వేయడానికి వీల్లేదు. అయినా సొమ్మంతా అప్పుడే ఖర్చయిపోయిందా? ఇంకా జీతం రావడానికి పది రోజులు సమయం ఉంది. ఏం చేశారు డబ్బంతా?" ఆరా తీయబోయింది సుభద్ర.

"పెళ్లిలో చదివించాలే" రైలులో సంఘటన బైటకు చెప్పలేక అవస్థపడ్డాడు.

"ఎంత చదివించారేమిటి? అయినా తాహతుకు మించి ఖర్చుచేస్తే పస్తులుండవలసిందే" మామగారు, అత్తగారు వింటున్నా సుభద్ర తన మనసులో మాట దాచుకోకుండా చెప్పింది.

ఇక చేసేది లేక 'సరే, ఇప్పుడే వస్తా' అంటూ తోటి ఉద్యోగి రమణ దగ్గరకి వెళ్ళాడు.

**అతనో సాదాసీదా మనిషి. స్నేహితుడి పెళ్లికి హాజరై తిరిగి విశాఖపట్నం బయల్దేరాడు. రైలు కిటకిటలాడిపోతోంది. కాలుకిందపెట్టే చోటు లేదు. ఇంతలో ఏదో స్టేషన్ వెళ్లిపోతోంది. ఒకతను లగేజీతో దిగలేక పోయాడు. అర్జునరావు చైన్ లాగి అతడికి సాయం చేశాడు. కానీ ఒరిగిందేమిటి? వెయ్యి రూపాయలు ఫైన్ కట్టి నష్టపోయాడతను. ఆ నెల ఇంటి గ్రాసానికి అప్పు చేయాల్సి వచ్చిందతను. మరి మంచివాళ్లకి ఇలా అన్యాయమే జరుగుతుందా?**

కొంతసొమ్ము రమణ దగ్గర తీసుకుని ఇంటికి కావలసిన సరుకులు, పిల్లవాడి పాలడబ్బా కొని ఇంటికి వచ్చాడు.

•••

"ఏమండీ, గ్యాస్ అయిపోవచ్చింది. గ్యాస్ బుక్ చేసినా, ఆధార్ కార్డు లేకపోతే సిలిండర్ దొరకదట. ఇంతవరకూ ఆధార్‌కార్డుకోసం మీరు ఎటువంటి ప్రయత్నం చేయలేదు. ఇలా అయితే వంట అయినట్లే. మనం తిన్నట్లే. వెంటనే ఆధార్‌కార్డు కోసం దరఖాస్తుచేసి వేగంగా వచ్చేమార్గం చూడండి. గ్యాస్‌బండ ఇంకా కొద్ది రోజులే వస్తుంది. ఆ తరువాత మనకి పస్తులే" గుక్క తిప్పుకోకుండా సుభద్ర చెప్పినదంతా విని ఉలికిపడ్డాడు. ఇక తప్పదని ఆధార్ కార్డ్ కోసం నడుం కట్టాడు అర్జునరావు.

•••

"మీకో కొరియర్ వచ్చింది" సుభద్ర ఓ కవర్ చేతికిచ్చింది ఆఫీసు నుంచి తిరిగొచ్చిన అర్జునరావుకి.

"నాకు కొరియర్ పంపించే వాళ్లెవరబ్బా" అనుకుంటూ ఆత్రుతతో కవర్ తెరిచాడు.

అర్జునరావుగారు,

నా పేరు వామనరావు. నేను యలమంచిలిలో కిరాణా వ్యాపారం చేస్తున్నాను. రాజమండ్రి నుంచి సరుకులు కొని తెస్తుంటాను. పోయిన ఆదివారం సింహాద్రిలో ప్రయాణించాను. బోగీ చాలా రద్దీగా ఉంది. కాలు కదపడానికి కూడా ఇబ్బంది అయింది. యలమంచిలిలో దిగాలి. లోపలి నుంచి బోగీ తలుపు దగ్గరకు చేరుకునే సరికి ట్రైన్ కదిలిపోయింది. చైన్ లాగమని ప్రయాణికులను అర్థించాను. అరిచాను. ఎవరూ స్పందించలేదు. కాని మీరు కలుగచేసుకుని చైన్ లాగి నన్ను యలమంచిలిలో దిగేలా చేశారు. నా మిత్రుడు, విశాఖవాసి సుందరరావు కూడా ఆ బోగీలోనే ఉన్నాడు. మీరు చైన్‌లాగిన విషయం ఆ తరువాత జరిగిన సంఘటనల గురించి నా మిత్రుడు నాతో చెప్పాడు. మీరు రైల్వేవారికి ఫైన్ కట్టారని విని చాలా బాధపడ్డాను. నా వల్ల మీరు ఇబ్బంది ఎదుర్కొన్నారు. మీకు నేను రుణపడి ఉన్నాను. ఆరోజు మీరుకట్టిన సొమ్మును చెక్కు రూపంలో పంపిస్తున్నాను. దయచేసి స్వీకరించండి. అసౌకర్యానికి మన్నించండి. మీ పేరు, చిరునామా సుందరరావు నాకు తెలియజేశాడు. అదెలాగంటే మీరు ఆధార్‌కార్డ్ కోసం దరఖాస్తు చేస్తున్న సమయంలో మీ వెనుకే క్యూలో సుందరరావు ఉన్నాడు. ఆ రోజు జరిగిన సంఘటన గుర్తు తెచ్చుకుని, మీతో పరిచయం పెంచుకుని మీ వివరాలు సేకరించి నాకు పంపించాడు. ఎదుటి మనిషికి సహాయం చేయాలనే మీ తపనకు నేను చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

ఇట్లు వామనరావు.

అర్జునరావు ఆశ్చర్యానికి గురయ్యాడు. వామనరావులాంటి వాళ్లు కూడా ఇంకా ఈ సమాజంలో ఉన్నారా! అనుకుంటూ ఓసారి చెక్కువైపు చూసి, ఆరోజు సంఘటనను మరోసారి నెమరు వేసుకున్నాడు. ఇంతలో 'ఆధార్‌కార్డు వచ్చింది సార్, తీసుకోండి' అన్న పోస్ట్‌మేన్ కేకతో ఈ లోకంలోకి వచ్చాడు అర్జునరావు, ఆధార్‌లింక్ అంటే ఇదేనేమో అనుకుంటూ.

సెల్: *98485 21903*









# ఖరీదైన జంతువులు

**జంతువులను పెంచుకోవడం యుగాల నుంచి ఉన్న ఆచారం. మనుషులతో మమేకమై, మనల్ని అర్థం చేసుకుంటూ, ఆనందాల్ని పంచుతూ, మన అవసరాల్ని తీర్చే ప్రేమైక జీవులు అవి. ఇక కొందరైతే వాటినే పిల్లలుగా భావించి అపురూపంగా చూసుకుంటారు. వాటిని ఎంతగానో ప్రేమిస్తారు. వాటి కోసం లెక్కలేనంత ఖర్చు చేయడానికి కూడా వెనుకాడరు.**

**సాధారణంగా మనలో చాలామంది ఇళ్లల్లో ఏదో ఒక జంతువును పెంచుకుంటాం. ఇంతకుముందు రోజుల్లో అయితే డబ్బున్న వారే పెంపుడు జంతువులను ఎంతో శ్రద్ధగా పోషించేవారు. కానీ నేటికాలంలో ధనిక పేద తేడా లేకుండా అందరూ జంతువులను పెంచుకుంటున్నారు. అయితే ఇప్పుడు వాటిల్లో కూడా తేడాలు వచ్చేశాయి. డాబు, దర్పం ప్రదర్శించేందుకో ఏమోగానీ లక్షలు, కోట్లుపెట్టి మరీ జంతువులను విదేశాల నుండి కూడా కొనుగోలు చేస్తున్నారు. ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన పెంపుడు జంతువుల గురించి మీరూ చదివి తెలుసుకోండి మరి!!**

## ప్రపంచంలోనే ఖరీదైన కుక్కలు

అత్యంత నమ్మకమైన జంతువు ఏదంటే వెంటనే గుర్తొచ్చేది కుక్క. విశ్వాసానికి ప్రతీకగా చెప్పాలంటే శునకానికి ఉన్న ప్రాధాన్యం మరే జంతువుకూ లేదు. మానవుడు మొదటిసారి మచ్చిక చేసుకున్న జంతువుగా శునకానికి పేరు. మనదేశంలో 14,000 సంవత్సరాల క్రితమే వీటిని పెంచడం ప్రారంభించారు. అలాంటి శునకాలలో ఎన్నో రకాల జాతులు ఉన్నాయి. వాటిలో అత్యంత ఖరీదైన శునకాలు కూడా ఉన్నాయి. వాటి లక్షణాలనుబట్టే వాటి రేటు నిర్ణయిస్తారు. అలాంటి కుక్కలను సొంతం చేసుకోవడానికి లక్షలు పెట్టడానికైనా చాలామంది వెనుకాడరు. పైగా వాటి బాగోగులకోసం ఎన్నో రెట్లు ఖర్చుపెడతారు కూడా! అందుకు ఒక ఉదాహరణ చెప్పాలంటే ఒక యజమాని ఎంతో ముద్దుగా పెంచుకుంటున్న లాబ్రడార్ శునకమే. ఈ లాబ్రడార్ జాతి శునకం చాలా ఖరీదైనది. ఎడ్గర్, నైనా దంపతులు లాబ్రడార్ జాతి శునకాన్ని ఎంతో ప్రేమగా పెంచుకుంటున్నారు. దానికి సర్ లాన్స్‌లాట్ అని పేరు పెట్టుకున్నారు. అదంటే వారికి ప్రాణం. ఈ శునకానికి కేన్సర్ సోకిందని తెలియడంతో ఎంతో కుమిలిపోయారు. దానికి ఖరీదైన వైద్యం అందించారు. లాన్స్‌లాట్ వైద్యం నిమిత్తం 155,000 డాలర్లు ఖర్చుపెట్టారు. ఖరీదైన వైద్యం అందించినప్పటికీ దురదృష్టవశాత్తు అది చనిపోయింది. ఐతే లాన్స్‌లాట్‌ను శాశ్వతంగా కోల్పోవడం ఇష్టంలేక దాని డీఎన్ఏను వేరు చేసి వేరే శునకం ద్వారా ఆ కుక్క జాతిని అభివృద్ధి చేస్తున్నారు.



ఇక అంత ఖరీదైన వైద్యం పొందిన కుక్కగా సర్ లాన్స్‌లాట్ పేరు పొందితే, టిబెటన్ మాస్తిఫ్ అనే మరో పెంపుడు శునకం ప్రపంచంలోనే ఖరీదైనదిగా పేరుపొందింది. ఈ కుక్కని తూర్పు ఆసియా దేశాల్లో ధనికుల దర్పానికీ, విలాసవంతమైన జీవనానికీ ప్రతీకగా చెప్పుకుంటారు దీన్ని. ఈ టిబెటన్ మాస్తిఫ్ కుక్కను పెంచుకోవడం ధనికులకే సాధ్యపడుతుంది. చైనాలో ఒక ధనికుడు దీనిని 1.14 మిలియన్ల పౌండ్లకు కొనుగోలు చేశాడు.

## శ్వేత మృగరాజం!

సింహం శౌర్యానికి ప్రతీక. ఎన్ని రంగుల్లోనైనా సింహం ఉండొచ్చుగానీ, తెలుపు రంగు సింహం మాత్రం ఎంతో అరుదు. ధవళకాంతులీనే శ్వేత సింహం చాలా అరుదైన జాతిగా ప్రసిద్ధి పొందింది. ఇలాంటి అరుదైన మృగరాజం దక్షిణ ఆఫ్రికాలోని క్రుగర్ నేషనల్ పార్క్‌లో ఉంది. తెలుపురంగు సింహాలు ప్రపంచం మొత్తంమీద కేవలం 300 మాత్రమే ఉన్నాయి. వీటి చర్మంతోపాటు కళ్లు కూడా తెలుపు రంగులో ఉంటాయి. ఇలా ఉన్నాయంటే ఇవి అల్బినోస్ అనుకుంటే పొరపాటే. జన్యుపరమైన కారణాల వల్ల వాటికి తెలుపురంగు లభిస్తుంది. సౌతాఫ్రికాలో ఉన్న తింబావతి గేమ్ రిజర్వ్ అనే ప్రాంతంలో మాత్రమే ఈ శ్వేత సింహాలను మనం చూడగలం. అక్కడున్న అధికారులు ఈ తెల్లటి సింహానికి 105,000 పౌండ్లు ఖరీదు కట్టారు.

### ఈ గుర్రానికి వేగం ఎక్కువ

గుర్రాలు పెంచుకోవడం కొందరికి అలవాటు. మరికొందరికేమో గుర్రప్పందాలంటే మోజు ఉంటుంది. ఎంతలా అంటే గుర్రాలకోసం ఎంత ఖర్చు పెట్టడానికైనా వెనుకాడరు. మేలు జాతి గుర్రంకోసం ఇలాంటి వాళ్లు ఎప్పుడూ అన్వేషిస్తుంటారు కూడా. ఇలా అత్యంత ఖరీదైన జాతి గుర్రాలను పెంచడం ఎందుకంటే, కేవలం గుర్రపు పందాలకు ఉపయోగించుకోవడానికే.

అలాంటి జాతికి చెందిన ఓ గుర్రం పేరు ద గ్రీన్ మంకీ. దీని వయసు రెండు సంవత్సరాలు. ఒక అమెరికన్‌వాసి 2006లో దీన్ని కొనుగోలు చేశాడు. గుర్రప్పందాల్లో గెలిచేందుకే ప్రత్యేకంగా దీన్ని కొనుగోలు చేశాడట. ఈ గ్రీన్ మంకీని ఎంతపెట్టి కొన్నాడో తెలుసా? 16 మిలియన్ల డాలర్లు! ప్రపంచంలో అంత ఖరీదు పెట్టి కొన్న గుర్రం ఇదే. ఐతే దురదృష్టం కొద్దీ, పాల్గొన్న ఏరేసులోనూ ఈ గుర్రం గెలవలేదు. దీంతో సదరు గుర్రం యజమాని 2008 తర్వాత ఈ గుర్రాన్ని రేసులోంచి తప్పించాడు.

### ప్రపంచంలో ఖరీదైన ఆవు

ప్రాచీన కాలం నుంచి ఇప్పటి వరకు ఆవుల పెంపకం అనాదిగా వస్తున్న ఆచారం. రకరకాల ప్రయోజనాల దృష్ట్యా ఆవులను మనం పెంచుకుంటున్నాం. అయితే ప్రపంచంలోనే ఓ ఆవు అత్యంత ఖరీదైనది.



దానిపేరు మిస్సీ. ఇది కెనడాలో ఉంటుంది. 2013వ సంవత్సరంలో ఒక కెనడా వాసి 1.2 మిలియన్ డాలర్లు ఇచ్చి మిస్సీని కొనుగోలు చేశాడు. ఆవుకి అంత ఖరీదా? అని ఆశ్చర్యపోతున్నారా! ఈ జాతి ఆవు నుంచి లభించే ఉత్పత్తులకు ఆదాయం ఎక్కువ! కేవలం దాని ఉత్పత్తులకే కాదు, దాని చర్మానికి కూడా రేటు ఎక్కువే. ఈ జాతి ఆవులను ప్రత్యేక పద్ధతిలో పెంచుతారు. వీటికి సోయాబీన్ అన్నం, మినరల్స్, బార్లీ గింజలు, కార్న్‌ఫ్లేక్స్ లాంటివి పెట్టి పోషిస్తారు. అంతేకాదు వీటిని ఉంచే ప్రదేశం కూడా ఎంతో పరిశుభ్రంగా, హై సెక్యూర్డ్‌గా ఉంటుంది.

## విచిత్రమైన సాలెగూడు!



ఇంటి మూలల్లో, చెట్టుకొమ్మల్లో ఉండే సాలెపురుగుల గురించి మనకు తెలుసు! కానీ నీటి అడుగున బతికే సాలీడు గురించి మీకు తెలుసా? ఈ సాలీడు పేరు డైవింగ్ బెల్ స్పైడర్. నీటిలో కూడా జీవించగలదు కాబట్టి దీన్ని వాటర్ స్పైడర్ అని కూడా పిలుస్తారు. ప్రపంచవ్యాప్తంగా 35 వేల రకాల సాలీళ్లు ఉన్నాయి. వీటన్నింటిలోనూ నీటిలో ఉండేది ఇదొక్కటే. 8 నుంచి 15 మిల్లీమీటర్ల పరిమాణంలో ఉండే ఈ స్పైడర్ ఐరోపా, ఆసియా ఖండాల్లో కనిపిస్తుంది. నీటిలో ఉండాలంటే ఆక్సిజన్ కావాలి. దీనికి ఆక్సిజన్ ఎలా లభిస్తుందా అని అనుకుంటున్నారా? అందుకోసం ఈ సాలీడు ఒక ప్రత్యేక ఏర్పాటు చేసుకుంటుంది. నీటిలో ఏదో ఒక మూలన, ఏవైనా ఆకుల దగ్గర సాలెగూడు నిర్మించుకుని తన కాళ్లపై ఉన్న ప్రత్యేకమైన వెంట్రుకలతో ఆ గూటిని నీటి బుడగలతో నింపుకుంటుంది. ఈ నీటి బుడగల్లో ఉండే ఆక్సిజన్‌ను గ్రహిస్తుంది. పొట్టభాగంలో ఉండే ఈ నీటిబుడగలవల్ల ఈ సాలెపురుగు వెండిరంగులో కనిపిస్తుంది. అయితే ఎంత నీటి అడుగున ఉన్నప్పటికీ కచ్చితంగా రోజులో ఒకసారి నీటిపైకివచ్చి గాలిలోని ఆక్సిజన్ గ్రహిస్తుంది. నీటినుంచి బైటకు వచ్చినప్పుడు ఈ వాటర్ స్పైడర్ ముదురు గోధుమరంగులో కనిపిస్తుంది. పొట్టభాగంలో ఉన్న వెంట్రుకలు ముదురు బూడిదరంగులో ఉండి వెల్వెట్‌లా కనిపిస్తాయి.

## చీమ భాష తెలుసా?



క్రమశిక్షణకు మారు పేరు చీమ. చూడ్డానికి చిట్టి చిట్టి ఆకారంలో కనిపిస్తాయి గానీ, వాటికి బోలెడు తెలివితేటలుంటాయట. అది సరే, మరి చీమ భాష గురించి మీకు తెలుసా? ఏంటీ చీమలకూ ఒక భాష ఉంటుందా? అవి ముచ్చట్లు కూడా చెప్పుకుంటాయా అని అనుకుంటున్నారా? అవును. ఈసారి బాగా పరిశీలించండి. ఎదురెదురుగా వచ్చే రెండు చీమలు ఆగిపోయి ఉన్నాయంటే అవి మాట్లాడుకుంటున్నాయనే అర్థం. ఇవి ఒక ప్రత్యేకమైన పద్ధతి ద్వారా మాట్లాడుకుంటాయి. ఈ విషయాన్ని ఇటీవలే పరిశోధకులు వెల్లడించారు. చీమలు మాట్లాడుకోవాలంటే మనలాగా వాటికి మాటలు రావు. అవి రసాయనాలతో మాట్లాడుకుంటాయి. ఒకచీమ మరోచీమ నోట్లో ద్రవాలను పంచుకోవడంవల్ల బోలెడు విషయాలను పరస్పరం తెలుసుకుంటాయి. ఈ పద్ధతిని ట్రోఫాలాక్సిస్ అంటారు.

ఆ రసాయనిక ద్రవాల్లో జువెనిల్ హార్మోను, మాలెక్యూల్స్, ఇతర రసాయనాలు ఉంటాయి. స్విట్జర్లాండ్ లోజాన్ విశ్వవిద్యాలయం పరిశోధకులు ఫ్లోరిడా కార్పెంటర్ చీమలపై చేసిన ఓ పరిశోధనలో ఈ సంగతులన్నీ బైటపెట్టారు. కేవలం చీమలే కాకుండా ఇతర జీవుల్లోనూ ఇలా లాలాజలం ద్వారా మాట్లాడుకునే అవకాశం ఉండొచ్చని శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు.

**-సంతోషి దహగాం**

# పసిమనసు

-పోలాప్రగడ రాజ్యలక్ష్మి

**అమ్మా, నిన్నంతా కనిపించలేదు. ఎక్కడికి వెళ్లావు? నీ దగ్గర పడుకున్న బుజ్జిగాడు ఎవరు? బేలగా అడిగాడు మూడేళ్ల ధృవ. ఆ మాట విన్న మీనాక్షికి జాలేసింది.**

**ఎలా చెప్పాలో అర్థంకాక, ఇలారా బాబూ ధృవా? అంది ప్రేమగా. నేను రాను వాడెవడు? మనింటికి ఎందుకు వచ్చాడమ్మా? అన్నాడు.**

బాబూ, వీడు నీకు బుజ్జి తమ్ముడు. వీడితో ఆడుకోవచ్చు అంది మీనాక్షి.

నేను రాను, వాణ్ణి తీసెయ్యి అన్నాడు కోపంగా ధృవ.

పాలు తాగి బజ్జున్నాడు, నిద్రలేచాక నవ్వుతాడు, పలకరిస్తాడు.

నువ్వు బామ్మ దగ్గరకి వెళ్ళి బొబ్బ పోసుకుని ఆము తినిరా? తాతయ్యతో కబుర్లు చెబుదువుగానీ అంది మీనాక్షి.

ఏం నీ దగ్గరకు రాకూడదా? నువ్వు నాకు అన్నం పెట్టవా? ఎత్తుకోవా? అని ఏడ్చేశాడు ధృవ కళ్ల నీళ్లు తుడుచుకుంటూ.

మీనాక్షికి జాలితో మనసు కరిగిపోయింది. సంతోషమొచ్చినా, బాధ వచ్చినా వాటిని కళ్లే చెపుతాయి.

ఇంతలోకి వాళ్ల బామ్మ వచ్చి, రా ధృవా? అని తీసుకువెళ్లింది. ధృవుడికి, మెల్లగా కబుర్లుచెపుతూ నీళ్లుపోసి అన్నం తినిపిస్తూ, మన పక్క వాళ్లింట్లో బుల్లికుక్కపిల్ల ఉంది. కదూ? అది భౌ భౌ మంటుంది కదూ! బుజ్జికుక్కపిల్ల బాగుంది కదూ? వాళ్ల శారద దాంతోనే ఆడుకుంటుంది అని చెబుతుంటే, వింటూనే ధృవుడు అడిగాడు, బామ్మా అమ్మ దగ్గర బజ్జున్న బుల్లిబాబు ఎవరు? ఎక్కడి నుంచి వచ్చాడు? నువ్వైనా చెప్పుబామ్మా? అని.

వాడికి ఎలా చెప్పాలో అర్థం కావటంలేదు. మనం దేవాలయానికి వెళ్లాం కదా? అప్పుడు మీ అమ్మ, నీతో ఆడుకోడానికి ఒక తమ్ముణ్ణి ఇమ్మని దేవుణ్ణి అడిగింది. అందుకే దేవుడు ఒక తమ్ముణ్ణి ఇచ్చాడు. ఇంక వెళ్లి ఆడుకో. వీధిలో తాత దగ్గరికి వెళ్లు, నాకు పని ఉంది అని గట్టిగా కసిరింది. ధృవుడికి బామ్మమీద కోపం వచ్చి తాత దగ్గరికి పరుగెత్తాడు.

ఏరా బాబూ ఏం చేస్తున్నావు? నీకో బుజ్జి తమ్ముడు పుట్టాడు కదూ అన్నారు తాతగారు.

తాతయ్యా, అమ్మ నాది కదా అన్నాడు. నీదే నాన్నా అన్నారు తాతగారు.

మరి అమ్మ వాడితోనే ఉంటుందా, ఇక నాతో మాట్లాడదా? నన్ను ఎత్తుకోదా? అన్నం తినిపించదా? భోరున ఏడ్చేశాడు ధృవ. ఊరుకో నాన్నా అని ఎత్తుకుని కళ్లు తుడిచి, చాక్లెట్ కొనుక్కుందాం పద అని వీధిలోకి తీసుకెళ్లాడు.

పక్కింటి మూడేళ్ల శారదా, కుక్కపిల్ల కనిపించడంతో ఏడుపు మరిచిపోయాడు ధృవుడు.

ఈ రోజుల్లో పిల్లలు, పిల్లలుకాదు పిడుగులు. యక్షప్రశ్నలు, లక్షప్రశ్నలు వేస్తారు. మా చిన్నతనంలో ఇన్ని ఆలోచనలు ఎరగం సుమా అంటూ ధృవుడి తాతగారు ఆశ్చర్యపోయారు.

చాక్లెట్ తింటూ తండ్రి గదిలోకి వెళ్లి డాడీ, డాడీ అని పిలిచాడు. ఏం ఎందుకురా అన్నాడు ధృవుడి తండ్రి శర్మ.

అమ్మ నాదికాదా? అన్నాడు. నీదేరా బాబూ అన్నాడు తండ్రి ముద్దుగా.

మరి ఇంకొక బాబుతో ఉంది. అమ్మ నా దగ్గరే ఉండాలి కదా అన్నాడు ధృవుడు.

నన్ను విసిగించకు. ఆఫీసు పనిలో ఉన్నాను అంటూ కోప్పడ్డాడు తండ్రి.

మళ్లీ ఏడుపు మొదలెట్టి అమ్మా! అంటూ తల్లి దగ్గరకి వచ్చాడు.

అలా గట్టిగా ఏడవకు, చంటిబాబు లేస్తాడు అరిచింది తల్లి మీనాక్షి.

వాడిని తీసెయ్యి, నన్ను ఎత్తుకో అని మరీ పెద్దగా ఏడవడం మొదలెట్టాడు ధృవుడు.

ఇలారా అని ఎత్తుకుని, బాబూ! నీకు ఎవరుచెప్పినా, ఎలా చెప్పినా అర్థం కావడం లేదుగానీ నేను నీకో కథ చెప్పనా? అంది. చెప్పు మరీ అన్నాడు.

మన చెట్టుమీద రెండుపక్షులు ఉన్నాయి కదా? ఉన్నాయి. అన్నాడు ధృవ.

ఆ పక్షులు దగ్గర ఒక బుజ్జి పక్షి కు...కు... అని అరుస్తోంది కదా? మనకి ముద్దుగా ఉంది కదా, అలాగే మనింట్లో కూడా ఒక బుజ్జిబాబు పుట్టాడు. వాణ్ణి పలకరిస్తే నవ్వుతాడు. ఊ ఆ, అంటాడు.



కొన్నాళ్లకి మాట్లాడతాడు, నడుస్తాడు. అప్పుడు ఇద్దరూ కలిసి స్కూలుకి వెళ్లొచ్చు అంది మీనాక్షి. ధృవకి ఏం అర్థమైందోగానీ, సరే అన్నాడు. అమ్మా సరేనా? అన్నాడు. సరే అదిగో శారద వచ్చింది వెళ్లి ఆడుకో అంది. అలా తాత్కాలికంగా ధృవని కన్విన్స్ చేసేటప్పటికి తల ప్రాణం తోక్కొచ్చింది అనుకుంది మీనాక్షి.

●●●

ధృవా, తమ్ముడు ఏడుస్తున్నాడు. ఉయ్యాల ఊపు అంటూ కేకేసింది పనిలో ఉన్న మీనాక్షి.

చీర వేసి కట్టిన ఆ ఉయ్యాలను అటూఇటూ ఊపాడు ధృవుడు. ఉయ్యాల గోడకితగిలి గట్టిగా గుక్కపెట్టి ఏడ్చేశాడు బుజ్జిబాబు. మీనాక్షి గబగబా వచ్చింది. ఏం చేశావురా? అని ధృవ వీపు మీద రెండుదెబ్బలు కొట్టింది. చంటి పిల్లాణ్ణి తీసుకుని, ఊరుకోబెడుతూ భుజాన వేసుకుంది.

ధృవకి వెర్రిబాధ కలిగింది. తనని కొట్టింది సరే, వాణ్ణి భుజాన వేసుకుని లాలిస్తోంది. తను కూడా పెద్దగా ఏడుస్తూ, అమ్మ కొట్టింది బామ్మా అని వెళ్లాడు ధృవ. ఏం పాడు పనిచేశావో, ఏడవకు. నేను జపం చేసుకుంటున్నాను, వెళ్లి ఆడుకో అంది. అక్కడినుండి తాత దగ్గరకు వెళ్లి తాతా, అమ్మ కొట్టింది అని ఏడ్చాడు.

అస్తమానం ఏదో ఒకటి చెపుతూనే ఉంటావు. తోచక ఏడుస్తున్నావు. నేను ఫోనులో మాట్లాడుతున్నాను. వీధిలోకివెళ్లి ఆడుకో. పక్కింటి శారద గుజ్జనగూళ్లు ఆడుకుంటోంది వెళ్లు అని పంపించేశారు తాతగారు.

ధృవ మళ్లీ తండ్రి దగ్గరకొచ్చాడు. డాడీ, అమ్మ కొట్టిందీ అని దీర్ఘం తీశాడు.

ఏం అల్లరి చేశావో, ఊరికే ఎందుకు కొడుతుంది అన్నాడు తండ్రి.

అల్లరి చేయలేదు. తమ్ముడు పడుకున్నాడు. ఊయల ఊపాను. అది గోడకి తగిలింది. దాంతో పెద్దగా ఏడ్చాడు. నాకేం తెలియదు. అమ్మ నన్ను కొట్టింది డాడీ అని భోరున ఏడ్చాడు ధృవుడు.

శర్మకి జాలేసి లేదులేరా బాబూ ఏడవకు. నిన్నూ, తమ్ముడినీ సాయంకాలం బజారుకి తీసుకువెళ్లి బుడగలు, విజిల్స్ కొంటాను. నేను ఆఫీసు నుంచి వచ్చేదాకా అల్లరి చేయకూడదు మరి, అని బుజ్జగించాడు శర్మ.

అల్లరి చేయడం అంటే ఏమిటి? అదేమైనా తినేదా? అన్నాడు. కాదురా బాబూ. పాప్‌కార్న్, బిస్కట్లూ కొంటాన్లే, నేను ఆఫీసుకు వెళ్లాలి అని వెళ్లిపోయాడు శర్మ. అమ్మ కన్నా డాడీయే మంచివాడు. పాప్‌కార్న్ కొంటానన్నాడు అని వెళ్లి తల్లికి చెప్పాడు ధృవ.

సరేలే, మీనాన్న కబుర్లు బాగా చెపుతారు, అబద్ధాలు అంది మీనాక్షి దీర్ఘం తీస్తూ. అబద్ధాలు అంటే ఏమిటమ్మా? బేలగా తల్లికేసి చూస్తూ అడిగాడు ధృవుడు.

అన్నీ యక్షప్రశ్నలు లక్షప్రశ్నలు వేస్తావు. అవతల పొయ్యిమీద పాలు పెట్టాను, పొంగి పోతాయి. వెళ్లి ఆడుకో అంది మీనాక్షి కోపంగా.

ఇంట్లో ఎవరికీ నేను అక్కరలేదు. వెళ్లి ఆడుకో, మాట్లాడకు అంటున్నారు అనుకుని పక్కింటి శారద దగ్గరకు వెళ్లాడు ధృవ.

నా కుక్కపిల్ల ఎక్కడికి పోయిందో కనిపించడం లేదు. వెతుకుదాం రా అంది శారద. ఇద్దరూ చెయ్యిపట్టుకుని వీధిలోకి బయలుదేరారు. రెండు వీధులు తిరిగారు. ఇంటికి ఎలావెళ్లాలో తెలియలేదు. అటూఇటూ తిరుగుతూ భయంభయంగా చూస్తున్నారు. ఇల్లు ఎక్కడో మరిచిపోయారు.

ఎవరి పిల్లలు మీరు, ఎండలో తిరుగుతున్నారు? అని ఒక ముసలామె అడిగింది. ధృవ, శారద

**అమ్మ ఒడిలో ఆడుకునే ధృవుడికి మాటలు వచ్చాయి. ఊహవచ్చింది. అంతలోనే ఒక బుజ్జి తమ్ముడు పుట్టాడు ధృవుడికి. ఆ బుజ్జిబాబు ఎవరో, ఎందుకు అమ్మ పక్కన పడుకుని నిద్రపోతున్నాడో ధృవుడికి తెలియదు. తన స్థానాన్ని మాత్రం ఆ బుజ్జిబాబు లాగేసుకున్నాడు. అంతకు మించి ధృవుడికి ఏమీ తెలియదు. ఆ పసిమనసు తన సందేహం తీర్చుకోవడానికి శతవిధాలా ప్రయత్నించింది. మరి అతడి సందేహం తీరిందా లేదా?**

ఏం చెప్పాలో తెలియక కుక్కపిల్ల కావాలి అన్నారు. అది సరే, మీరు ఎవరి పిల్లలూ? మీ ఇల్లు ఎక్కడా? అంది.

చెప్పడం చేతకాక అమ్మా అని ఇద్దరూ భోరుమని ఏడ్చేశారు. ఇలా రండి అని వాళ్లని పిలిచి ఓ చెట్టుకింద కూర్చుంది. పూర్వం ఇళ్ల ముందర అరుగులుండేవి. కానీ ఇప్పుడు అందరూ కటకటాలు పెట్టుకొని, తాళాలు వేసుకుంటున్నారు, ఖర్మ. వీళ్లు ఎవరి పిల్లలో? వీళ్లని ఎవరికి అప్పజెప్పాలో? అనుకుంది. ఇంతలో ధృవ, శారదల దృష్టి అక్కడ కనిపించిన మేకలవైపు మళ్లింది. వాటిని చూసి చప్పట్లు చరుస్తూ సంబరపడిపోయారు. వాళ్లిద్దరినీ చూసి ముసలమ్మకి జాలి వేసింది. వీళ్లిద్దరినీ ఇలా వీధిలో ఒంటరిగా వదిలిపెట్టి తను వెళ్లలేదు. మీ ఇల్లెక్కడ అని అడిగితే చెప్పలేక పోతున్నారు అనుకుంది దిగులు పడుతూ.

కాసేపటికి ఆటలధ్యాస పోయింది. అమ్మ కావాలి అంటూ ధృవ ఏడుపు మొదలుపెట్టాడు. వాణ్ణి చూసి శారద కూడా అమ్మ కావాలి అని ఏడుపు మొదలెట్టేసింది. వీళ్లని తల్లిదండ్రుల దగ్గరకుచేర్చే మార్గంచూడు దేవుడా అని దణ్ణం పెట్టుకుని పిల్లలకోసం ఎవరైనా వస్తారేమోనని ఎంతోసేపు అక్కడే ఎదురుచూసింది ముసలమ్మ. ఆ పిల్లలిద్దరినీ కాపలాకాస్తూ ఎంతసేపని అలా చెట్టు కింద కూచోవాలో. విసుగొచ్చి చివరకు పిల్లలిద్దర్నీ తన ఇంటికి తీసుకువెళ్లింది.

ఎవరీ పిల్లలు? వీళ్లని ఎందుకు తీసుకువచ్చావు? అని ముసలమ్మని ఆమె కోడలు తిట్టింది. దాంతో ముసలమ్మ వాళ్లిదరినీ తీసుకుని మళ్లీ చెట్టు దగ్గరకు వచ్చింది.

●●●

మా ధృవుడు కనిపించటం లేదు, మీ ఇంటికివచ్చాడా? అని మీనాక్షి అడిగింది. అమ్మో దేవుడా, మా శారద కూడా కనిపించటంలేదు పొరుగింటావిడ కూడా కంగారుపడింది. మీనాక్షి అత్తగారూ మావగారు కూడా కంగారుపడ్డారు. పిల్లాణ్ణి జాగ్రత్తగా చూసుకోవద్దూ అంటూ మీనాక్షిని కేకలేశారు. ఇంత పట్నంలో వాళ్లని ఎక్కడని వెతకాలి? అనుకున్నారు.

అందరూ ఏడుస్తూ తలో వీధిలోనూ వెతకటానికి బయలుదేరి వెళ్లారు. కనిపించిన వాళ్లందర్నీ అడిగారు. మాకు తెలియదు అన్నారు. ఐస్‌క్రీం అమ్మే అబ్బాయిని అడిగితే ముసలమ్మ గురించి చెప్పాడు. అవతల వీధిలో ఓ ముసలమ్మ ఇద్దరు పిల్లల్ని చెట్టుకింద పెట్టుకు కూర్చుంది. పిల్లలిద్దరూ ఐస్‌క్రీం కావాలని ఏడ్చారు. నా దగ్గర డబ్బులు లేవు. రేపిస్తాను, రెండు ఐస్‌క్రీములు ఇమ్మంది. ఇచ్చాను అని చెప్పాడు. మన పిల్లలేమో అనుకుంటూ ఆదుర్దాగా అటువైపే పరుగెత్తారు అందరూ. అక్కడ ముసలమ్మ దగ్గరున్న పిల్లలిద్దరూ అమ్మ కావాలి అంటూ భోరున ఏడ్చేస్తున్నారు. ఈ పిల్లల్ని తల్లితండ్రులు దగ్గరకు జేర్చు తండ్రీ అని చేతులెత్తి మొక్కుకుంటోంది ముసలమ్మ.

ఇంతలో ధృవ, శారదల తల్లిదండ్రులకు దూరం నుంచి ముసలమ్మ ఆమె పక్కనే ఇద్దరు పిల్లలు కనిపించేసరికి వాళ్లంతా పరుగెత్తుకుంటూ అక్కడికి చేరుకున్నారు.

అమ్మా! అంటూ పిలిచి శారద తన తల్లిని కావలించుకుంది. ధృవ మాత్రం వాళ్ల అమ్మను, నేనురాను ఫో అన్నాడు. అమ్మా నన్ను కొట్టావుకదా, మీకంటే ఈ అవ్వే మంచిది అన్నాడు. అందరూ నవ్వుకుంటూ ధృవను ముద్దుపెట్టుకున్నారు.

ఫోన్:040-24069607






జనవరి 4 నుంచి
జనవరి 10 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, చర్చలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 5, 6 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పైఅధికారుల నుంచి మాటపడాల్సి వస్తుంది. లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 7, 8 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం అందుకుంటారు. 9, 10 తేదీల్లో సమావేశాలు, చర్చలకు ఆటంకాలు ఎదురవుతాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ప్రణాళికలు, దూరప్రయాణాలు, ఆర్థిక వ్యూహాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రదర్శనలు, వేడుకల్లో పాల్గొంటారు. 5, 6 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఒక సమాచారం కలవరపెడుతుంది. సమావేశాలు ఫలిస్తాయి. 7, 8 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. రవాణా, బోధన రంగాల వారికి ప్రోత్సాహకరం. 9, 10 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సంస్కరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, ఆరోగ్యంపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం పెద్దల ఆరోగ్యంపై శ్రద్ధ చూపుతారు. గత అనుభవంతో ఆర్థిక లక్ష్యాలు సాధిస్తారు. 5, 6 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. ఖర్చులు అధికం. 7, 8 తేదీల్లో విరాళాలు, చందాలకు వెచ్చిస్తారు. పన్నులు, బీమా వ్యవహారాలకు అనుకూలం. రహస్య సమాచారం తెలుసుకుంటారు. 9, 10 తేదీల్లో ఆర్థిక విషయాల్లో మీ వైఖరి సమీక్షించుకోవాల్సిన అవసరం ఉంది. రుణప్రయత్నాలు ఫలిస్తాయి.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వేడుకలు, సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. ప్రియతములతో ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 5, 6 తేదీల్లో పెద్దలు, పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవానికి భంగం కలిగే సంఘటనలు జరుగుతాయి. 7, 8 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ఒక సమాచారం ఆనందం కలిగిస్తుంది. 9, 10 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. సినీ, రాజకీయ రంగాల వారికి గౌరవ మర్యాదలు లభిస్తాయి.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, కొత్త పనుల ప్రారంభం, వృత్తిపరమైన వ్యూహాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. బీమా, గ్రాట్యుటీ, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 5, 6 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 7, 8 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 9, 10 తేదీల్లో బృందకార్యక్రమాల్లో సన్నిహితుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. 5, 6 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అధికం. 7, 8 తేదీల్లో ప్రియతములతో వేడుకల్లో పాల్గొంటారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. ప్రేమానుబంధాలు బలపడతాయి. 9, 10 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధవారం బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సీటు, స్థల మార్పు కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 5, 6 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. వేడుకల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 7, 8 తేదీల్లో అడ్వాన్సులు, రుణాలు అందుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. 9, 10 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారి అంచనాలు తప్పుతాయి. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రయాణాలు, సమావేశాలు, పెట్టుబడులు, విద్యావిషయాలు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో సంభాషణలు ఫలిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 5, 6 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. సన్నిహితుల ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపాలి. 7, 8 తేదీల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. భాగస్వామి విషయంలో శుభపరిణామాలు సంభవం. 9, 10 తేదీల్లో విలువైన పత్రాల విషయంలో జాగ్రత్త అవసరం. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

రుణాలు, పొదుపు పథకాలు, ఇంక్రిమెంట్లు, బోనస్‌లపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 5, 6 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల కోసం ఖర్చులు అధికం. పెట్టుబడులు, పొదుపు పథకాల్లో జాగ్రత్త అవసరం. 7, 8 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 9, 10 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. ఖర్చులు అధికం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

విద్య, వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు, ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు, చర్చలకు అనుకూలం. 5, 6 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. మార్పులకు అనుకూల సమయం కాదు. 7, 8 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. 9, 10 తేదీల్లో సహోద్యోగుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. కొత్త పనుల శ్రీకారానికి మంచి సమయం. ఆరోగ్యం మెరుగవుతుంది.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

దీర్ఘకాలిక పెట్టుబడులు, ప్రయాణాలు, వేడుకలు, సమావేశాలు, సంస్కరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, దూరప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 5, 6 తేదీల్లో ఒక సమాచారం కలవరపెడుతుంది. డ్రైవింగ్‌లో నిదానం అవసరం. వాగ్వాదాలకు దూరంగా ఉండాలి. 7, 8 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. వాయిదా పడుతున్న పనులు ఒక కొలిక్కి వస్తాయి. 9, 10 తేదీల్లో ఒక సమాచారం ఆవేదన కలిగిస్తుంది. దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, ప్రేమానుబంధాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 5, 6 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. వేడుకల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. 7, 8 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విలువైన పత్రాలు అందుకుంటారు. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. 9, 10 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలు, సమావేశాల్లో పాల్గొంటారు.



## రైటర్ కాళ్లు పట్టుకున్న మాస్టారు

మాస్టారంటే సుకుమార్. సుకుమార్ ఎంత మంచి డైరెక్టర్ అయినా కథ చెప్పడంలో బాగా వీక్! సినిమా కథ చెప్పమని అడిగితే కనీసం మూడునాలుగు గంటల టైము తీసుకుంటాడట! ఈ విషయం ఎవరో కాకుండా సుకుమారే స్వయంగా 'శ్రీవల్లి' సినిమా టీజర్ విడుదల సందర్భంగా చెప్పుకొచ్చాడు. ఈ సినిమాకు రైటర్, డైరెక్టర్ విజయేంద్ర ప్రసాద్ దర్శకత్వం వహించారు. ఈ సినిమా కథ విజయేంద్ర ప్రసాద్ చెప్పగానే సుకుమార్ భావావేశం ఆపుకోలేక ఆయన కాళ్లు పట్టుకున్నాడట! కేవలం 22 నిమిషాల్లో కథ మొత్తం చెప్పడం చూసి థ్రిల్ ఫీలయ్యాడట! ఆయనని తన గురువుగా భావించే కాళ్లు పట్టుకున్నానని సుకుమార్ చెప్పుకొచ్చాడు.




## అతిలోక సుందరి రాక ఎందుకో?



తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత మరణం తరువాత చాలామంది వచ్చి చిన్నమ్మను కలిసి వెళ్లారు. సానుభూతి వ్యక్తం చేశారు. అదంతా అప్పటి సంగతి. ఇప్పుడు తాజాగా అతిలోక సుందరి శ్రీదేవి చెన్నై వెళ్లి శశికళను కలిసి ఓ అరగంట పాటు వ్యక్తిగతంగా చర్చలు జరిపింది. మామూలుగా సానుభూతి వచనాలు చెప్పడానికి అరగంట కలవడం ఎందుకు? అదీ వ్యక్తిగతంగా? అన్న అనుమానాన్ని కోలీవుడ్ తమ్ముళ్లు వ్యక్తం చేస్తున్నారు. శ్రీదేవి జయలలితతో కలిసి బాలనటిగా చాలా సినిమాలు చేసింది. అభిమానం ఉంటే చనిపోయిన తరువాత వచ్చిచూసి వెళ్లాలి కానీ ఇప్పుడు తీరిగ్గా రావడంలో ఆంతర్యం ఏమిటి? అని చాలామంది ప్రశ్నిస్తున్నారు.

## యాభైలో యమ స్పీడు



**50** సంవత్సరాల వయస్సు వస్తోందంటే కొందరు ముసలాళ్లమైపోయామన్న అభిప్రాయంలోకి వచ్చేస్తారు. ఇక జీవితంలో సాధించాల్సింది ఏదీ లేదని ఫిక్సయిపోతుంటారు. ఇలాంటి వాళ్లు కండల వీరుడు సల్మాన్‌ని చూసి నేర్చుకోవలసిందే అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఈ వయస్సులో కూడా ఫోర్బ్స్ జాబితాలో నంబర్ వన్‌గా నిలిచాడు. అమ్మాయిల గుండెల్లోనే కాదు, తన సినిమాల కలెక్షన్లలో కూడా రాజేనని మురిసిపోతున్నారు సల్మాన్ అభిమానులు. 51లోకి అడుగుపెట్టిన సల్మాన్ ఇప్పటికైనా పెళ్లి చేసుకుని ఓ ఇంటివాడైతే బాగుండునని ఆయన అభిమానులతో పాటు బాలీవుడ్‌లో కూడా చాలామంది కోరుకుంటున్నారు.

## కనపడని నిర్మాత



'వంగవీటి' సినిమా మీద ఇంత పెద్ద చర్చ జరుగుతుంటే ఆ సినిమా నిర్మాత దాసరి కిరణ్ కుమార్ మౌనంగా ఉండిపోతున్నారు. సినిమా ఎలా వచ్చిందన్న విషయంలో కిరణ్ కుమార్ పాత్ర ఏమీ లేదట! ఆయనకి వర్మ చెప్పిన కథ వేరు. తీసింది వేరు.

దాంతో సినిమాలో రంగాను తక్కువ చేసి చూపించారని ఆయన అభిమానులు మండిపడిన సంగతి తెలిసిందే! సొంత సామాజిక వర్గం నుంచి వచ్చిన, వస్తున్న విమర్శలకు సమాధానం చెప్పలేకనే కిరణ్ కుమార్ మౌనంగా ఉన్నారనీ, అసలు మీడియా ఎదుట కనిపించడం లేదనీ అంటున్నారు. ఒకవేళ తప్పనిసరై కనిపించాల్సి వచ్చినా ఎక్కువ సేపు ఉండకుండా వెళ్లిపోతున్నారని అంటున్నారు.

## తప్పులో కాలేసిన సింగం

'సింగం' సీక్వెల్ 'ఎస్ 3' మూవీని హీరో సూర్య జనవరి 26కు పోస్ట్‌పోన్ చేసిన సంగతి తెలిసిందే! ముందు ఈ సినిమాను సంక్రాంతికి విడుదల చేయాలని అనుకున్నా, ఆ రోజు వస్తున్న రెండు పెద్ద సినిమాలతో పోటీ ఎందుకనుకుని సినిమా విడుదలను 26కి వాయిదా వేశారు హీరో, దర్శకనిర్మాతలు. ఈ ముగ్గురూ సరిగ్గా ఇక్కడే తప్పులో కాలేశారు అంటున్నారు సినీ జనాలు. ఇదే రోజున రెండు పెద్ద హిందీ సినిమాలు విడుదల అవుతున్నాయి. షారుఖ్ ఖాన్ 'రాయీస్'తో పాటు హృతిక్ 'కాబిల్' తెలుగు వర్షన్ కూడా విడుదల అవుతోంది. ఈ రెండు సినిమాల మధ్య 'ఎస్ 3'కి థియేటర్లు ఎన్ని దొరుకుతాయి? అన్నదే అసలు ప్రశ్న అంటున్నారు. ఈ రెండు సినిమాల విడుదల తేదీని ముందుగానే ప్రకటించారు. ఆ తేదీని చూసుకోకుండా 'ఎస్ 3'కి ముహూర్తం నిర్ణయించారని అంటున్నారు. తెలుగులో ఈ సినిమా కనీసం 20 కోట్లు వసూలు చేయాలి. అప్పుడే సినిమా సేఫ్ జోన్‌కి వెడుతుంది. అసలు థియేటర్లే ప్రశ్నార్థకంగా మారినప్పుడు వసూళ్లు ఆ స్థాయిలో రావడం కష్టమని దర్శక నిర్మాతలతో పాటు హీరో సూర్య కూడా టెన్షన్ పడుతున్నాడట!







# ఇస్తేనే చేస్తాను!

-సన్నీలియోన్

మొన్న పోర్న్ స్టార్, నిన్న హాట్ స్టార్, నేడు స్టార్‌లకే స్టార్...ఇదీ సన్నిలియోన్ సినీ ప్రస్థానం. చుట్టం చూపుగా బాలీవుడ్‌కి వచ్చిన సన్నీ చాలా తక్కువ కాలంలోనే స్టార్ హీరోయిన్‌గా గుండెల్లో రైళ్లు పరిగెత్తించే స్థాయికి చేరుకుంది. ఆమె ఖాతాలో బ్లాక్ బస్టర్లు లేవేమో కానీ, అట్టర్ ఫ్లాపులకు మాత్రం చోటు లేదు. కేవలం ఆమె కోసమే సినిమాకు వెళ్లే అభిమానులున్నారు అంటే సన్నీ ఏ స్థాయిలో ప్రేక్షకులను ప్రభావితం చేసిందో అర్థం చేసుకోవచ్చు. బాలీవుడ్‌లో నెమ్మదిగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంటున్న సన్నీ 'రాయీస్' సినిమాకి ప్రత్యేక ఆకర్షణగా మారనుంది. షారూఖ్ ఖాన్ నటించిన ఈ సినిమాలో ఓ స్పెషల్ సాంగ్‌తో తన అభిమానులకే కాదు మొత్తం సినీ అభిమానులకు సైతం కనువిందు చేయనుంది. అలనాటి జీనత్‌ని గుర్తుకు తెచ్చేలాగా సాగిన ఆ పాట గురించి సన్నీ మాటల్లోనే....

## 'రాయీస్'లో 'లైలా మై లాలా' పాట గురించి..

ఈ సినిమాలో ఈ పాటకు డ్యాన్స్ చేయడం నా అదృష్టం. నా జీవితంలో జరిగిన మధురమైన సంఘటన ఏదైనా ఉంది అంటే ఈ పాటకు నేను డ్యాన్స్ చేయడమే! జీవితంలో మరిచిపోలేని అనుభూతి ఇది. ఈ పాట గురించి దర్శకుడు రాహుల్ ఢోలాకియా నన్ను అడిగినప్పుడు ఒక్క క్షణం సందేహించాను. ఎవరినో అడగాలనుకుని నా దగ్గరకు వచ్చారేమో అన్న అనుమానం వచ్చింది. నా గురించే వచ్చానని స్పష్టంగా చెప్పారు. అయినా ఎక్కడో చిన్న సందేహం ఉండేది. కాస్ట్యూమ్ ట్రైల్స్ జరుగుతున్నప్పుడు కూడా ఈ పాట నేను చేస్తానా లేదా అని అనుమానపడుతూనే ఉండేదాన్ని. అన్నీ పూర్తి చేసుకుని ప్రాక్టీసు చేస్తున్నప్పుడు కూడా సందేహం కలుగుతూనే ఉండేది. చివరికి ఈ పాటకు నన్ను కాకుండా వేరేవారిని తీసుకుంటారేమో అని భయం కలిగేది. ఆ భయంతోనే ప్రాక్టీసుకి వెళ్లేదాన్ని. ఈ సాంగ్ నేను చేశానంటే ఇప్పటికీ నాకు నమ్మబుద్ధి కావడం లేదు. ఎందుకంటే షారూఖ్ ఖాన్ లాంటి హీరో సినిమాలో చిన్న పాట కానివ్వండి, నేను చేయడమా? అంతే కాదు జీనత్ గారు గొప్ప డ్యాన్సర్. ఆవిడ చేసిన పాటకు నేను స్టెప్పులు వేయాలి. ఇది సాధ్యమేనా? ఇన్ని సందేహాలు కలిగేవి. ఈ పాట చిత్రీకరణ పూర్తి కావడంతో నా సందేహాలన్నీ తీరాయి. నా అదృష్టం కొద్దీ పాటలో ఆవిడ వేసిన స్టెప్పులు కాకుండా కొత్తవి కంపోజ్ చేశారు. పాట మాత్రమే తీసుకున్నారు కానీ, డ్యాన్స్ అంతా డిఫరెంట్‌గానే ఉంటుంది.

## షారూఖ్‌తో చేస్తానని అనుకున్నారా?

ఆయనతో చేయాలని ఇక్కడికి వచ్చినప్పటి నుంచీ కలలు కంటున్నాను. కానీ అది ఇంత త్వరగా నెరవేరుతుందని మాత్రం అనుకోలేదు. ఆయన ఎక్కడా, నేను ఎక్కడా? మొదటి రోజు షూటింగ్‌లో ఆయనని చూసి ఉద్వేగం ఆపుకోలేక పోయాను. ఏడవాలనిపించింది.

అది సమయం కాదని నాకు నేనే సర్ది చెప్పుకున్నాను. తొలి రోజు షూటింగ్‌లో ఉద్వేగం



గానే గడిపాను. తరువాత తరువాత అలవాటు పడిపోయాను. ఇప్పటి యువతకు ఒకటే చెబుతున్నాను. కలలు కనండి. కానీ వాటిని సాకారం చేసుకోవడానికి ప్రయత్నించండి. అప్పుడే జీవితంలో అభివృద్ధి చెందుతారు. దానికి నేనే పెద్ద ఉదాహరణ. కష్టపడితే ఫలితం తప్పకుండా లభిస్తుంది.

**ఈ పాటకు ఇంత గుర్తింపు వస్తుందని ముందే ఊహించారా?**

పాట చాలా ఫేమస్ కాబట్టి మంచి గుర్తింపే వస్తుందని అనుకున్నాను. కానీ ట్రైలర్‌నే కొన్ని లక్షల మంది చూశారంటే సినిమాని ఇంతకన్నా గొప్పగా ఆదరిస్తారన్న నమ్మకం కలిగింది. నా నమ్మకం వమ్ము కాదు. ఈ సినిమా సక్సెస్‌లో తప్పకుండా నాకూ భాగం ఉంటుంది.

**బాలీవుడ్‌లో ఇంత మంది హీరోయిన్లు ఉండగా ఈ అవకాశం మీకే ఎందుకు వచ్చిందంటారు?**

నిజమే. ఇక్కడ బాగా డ్యాన్స్ చేసే హీరోయిన్లు చాలా మందే ఉన్నారు. వాళ్లని కాదని ఎక్కడి నుంచో ముంబయి వచ్చిన నాకు ఇంత మంచి అవకాశం ఇచ్చారంటే అది దర్శక నిర్మాతలది, హీరో గొప్పతనమే తప్ప నేను ఏదో పెద్ద డ్యాన్సర్‌ని కాదు.

**భవిష్యత్తులో బాద్‌షాతో పూర్తి స్థాయిలో సినిమా చేసే అవకాశం ఉందంటారా?**

ఉండచ్చేమో! షారూఖ్ సార్‌తో చేయాలని ఎవరికి ఉండదు? సినిమా మొత్తం ఆయనతో చేయాలన్న కోరిక నాకూ ఉంది. బహుశా అది వచ్చే సంవత్సరం నెరవేరుతుందేమో చూడాలి.

**మిసెస్ గౌరీఖాన్ మీ పాటను చూశారా?**

చూడడమే కాదు, మెచ్చుకున్నారు కూడా! ఓ మహిళ నా డ్యాన్స్‌ను చూసి మెచ్చుకున్నారంటే నేను నూటికి నూరు శాతం పాసైనట్టే! ఒక వర్గానికి నా డ్యాన్స్ నచ్చదేమో అన్న అనుమానం ఉండేది. గౌరీఖాన్‌గారి కాంప్లిమెంట్‌తో అది తీరిపోయింది. 'రాయీస్'లో నా డ్యాన్స్ యూత్‌కి మాత్రమే కాదు అన్ని వర్గాల ప్రేక్షకులకి తప్పకుండా నచ్చి తీరుతుంది.

**2016 ఎలా గడిచింది?**

అప్ అండ్ డౌన్స్ చాలా ఉన్నాయి. జీవితం అంటే అదే కదా! కెరీర్ పరంగా ఎలా ఉన్నా, ఓ సంఘటన ఈ సంవత్సరం నాకు అంతులేని సంతోషాన్ని మిగిల్చింది. మా బ్రదర్ ఇన్ని రోజులకి పెళ్లి చేసుకుని ఓ ఇంటి వాడయ్యాడు. నా కష్టం సుఖంలో ఎప్పుడూ నాకు తోడు నీడగా ఉంటాడు. ఇన్ని రోజులకి వాడికి ఓ ఫ్యామిలీ ఏర్పడిందంటే నాకు అంతకు మించి సంతోషం ఏముంటుంది. మా ఫాదర్, మదర్ ఇద్దరూ లేరు. నాకు వాడు, వాడికి నేను. వాడి జీవితంలో ఓ గొప్ప మలుపు తీసుకొచ్చిన ఈ సంవత్సరం నాకు మరిచిపోలేని సంవత్సరంగా మిగిలిపోయింది.

**సన్నీలియోన్ వలన యువత చెడిపోతోంది అంటున్నారు దానికి మీ జవాబు?**

నేను పోర్న్ స్టార్‌ని నిజమే! ఆ విషయం నేనేమీ దాచిపెట్టలేదు. ఆ పదాన్ని పట్టుకుని నన్ను ఎంత ఇన్సల్ట్ చేశారో నాకు తెలుసు. హీరోయిన్ ముసుగులో ఎంత అసభ్యంగా డ్రస్ చేసుకున్నా ఫర్వాలేదు. అదే నేను వేసుకుంటే ఎవరినో చెడగొడుతున్నాను అంటున్నారు. నా సినిమాలు కానీ, నా వీడియోలు కానీ చూడమని ఎవర్నీ బలవంత పెట్టలేదు. ఎవరైతే చెడిపోతున్నారో వారిని నా సినిమాలు కానీ, వీడియోలు కానీ చూడవద్దని చెప్పండి, బాగుపడతారేమో! బాలీవుడ్‌లోనే ఇలాంటి వాతావరణం చూస్తున్నాను. హాలీవుడ్‌లో పరిస్థితి ఇలా ఉండదు. పోర్న్ స్టార్‌ని అయినా అక్కడ చాలా గౌరవం ఇస్తారు. ఇక్కడకొచ్చే సరికి నేనేదో చేయకూడని పని చేస్తున్నట్టు ఫీలవుతున్నారు. చెడ్డతనం అనేది నా సినిమాలు, వీడియోల్లో లేదు. మనుషుల బుర్రల్లోనూ, వారి ఆలోచనల్లోనూ ఉంది.

నన్ను మారమని చెప్పడం కన్నా వారిని ముందు మారమని చెప్పండి. బాలీవుడ్‌కి వచ్చి ఐదు సంవత్సరాలు అయిపోయినా నన్ను ఇంకా పోర్న్ స్టార్‌గానే గుర్తిస్తున్నారు తప్ప నటిగా గుర్తించడం లేదు. ఇదే అప్పుడప్పుడు బాధపెడుతూ ఉంటుంది. పోర్న్ స్టార్‌గా ఉన్నప్పుడు కూడా ఇంత బాధ పడలేదు.

**డబ్బు కోసమే సినిమాలు చేస్తున్నారని అన్నారట?**

నిజమే! సినిమాల్లోకి వచ్చింది డబ్బు కోసం కాక ఎవరినో ఉద్ధరించడానికి రాలేదు. డబ్బు ఇస్తేనే సినిమాలు చేస్తాను. నా చేత ఫ్రీగా సినిమాలు చేయించుకునే ఆలోచన దర్శకనిర్మాతలకు ఉందేమో నాకు తెలియదు కానీ, నాకు మాత్రం అలాంటి ఆలోచన లేదు.

-చిన్ని



# ఇంటర్వ్యూ

## ఫొటోగ్రఫీలో శిక్షణ

పూరీగారి సలహాతో బొంబాయి వెళ్లి ప్రముఖ ఫొటోగ్రాఫర్ భరత్‌మీర్‌చందాని వద్ద శిక్షణ పొందాను. తర్వాత రామ్‌గోపాల్‌వర్మగారి బావ సుబ్బరాజుగారు నన్ను ప్రఖ్యాత ఫొటోగ్రాఫర్ సుబిశామ్యూల్‌గారి దగ్గర అసిస్టెంట్‌గా చేర్చారు. అలా ఫొటోగ్రఫీలో బ్రహ్మాండంగా తర్ఫీదు పొంది మెళకువలన్నీ నేర్చుకుని హైదరాబాద్ వచ్చి బంజారాహిల్స్ రోడ్‌నెంబర్-3లో 'ది ఫేసెస్' అనే ఫొటో స్టూడియో పెట్టాను. పూరీజగన్నాథ్‌గారి తోనే ప్రారంభోత్సవం చేయించాను. స్టూడియోకు ఎంతో మంచి పేరు వచ్చింది. 2001 నుండి 2004 వరకు స్టూడియో నడిపి మంచి అనుభవం సంపాదించుకున్నాను.

## అసిస్టెంట్ డైరెక్టర్‌గా

కెమెరామేన్ రసూల్‌గారి దగ్గర అసిస్టెంట్‌గా చేరాను. ఆయన దర్శకుడు కూడా. ఆయన పూర్తి పేరు రసూల్ ఎల్లోర్. ఆయన దర్శకత్వంలో భగీరథ చిత్రం విడుదలైంది. ఈ చిత్రానికి నేను అసిస్టెంట్ డైరెక్టర్‌గా కూడా పనిచేశాను. ఈ చిత్రం ఎంతో విజయవంతంగా ఆడింది. ఇది నా సినీ జీవితానికి ఒక ప్లస్ పాయింట్. ఇటు ఫొటోగ్రాఫర్‌గా, అటు అసిస్టెంట్ డైరెక్టర్‌గా ఒకే ఒక సినిమాతో మంచి అనుభవం సంపాదించుకున్నాను. రవితేజ, శ్రియ, ప్రకాష్‌రాజ్ నటించిన ఈ చిత్రానికి చక్రి సంగీతం సమకూర్చారు. 2005లో ఈ చిత్రం విడుదలైంది.

# లోబడ్జెట్‌లో కొత్త ఆలోచనలు, సరికొత్త సినిమాలు

## -కృష్ణుడు

**తెలుగు తెరపై భిన్నంగా కనిపించే నటుడు కృష్ణుడు. 'మొదటి సినిమా'తో తెరంగేట్రం చేసి 'జయమ్ము నిశ్చయమ్మురా'తో దూసుకుపోతున్నాడు. రెండు దశాబ్దాలుగా ప్రేక్షకులను, దర్శకులను కూడా మెప్పిస్తున్న నంది అవార్డు నటుడు. కొత్త ఆలోచనలతో, కొత్తపంథాలో, లోబడ్జెట్ చిత్రాలు నిర్మించాలనే ఆశయంతో యువదర్శకులెందరో సినిమారంగంలో ప్రవేశించారంటున్న కృష్ణుడు ఇంటర్వ్యూ....**

కవులు, కళాకారులకు నిలయమైన విజయ నగరంలో జన్మించాను. మా నాన్నగారి పేరు అల్లూరి సీతారామరాజు. అమ్మ సావిత్రీదేవి. నాలుగో తరగతి వరకు నిడదవోలులో, నైన్త్ వరకు విశాఖ పట్నంలో, టెన్త్ క్లాస్ కాకినాడలో చదివాను. బెంగళూరులో పాలిటెక్నిక్ కోర్సు, ఆటోమొబైల్‌లో డిప్లొమా చేశాను.

## ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లో శిక్షణ

1997లో హైదరాబాద్ చేరుకుని కమలాపూర్ కాలనీలో ఉన్న దేవదాస్ కనకాలగారి ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లో చేరాను. రాజీవ్ కనకాలగారు కూడా అప్పుడప్పుడు మాకు క్లాసులు చెప్పేవారు. వారి అమ్మగారు లక్ష్మిగారు రెగ్యులర్‌గా క్లాసులు చెప్పేవారు. 1998లో ఈ కోర్సు పూర్తిచేశాను. నాతోపాటు శ్రీవాస్తవ్‌గారు కూడా డైరెక్షన్‌లో ట్రైనింగ్ పూర్తి చేసి ఎన్నో చిత్రాలకు కో డైరెక్టర్‌గా చేస్తున్నారు.

శిక్షణ పూర్తయి ఆఫర్స్ వస్తున్న సమయంలో నా స్కూటర్‌ని లారీ డీకొట్టి మేజర్ యాక్సిడెంట్ జరిగింది. ఫ్రాక్చర్ కావడంతో రాజోలు సమీపంలోని మా సొంతూరు చింతపల్లి వెళ్లిపోయాను. నటీమణి హేమ కూడా రాజోలు నివాసే. వారి సహకారం నాకు బాగా లభించింది.

## పూరీజగన్నాథ్ సలహా

నేను లావుగా ఉంటాను కదా. దాంతో ఇద్దరు ముగ్గురు దర్శకులు నిరుత్సాహపరిచారు. నువ్వు సినిమాలకి పనికిరావు అన్నారు. నాకు మొదటి నుంచీ ఫొటోగ్రఫీ అంటే ఇష్టం. పూరీజగన్నాథ్‌గారు నాకు సన్నిహితులు. ఫొటోగ్రఫీ కోర్స్ నేర్చుకోమన్నారు. ముంబయ్‌లో ఫొటోగ్రఫీ నేర్పేవాళ్లున్నారు, వెళ్లమని సలహా ఇచ్చారు. బొంబాయిలో ఫొటోగ్రఫీ నేర్చుకుంటే అంతర్జాతీయ స్థాయిలో కూడా పేరు వస్తుంది.

## షార్ట్ ఫిలిమ్ హీరోగా

భగీరథ చిత్రం షూటింగ్ చివర్లో ఉండగా, సందీప్ అనే నా మిత్రుడొకరు నాతో ఒక షార్ట్ ఫిలిమ్ చేద్దామని నన్ను సంప్రదించాడు. అదో హిందీ చిత్రం. 'ఛే ఫీట్‌నిచ్చే' అని పేరు పెట్టాం. ఇందులో నాది మెయిన్ రోల్. మాఫియా డాన్ క్యారెక్టర్. ఈ పాత్రలో నేను బాగా క్లిక్ అయ్యాను.

## మనోడు

ఒక యాడ్ ఫిలిమ్ ఓనర్ నేను నటించిన యాడ్ ఫిలిమ్ చూశారు. చాలా బాగా చేశావని మెచ్చుకున్నారు. నీ నటన నాకు నచ్చింది, 'మనోడు' చిత్రంలో నటిస్తావా? అని అడిగారు. ఈ చిత్రంలో నేను 'బీర్బల్' పాత్ర పోషించాను. (అంటే బీరు తాగి బాగా బలంగా ఉండే పాత్ర అన్నమాట, నవ్వు). ఓ మోస్తరుగా ఆడింది. టెన్త్

క్లాస్ చిత్రం హీరో భరత్ ఇందులో నటించాడు. ఈ చిత్రంలో ఇంకా రాధికాదీప్తి, విశ్వేందర్‌రెడ్డి, కె.జె.శర్మ, రత్నకుమారి తదితరులున్నారు. 2006లో ఈ చిత్రం విడుదలైంది.

### 'మొదటి సినిమా'

నా మొదటి చిత్రం మనోడు. కానీ ఆ తర్వాత నటించిన 'మొదటి సినిమా' దీనికంటే ముందుగా విడుదలైంది. కూచిపూడి వెంకట్ దర్శకత్వంలో నిర్మించిన ఈ చిత్రం పూర్తి రొమాంటిక్ చిత్రం. నవదీప్, పూనమ్‌బజ్వా తదితరులు నటించారు. 2005లో ఈ చిత్రం విడుదలైంది.

### హీరో స్నేహితుడి పాత్రలు

ఈ రెండు చిత్రాల తర్వాత ఇక నిదానంగా సినిమాలు చేయడం ప్రారంభించాను. హీరోలకు స్నేహితుడు పాత్రల్లో నటించాను. మహేష్‌బాబు నటించిన పోకిరి చిత్రంలో అతడి స్నేహితుడి పాత్రలో చేశాను. దాదాపు ఈ వేషాలన్నీ బాగా పండాయి.

### హ్యాపీడేస్

శేఖర్ కమ్ములగారు హ్యాపీడేస్ చిత్రంలో పిలిచి అవకాశం ఇచ్చారు. నాకు చిన్న పాత్ర ఇద్దాం అనుకున్నారు. కానీ నా అంకితభావం ఆయనకు నచ్చింది. లోగడ కొన్ని సినిమాల్లో ఆయన నన్ను గమనించారు. నా పాత్ర పొడిగించి గుర్తింపు వచ్చేలా చేశారు. ఇందులో నాది సీనియర్ స్టూడెంట్ పాత్ర. నాకంటూ ప్రేక్షకుల్లో గుర్తింపు తెచ్చిన చిత్రం 'హ్యాపీడేస్'. ఆయన నిర్మించిన గోదావరి చిత్రం నాకెంతో ఇష్టం. ఐదారుసార్లు చూశాను.

### ఊహించని మలుపు 'వినాయకుడు' చిత్రం

'హ్యాపీడేస్' షూటింగ్ సమయంలో సాయికిరణ్ గారు పరిచయమయ్యారు. 'వినాయకుడు' చిత్ర దర్శకుడు ఆయనే. అప్పటికే ఆయన దగ్గరున్న ఈ చిత్ర కథను నాతో షేర్ చేసుకున్నారు. ఆ కథ నాకు బాగా నచ్చింది. దాంతో నువ్వే హీరోగా చెయ్యాలన్నారు. హీరో పాత్రలో అదృష్టం నాకు అలా తన్నుకొచ్చిందనే చెప్పాలి. హాస్యరస ప్రధాన చిత్రమిది. ఇందులో నాతోపాటు సోనియాదీప్తి, పూనమ్‌కౌర్, సత్యాకృష్ణన్, అంకిత తదితరులు నటించారు. నా నట జీవితాన్ని మలుపుతిప్పిన సూపర్‌హిట్ చిత్రమిది. ఈ చిత్రానికి నంది అవార్డు, నాకు ఉత్తమనటుడు అవార్డు లభించింది.



నవ్యవీక్లీ చదువుతూ...

### ఇన్ఫీరియారిటీని దూరంచేసే చిత్రం

'వినాయకుడు' నాకు బాగా నచ్చిన చిత్రమే కాదు, ప్రేక్షకులు మెచ్చిన చిత్రం. థియేటర్‌లో జనం హర్షధ్వానాలు కురిపిస్తుంటే నేనెంతో హాయిని అనుభవించాను. తృప్తిగా అనిపించింది. లావుగా ఉన్నామనీ, పొట్టిగా ఉన్నామనీ, మరుగుజ్జుగా ఉండిపోయామనీ ఇన్ఫీరియారిటీతో బాధపడేవారు ఎందరో. నల్లగా ఉన్నామనీ, అంగవైకల్యం ఉందనీ బాధపడుతుంటారు. అలాంటి కాంప్లెక్స్‌ను పోగొట్టడానికి ఎంతో దోహదం చేసే చిత్రం వినాయకుడు. ఈ చిత్రం చూసి ఎంతోమంది నాకు ఫోన్లు చేశారు. మంచిమనసు ఉన్న మనిషి ఎలా ఉన్నాగానీ పట్టుదలతో అనుకున్నది సాధిస్తాడన్నదే ఈ చిత్ర కథ. అలాంటి కథకు హాస్యం జోడించి ప్రేక్షకులకు అందించారు దర్శకుడు సాయికిరణ్. ముఖ్యంగా మనుషుల్లో ఆత్మస్థైర్యం కలిగించే చిత్రం. 2008లో విడుదలైంది. 2009లో విడుదలైన మరో చిత్రం 'విలేజ్‌లో వినాయకుడు'. ఈ చిత్రం కూడా ఎంతో బాగా ఆడింది.

### గోపాల గోపాల

'గోపాల గోపాల' చిత్రంలో వెంకటేష్‌గారికి అసిస్టెంట్ పాత్రలో నటించాను. ఇది కూడా నాకు మంచిపేరు తెచ్చిపెట్టింది. వెంకటేష్‌గారిలో ఉండే సిన్సియారిటీ, డిసిప్లిన్ నాకు ఎంతో నచ్చాయి. ఆయన నాకు మంచి స్ఫూర్తిని ఇచ్చారు. నటనలో ఎన్నో మెళకువలు ఆయన దగ్గర నుంచి నేర్చుకున్నాను. పవన్‌కల్యాణ్‌గారితో ఈ చిత్రంలో ఒక సీన్‌లో నటించాను. ఆయన నాకు మంచి మిత్రుడు కూడా.

### నచ్చిన పాత్రలు చేస్తా

హీరో పాత్రలకే నేను పరిమితం కాలేదు. నాకు నచ్చిన పాత్రలన్నీ నేను చేస్తాను, అది ఎలాంటిదైనా సరే. 'ఏం మాయ చేశావే' చిత్రంలో నాగ చైతన్య స్నేహితుడిగా నటించాను. ఓయ్ చిత్రంలో సిద్దార్థ స్నేహితుడిగా నటించాను. ఈ పాత్రలన్నీ బాగా పండాయి. నాకు ఎంతో పేరు తీసుకువచ్చాయి. ఇలా దాదాపు 100కు పైగా చిత్రాల్లో నటించాను.

### మరువలేని ఘటన

వినాయకుడు చిత్రంలో సాయికిరణ్‌గారు నాకు హీరోగా అవకాశం ఇవ్వడం నా జీవితంలో నేను ఎప్పటికీ మరువలేని సంఘటన. నేను ఎన్నో ఒడిదుడుకుల్లో ఉన్నప్పుడు నటుడుగా నేను నిలదొక్కుకునేందుకు, నటనపైనే నా దృష్టి కేంద్రీకృతమయ్యేందుకు దోహదపడ్డారు సాయికిరణ్‌గారు. నన్ను ప్రోత్సహించి పరిశ్రమలో నిలదొక్కుకునేలా చేశారు. ఈ చిత్రాన్ని ప్రేక్షకులంతా ఆదరించారు.

ఈ మధ్య 'జయమ్ము నిశ్చయమ్మురా'లో హీరోయిన్ అన్నయ్య పాత్ర చేశాను. అందరూ మెచ్చుకున్నారు. ఫోన్లు చేస్తున్నారు.



కుటుంబసభ్యులతో...

### ఇప్పుడు కళాకారులకు అవకాశాలు ఎన్నెన్నో!

ఐదేళ్లక్రితంతో పోలిస్తే ఇప్పుడు సినిమా రంగం పచ్చపచ్చగా ఉంది. ఇప్పుడు కళాకారులకు ఎన్నో రకాలుగా అవకాశాలు వస్తున్నాయి. షార్ట్ ఫిలిమ్స్ తీస్తున్నారు. తక్కువ బడ్జెట్ చిత్రాలు తీస్తున్నారు. ఇవన్నీ బాగా క్లిక్ అవుతున్నాయి. ఈ మధ్య వచ్చిన 'పెళ్లిచూపులు', 'మిథునం' చిత్రాలు ఈ కోవకు చెందినవే. పైగా ఎన్నో ఛానల్స్ కూడా వచ్చాయి. మీడియా ఒక మధ్యవర్తిగా వ్యవహరిస్తూ కళాకారుడికి మంచి గుర్తింపు తీసుకొస్తోంది. మంచి చిత్రాలను ప్రేక్షకులు ఎప్పుడూ ఆదరిస్తారు.

కొత్త ఆలోచనలతో, కొత్త పంథాలో, లోబడ్జెట్‌లో చిత్రాలు నిర్మించాలి అనే దృక్పథంతో ఎంతో మంది యువదర్శకులు పరిశ్రమలోకి వచ్చారు. ఇదెంతో సంతోషకరమైన విషయం. ప్రేక్షకుల నాడిని బట్టి ప్రజంట్ ట్రెండ్‌లో సినిమాలు తీస్తున్నారు. కనుక సినీ పరిశ్రమలో అప్పటికీ ఇప్పటికీ పోల్చి చూస్తే చాలా మార్పులు వచ్చాయి. ప్రయోగాత్మకమైన మార్పులు వస్తాయి. ప్రయోజనాత్మకమైన కుటుంబ కథా చిత్రాలు కూడా ఎన్నో వస్తాయి.

ప్రస్తుత హీరోల్లో అందరూ బాగా నటిస్తున్నారు. నేను చిరంజీవి ఫ్యాన్‌ని.

ప్రస్తుతం పెద్దవంశీగారి దర్శకత్వంలో 'ఫ్యాషన్ డిజైనర్ సన్నాఫ్ లేడీస్ టైలర్' చిత్రంతోపాటు మరో రెండుమూడింటిలో నటిస్తున్నాను. ఆఫర్స్ వస్తున్నాయి. కథ కూడా చూసుకుంటున్నాను.

### కుటుంబం

నా భార్య పేరు లలితా గాయత్రి. మా అమ్మాయి పేరు శ్రీనిత్య. ప్రైమరీ క్లాస్ చదువుతోంది. నాకు సీ ఫుడ్ అంటే ఎంతో ఇష్టం. అందులోనూ చేపలు, రొయ్యలు, పీతలు అంటే మరీ ఇష్టం. నాటుకోడి కూర అంటే ఇంకా బాగా ఇష్టం.

**-కె.హరనాథ్**

**సెల్: 97035 42598**

# ఇవన్నీ నిజాలే!

A బహమనీ సుల్తానులకు, విజయనగర రాజులకు మధ్య 150 సంవత్సరాల కాలం (క్రీ.శ.1350-1500)లో సుమారు పది యుద్ధాలు జరిగాయి.

•••

A ప్రఖ్యాత రచయిత ఎడ్గార్ అలన్ పో రచనలు చేసే సమయంలో తన పెంపుడు పిల్లిని భుజం మీద కూర్చోబెట్టుకునేవాడు.

•••

A స్టాలిన్‌కి సినిమాలంటే మహాపిచ్చి. తనకోసం ఒక ప్రైవేట్ థియేటర్ నిర్మించుకున్నాడు. చార్లీచాప్లిన్, టార్జాన్ సినిమాలు ఎక్కువ చూసేవాడు.

•••

A వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు ఈ ముగ్గురినీ భారతీయ కవిత్రయం అంటారు. వీరి రచనల సారాంశం, ఆ వాసనలు అన్ని భాషల్లోనూ కనిపిస్తాయి.

•••

A జార్జి వాషింగ్టన్ గొప్ప డాన్సర్, అథ్లెట్, హార్స్‌మన్. చదివించే స్తోమత లేకపోవడంతో 15వ యేటనే తల్లి అతన్ని స్కూలు మాన్పించింది. తెల్లటి అతడి వంకీ జుత్తు చూపరులకు విచిత్రంగా ఉండేది. కానీ అది ఒరిజినల్ హెయిర్!

•••

A ఏడు కోట్లమంది ప్రాణాలు బలితీసుకున్న అడాల్ఫ్ హిట్లర్ ఫక్తు శాఖాహారి. జంతు హింసకు అతడు బద్ధ వ్యతిరేకి!

•••

## చంద్రునిపై నీరు

A వందల కోట్ల సంవత్సరాల క్రితం కుజ (అంగారకుడు) గ్రహం అంత పెద్ద సైజులో ఉన్న గ్రహం ఒకటి భూమిని ఢీకొట్టడం వల్ల చంద్రగ్రహం ఏర్పడిందని ఆమ్‌స్టర్‌డామ్ యూనివర్సిటీ పరిశోధకులు చెబుతున్నారు. ప్రస్తుతం భూమ్మీద కంటే ఎక్కువ పరిమాణంలో నీరు చంద్రునిపై అప్పట్లో ఉండేదని కూడా వారంటున్నారు!!

•••

A స్టాలిన్ కొడుకు యాకోవ్ నాజీ సైనికులకు దొరికిపోయాడు. వాళ్లెంత బ్లాక్‌మెయిల్ చేసినాగానీ స్టాలిన్ లొంగలేదు. చివరకు యాకోవ్ జర్మన్ జైలులో బహుశా చిత్రహింసలకు గురై మరణించాడు.

•••

A రెండవ ప్రపంచ యుద్ధంలో రెడ్ ఆర్మీ లక్షలమంది జర్మన్ యువతులపై అత్యాచారాలు జరిపింది. ఈ యువతులంతా 13-17 మధ్య వయస్కులే.

•••

A క్రీ.శ.1641లో నివసించిన క్రైస్తవ మిషనరీ పేరు ఫ్రాన్సెస్కో మాంకో. అతడి కార్యకలాపాల కారణంగా గోల్కొండ, మచిలీపట్నం, భీమిలిలలో తొలి చర్చిలు వెలిశాయి.

-చిన్నారి

# సుధామ పదగారడి-295

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | h | 2 | 3 | | h | 4 | h |
| 5 | h | | h | | h | 6 | h | |
| h | | h | 7 | | 8 | 8 h | | h |
| 9 | | 10 | | h | 11 | 12 | | 13 |
| | 11 h | | h | 14 | h | | h | h |
| h | 15 | 15 h | 16 | h | | h h | 17 | h |
| 18 | | | h | | h | 19 | h | |
| h h | | h | 20 | | | h | h | h |
| 21 | | | h | | h | 22 | | |

## ఆధారాలు

**అడ్డం**

2. దివ్వె (3)
5. వివరణము, క్రమము, కారణము(3)
6. పాయ, బ్రద్ద (3)
7. బిల్డింగ్, ఓ మాజీ ముఖ్యమంత్రి గారింటిపేరు (3)
9. సంస్థ నిర్వహణకు ప్రధాన సూత్రధారి (4)
11. నగ్నము, దిసమొలతో వుండడం (4)
16. ధర్మశాస్త్రకర్త, దళితుల నిరసనకు గురి అవుతున్నవాడు (3)
18. అచిరప్రభ (3)
19. పసిబిడ్డ (3)
20. తెలంగాణలోని సుప్రసిద్ధ సరస్వతీక్షేత్రం (3)
21. క్షుత్ (3)
22. శుకము (3)

**నిలువు**

1. డైరీ అంటే ఇది రాసుకోవడానికేనా?(4)
3. నావ(3)
4. పార్వతీదేవి యే! (4)
7. భరించేవాడు కాబట్టి ఇలా అంటారట మొగుణ్ణి! (2)
8. శివుని వాహనం (2)
9. కలకత్తా దేవత (2)
10. అవివాహిత స్త్రీ (2)
12. అరవై నిముషముల కాలము (2)
13. ....భలే రామచిలుకా! రంగేళీ నవ్వులమొలక (2)
14. వైష్ణవులకు పవిత్ర మాసము ఇది (5)
15. ఏటేటా చేసే దుక్కి యొక్క ప్రారంభము '....సాగాలోయ్ రన్నో చిన్నన్న!' (4)
17. పద్నాలుగు నిలువు కాలంలో గోదాదేవి విరచితమైన వీటిని గానం చేస్తూంటారు వైష్ణవులు (4)

## పదగారడి-294 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2017 | 1 సూ | త | 2 స | సం | 3 ప | త్స | 4 రం | 2017 |
| 5 మూ | పు | 2017 | వ్య | 2017 | ర | 2017 | 6 భా | ష |
| 2017 | ర | 2017 | త | 2017 | ము | 2017 | ఫ | 2017 |
| 7 క | ము | 8 రు | 2017 | 9 మే | 2017 | 10 న | లం | 11 దా |
| ల | 2017 | 12 మ | 13 రు | లు | 2017 | వ | 2017 | చ |
| 14 శం | 15 కు | 2017 | క | 2017 | 16 త | ల | 17 పా | గా |
| 2017 | వ | 2017 | 18 తా | 19 క | ట్టు | 2017 | ర | 2017 |
| 20 మే | ల | ము | 2017 | ల | 2017 | 21 వే | కు | వ |
| 2017 | యం | 2017 | 22 వే | ము | షి | 2017 | లు | 2017 |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

